శ్రీరస్తు

# అనంతుని ఛందము

అను నామాంతరముగల

# ఛందోదర్పణము



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్రకటితము.

 [Price Rs. 2-0-0

# విషయసూచిక.



# ఉపోద్ఘాతము.

## అనంతామాత్యుఁడు.

అనంతామాత్యుని చరిత్ర - విమర్శకులకు తెలిసినంత మట్టుకు-ఆంధ్రవిజ్ఞాన సర్వస్వములోను, ఆంధ్రకవుల చరిత్రలోను ఉన్నది. చర్విత చర్వణముగా అందులోని విషయములనే మరియొకసారి చర్చించి వ్రాయుట అనవసరము; కనుక వానిలోని సారాంశములను మాత్రము సంగ్రహించి తెలియజేయుచున్నాము.

అనంతుడు ఆరువేల నియోగి బ్రాహ్మణుడు; కౌండిన్యగోత్రజుడు. ఇతనిముత్తాతయైన బయ్యనార్యుకు తిక్కనసోమయాజి 'భవ్యభారతి" అన్నబిరుదిచ్చెనట. అనంతుడు రచించిన గ్రంథములు 1. భోజరాజీయము, 2 ఛందోదర్పణము, 3. రసార్ణవము. భోజరాజీయములో ఉన్న 'సీ. విలసితంబగు కృష్ణవేణా," అనుపద్యమునుబట్టి అనంతుని తండ్రియైన తిక్కన కృష్ణామండలములోని శ్రీకాకుళమున కొలువైయున్న యాంధ్రవల్లభుని సేవచేయుచుండె" ననియు, రసార్ణవమందున్న "శా. శాకేంద్రశకవర్షముల్" అనుపద్యమునుబట్టి ఇతడు క్రీ. శ. 1435. జనవరి నెల 25 ది॥ రసార్ణవము రచియించి దేవాంకితము చేసినట్లు తెలియవచ్చుచున్నది కనుక, ఇతడు 15-వ శతాబ్దము నడుమ నున్న వాడనియు నిస్సందేహముగా చెప్పవచ్చును.

ఛందోదర్పణములో నాలుగవ ఆశ్వాసము చివర నొకపద్యమందు భోజరాజీయమును మాత్రమే పేర్కొనుటచేత అనంతుడు మొట్టమొదట భోజరాజీయము, తర్వాత ఛందోదర్పణము, అటుపిమ్మట రసార్ణవము రచించి ఉండునని ఊహించవచ్చును.

## గ్రంథవిశేషము.

తెలుగున లక్షణగ్రంథము లనేకముగా ఉన్నవి. వీటిలో అనేక గ్రంథము లింకను అచ్చుపడలేదు. 1917 సం॥న కవిజనాశ్రయము ఆంధ్ర సాహిత్య పరిషత్తువారిచే క్రొత్తగా ప్రకటితమైనది. నేటికి శ్రీవావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారిచే ఈ ఛందోదర్పణము ప్రకటితమైనది. * రంగరాట్ఛందము మొదలయిన గ్రంథములు వీరిచే త్వరలో అచ్చుపడవలసి ఉన్నవి. ఇదివరకు చాలాకాలమయి అచ్చుపడి ప్రచారములో ఉన్నవి సులక్షణసారము, అప్పకవీయము.

అనంతుడు భీమకవినిగాని కవిజనాశ్రయమునుగాని ఎఱిఁగి ఉన్నట్లు కనబడదు.

అనంతుని ఛందోదర్పణమును ఎదుటనుంచుకొని అప్పకవి కొన్నివృత్తములకు లక్ష్యములు వ్రాసినట్లు స్పష్టముగా కనిపించుచున్నది. మదరేఖ, తోదక, మనోజ్ఞ, ప్రియకాంత, నర్కుటము శిఖరిణి, పృథ్వి మొదలయిన వృత్తలక్ష్యపద్యములు అనంతుని పద్యములలోని పదములతో కనబడుచున్నవి. వీటిలో ఒక్కటి చూడండి:—

అజశివ శక్రనిరంత।రార్చిత పద్ద్వయున్
భుజగకు లాధిప తల్పు।బూని నుతింపగా
నజయతినొంది నజాభ।రార్చితమైచనున్
బుజావగు సర్వమనోజ్ఞ।మున్యనురాగమై. అనంతునిది.

అజమృడవాసవసంత। తార్చితపాదకుం
కజయుగళిన్ హరినిర్వి।కారు మనోజ్ఞసా
బుజావగు వృత్తమునందు। శ్రీ లినుతింపగా
నజజభరంబులు వొల్పు।నచ్చిన దిగ్యతిన్. అప్పకవిది.

---

* 1932 సం॥న ముద్రింపఁబడినది.

ఈలాగున అనంతుడు కవిజనాశ్రయము ఎదుట నుంచుకొని తన ఛందోదర్పణమును వ్రాసియుండునేమో. అది ఎంతయో శోధించి చూచినను పద్యములలో పోలిక ఎక్కడనయినను కనబడలేదు.

కవిజనాశ్రయముకంటె ఛందోదర్పణము పెద్దగ్రంథము. కవిజనాశ్రయములో సంజ్ఞాధికారమందు గణఫలములు, గణగోత్రములు, గణలింగములు, టీకాక్షరములు మొదలయిన విషయములగురించి 35 పద్యములున్నవి. ఛందోదర్పణములో వీనిలో ముఖ్యమైన విషయములగురించి 6 పద్యములు మాత్రమే ఉన్నవి. గాని వర్ణ, ప్రాసములు, షట్ప్రత్యయములు ..వీని గురించి ఛందోదర్పణములో ఉన్నన్ని విషయములు కవిజనాశ్రయములో లేవు.

1. "క. పరగగణియుపదియారా .." ఛందో. పుట 61; కవి. పు. 52.
2. "క. క్రమమునఁ బ్రస్తారము .." ఛం. పు. 85; కవి. పు. 76.
3. "సీ. వృత్తములకును .." ఛం. పు. 69; కవి. పు. 67.

ఈ మూడుపద్యములు రెండుగ్రంథములందున్ను కనబడుచున్నవి. వీనిలో మొదటివి రెండున్ను ఎవరుచెప్పినవో ఏగ్రంథములో ఇవి ప్రక్షిప్తము లయినవో తెలియదు. మూడవది ఛందోదర్పణములోనిదే గాని కవిజనాశ్రయములోనిది కాదని మరియొకచోట టీకలలోనే తెలియచేసినాము.

అనంతుడు 105 సమవృత్తభేదములను 9 విషమవృత్తభేదములను చూపించినాడు. కవిజనాశ్రయములో 128 సమవృత్తభేదములున్ను 6 విషమవృత్తభేదములున్ను ఉన్నవి.

జాత్యుపజాతులగురించి ఛందోదర్పణములో చెప్పినంత గ్రంథము కవిజనాశ్రయములో లేదు. రగడలు, కళికలు, ఉత్కళికలు వీనినిగురించి కవిజనాశ్రయకర్త ఏమిన్ని చెప్పలేదు.

లక్షణగ్రంథములన్నిటిలోను ఛందోవిషయములు ఎక్కువగా వివరించి చెప్పినది అప్పకవీయమే అనుటకు సందేహములేదు. అందుచేతనే, అప్పకవి

"క. ఒకకావ్యకంటె మఱికొం,
డొకటి వినూతనపుఁ జెప్పుచుండుఁగవులకున్
సకల గ్రంథములును జదు,
వక తెలియఁగ లక్షణప్రపంచం బెల్లన్.

క. ఇది చదివినచిక్కుట మఱి,
రొంపిరోయనియుఁ జదువుబుద్ధియేలా కొదవన్
ఇదె(?)పడి గ్రంథములన్నియు
వెదకివెదకి సారమెల్ల వివరింపఁగ నే."

అని వ్రాసియున్నాడు. అయితే నిరంకుశాధికారమును వహించిన వానివలె తన ఇష్టానిష్టములబట్టి లక్షణములను అతడు శాసించినాడు. శ్రీ వావిళ్లవారు ఇప్పుడు త్వరలో అచ్చొత్తింపించబోయే అప్పకవీయ టీకలో అది తెలియచేయుట యుక్తముగా ఉండును; గాని, ఇక్కడ చర్చించుట అనవసరము.

## గ్రంథప్రచారము.

"క్రీ. శ. 1620-వ సంవత్సరప్రాంతములందు కవిగాఁ బ్రసిద్ధికెక్కిన వాఁడు" అని వీరేశలింగము పంతులుగారు చెప్పిన చిత్రకవి అనంతయ "హరిశ్చంద్ర నలోపాఖ్యాన ప్రకాశికలో" (V. 8.) "క. ప్రథమాంతవిభక్తులపై..." అనే—ఛందోదర్పణములోని—పద్యమును ఉదాహరించినాడు ఈ పద్యమునే 16-వ శతాబ్దాంతమున ఉండిన వాడని వీరేశలింగముపంతులు గారు చెప్పిన ముద్దరాజు రామన్న "రాఘవపాండవీయాదర్శము" లో (I. 2, iii. 65) రెండుచోట్ల ఉదాహరించినాడు. అంతేకాదు "పోణిమి" అని ణకారముగా చెప్పవచ్చుననుటకు, "శివ శిరగయునుడు..." అనేపద్యము అనంతుని ఛందమందున్నట్లు ముద్దరాజురామన "రాఘవపాండవీయాదర్శము" లో (II. 6) చెప్పినాఁడు; గాని, ఆపద్యము ఛందోదర్పణములో కనబడదు.

ఈపద్యము ఎవరిదో తెలియదు. "ఇంబు", అనే ప్రయోగమునకు ఆ ఆదర్శము లోనే (2. 98) 'ఇంబడరగా భుజనంబులని యనంతుని ఛందఃప్రయోగము" అనికూడా ఉన్నది. ఇది అప్పకవీయములో లయగ్రాహికి లక్ష్యలక్షణ పద్యముగా కనిపించుచున్నది గాని ఛందోదర్పణములో కానరాదు అయితే అప్పకవి "పదచ్ఛేదవశ శాబ్దమధ్యమునందుండిన లక్షణవేత్త" అని టీకా లింగముమంతులుగారు వ్రాసినారుగదా; అప్పకవి పద్యమును ముద్దరాజురామన ఎట్లుదాహరించి యుండును! ఇంతకంటెను ఆశ్చర్యమైనదేమంటే, చిత్రకవి అనంతయగారి హరిశ్చంద్రనలోపాఖ్యాన ప్రకాశికలో ద్వితీయాశ్వాసాంతమున (శ్రీవఝల చినసీతారామస్వామిశాస్త్రులవారి విమర్శనముతో కలిసి శ్రీవావిళ్లవారిచే ప్రకటితమైన ప్రతి పుట. 128) పద్యాంత వృత్త వ్యాఖ్యలో "ఈవృత్తమునకే కోలకాకము నామాంతరము కలదు. లక్షణము:—కొలిచెదనాదిదేవు...(అప్పకవీయము. అ. ౪.)" అని ఉన్నది. ఈ గ్రంథము మొదట అచ్చొత్తించిన పూండ్లరామకృష్ణయ్యగారో పూర్వలేఖకులో అప్పకవీయ పద్యములను ఈ వ్యాఖ్యానములలో చూర్చి ఉండవలెను. నేనుచూచిన తాటాకుపుస్తకములందు ఇది కానరాలేదు.

## పాఠనిర్ణయము.

శ్రీవావిళ్ల వేంకటేశ్వరులు తమవద్దనున్న 14 ప్రతులు శోధించి పాఠనిర్ణయముచేసి గ్రంథ మచ్చొత్తించినారు; వారు నావద్దకంపిన ముద్రితగ్రంథమును, నావద్దనున్న శ్రీపరవస్తువారి ప్రతిని, పరిశీలించి ఈ ఉపోద్ఘాతమును టిప్పణిని వ్రాసినాను.

## ఛందోవిషయములు.

ముఖ్యమైన ఛందోవిషయముల ఈ చిన్నపీఠికలో ఇముడ్చుటకు వీలయినంత మట్టుకు చర్చించి లాక్షణికులలో గల మతభేదములను తెలియజేయుచున్నాను.

## వడి.

“యతి పర్యాయపదములలో వడియనునది తెలుఁగు; దాని వ్యుత్పత్తి యజ్ఞాతము” అని జయంతి రామయ్యపంతులుగారు కవిజనాశ్రయ పీఠికలో వ్రాసినారు. వారు వ్రాసినట్లు ‘వడి’ ‘వళి’ అనేవి తెలుగుమాటలనిన్ని వడు అనే అచ్చమాటతో సంబంధము కలవి అనిన్ని నాఅభిప్రాయము. యతి, విరతి మొదలయిన పర్యాయపదములతో పాటు వడి (వళి) అనేమాటను లాక్షణికులు వ్యవహరించుచున్నను దీనికి ఒక అర్థవిశేష మున్నట్లు స్పష్టముగా కనిపించుచున్నది. “అద్యోవళిః” అనే ఆంధ్రశబ్దచింతామణి సూత్రములోను, అందుకు అనువాదముగా ఉన్న తెనుగు లక్షణగ్రంథములలో పద్యములందున్ను ‘వడి, (వళి)’ అనే ఉన్నదిగాని ‘యతి, విరతి’ మొదలైన పర్యాయపదములలో మరి యేదీ కనబడదు. చూడండి.

1. “చరణాద్యక్షరమే వడి” కవిజనాశ్రయము.
2. “పాదప్రథమాక్షరము త్పాదితముగ వళియనఁగ” కావ్యాలంకారచూడామణి.
3. “వానగల మొదలి వ్రాయి వడియనఁబరఁగు” ఛందోదర్పణము.
4. “చరణచరణమున కాద్యక్షరములు వళులయ్యె” అప్పకవీయము.

ఈసందర్భమున వడి (వళి)కి బదులుగా యతి, విరతి మొదలయిన పర్యాయపదములలో మరియేదిన్ని వాడకూడదన్నట్టే తోచును. సంస్కృత శ్లోకములలో పాదములమధ్యమందు విశ్రాంతిమాత్రమే ఉంటుందిగాని తెలుగు పద్యములలో ఉన్నట్టు అక్షరమైత్రి లేదు. గనుకనే కాబోలువడి (వళి) యను తెలుగుమాట తెలుగుఛందస్సులలో వాడవలసివచ్చినది. వడు అంటే మార్గమని అర్థము. పద్యపాదము విశ్రాంతిననుసరించి రెండుభాగములు కాగా ఆ భాగ

ములమొదటి అక్షరములు పాదభాగములకు మార్గము చూపించిన ట్లుండుటచేతను, మొదటిభాగముయొక్క ప్రథమాక్షరముతో (అనఁగా పాదాద్యక్షరముతో) రెండవభాగము మొదటి అక్షరము మైత్రిగలదిగా ఉండవలెనన్న నియమము ఆధారమై ఉన్నది గనుకను, వడి (వళి) అని మీఁదచూపించిన స్థలములలో లాక్షణికులు ప్రయోగించి ఉందురని నా అభిప్రాయము.

## వడిభేదములు.

కవిజనాశ్రయములో పదివిధములైన వళ్లుమాత్రమే ఉన్నవి. కావ్యాలంకారచూడామణిలో పంద్రెండున్ను, ఛందోదర్పణములో ఇరువైనాలుగున్ను అప్పకవీయములో నలువది ఒకటిన్ని, వళిభేదములు కనిపించుచున్నవి. ఈలాగున వళ్లసంఖ్య ఎక్కువతక్కువగా ఉండుటకు కారణమేమై ఉండును? తక్కువగా వళ్లు పేర్కొన్నవారికి పరిశీలన లోపముకలిగినదా? లేక, ఎక్కువగా చెప్పినవారు అనవసరముగా వళ్లసంఖ్య అధికముచేసినారా? లేక కవులు స్వతంత్రించి క్రొత్తక్రొత్త ప్రయోగములుచేసి ఉండుటచేత తర్వాతి లాక్షణికులు వళ్లసంఖ్య ఎక్కువచేయవలసి వచ్చినదా? ఈవిషయములు చక్కగా విమర్శించవలసి ఉన్నది గనుక కవిజనాశ్రయము, కావ్యాలంకారచూడామణి, ఛందోదర్పణము, అప్పకవీయము .. ఈనాలుగింటిలో ఉన్న వళ్లభేదములు ఒకపట్టికలో చూపించి విమర్శించుచున్నాను:—

| కవిజనాశ్రయము-10 | కావ్యాలంకారచూడామణి-12 | ఛందోదర్పణము-24 | అప్పకవీయము-41 |
|---|---|---|---|
| 1. స్వరయతులు। | 1 స్వరములు | 1 స్వరయతులు | 1 స్వరమైత్రి |
| | | | 2 స్వరప్రధానయతి |
| | 2 వృద్ధివళులు | 2 నూఘస్వరయతి | 3 లుప్తవిసర్గయతి |
| | | | 4 వృద్ధివళులు |
| | | 3 ఋకారస్వరూపయతి | 5 ఋవళి |
| | | 4 ఓవిరమము | 6 ఋత్వసంబంధవళి |
| | | | 7 ఋత్వసామ్యయతి |
| వ్యంజనయతులు. | | 5 ఋకారవిరతి | |
| 2 వర్గయతులు | 3 వర్గములు | 6 వర్గయతి | 8 ప్రాణివిరామము |
| | | | 9 వర్గయతులు |
| 3 పోలికవడి | 4 మకారవళి | 7 పోలికవడి | 10 మువిభక్తి |
| | | | 11 మకారయతులు |
| 4 సరసయతి | 5 ఇతరేతరవర్గములు | 8 సరసయతి | 12 సరసవళులు |
| | | | 13 ఋణాయతులు |
| | | | 14 ఊష్మయతులు |
| 5 బిందుయతి | 6 సబిందువర్గములు | 9 అనుస్వారయతి | 15 బిందుయతులు |
| | | | 16 అనుస్వారసంబంధయతులు |

10 అఖండ

10 ఆదేశవశి
11 దేశీయవశి

12 (మాధవ)

(వివరాలు)

21 నిత్యసమాస యతులు

22 ప్రభుసామాంతర యతులు

23 విభాగయతులు
24 నిత్యయతులు

32 నిత్యసమాసయతులు
33 దేశ్యనిత్యసమాస యతులు

34 సామాఖండ యతులు

35 రాగమయతులు
36 విభాగయతులు
37 నిత్యయతులు
38 యుష్మదస్మచ్ఛబ్ద యతులు
39 పరరూపయతులు
40 పంచమీవిభక్తి యతులు
41 ప్రాసవిశ్రాంతి

14. ర-ఱ-డ

15. హాయులకు స్వరమైత్రి — వ్యంజనము పాటించకుండా హకార యకారముల పైని ఉన్న స్వరములకు ప్రత్యేకించి వడి చెప్పవచ్చును.

16 గూఢస్వరవ్యంజనములు కడిగొనము పాటింపవచ్చును.

ఉ. 'దాసోఽహం' అన్యోన్య'లో అ', పరాకస'లో ఓ'
జగజ్జనకుడు'లో 'త్', వాగ్ఘరి'లో' క్'

17. సంయుక్తవ్యంజనములలో' ఏవ్యంజనమునకు వడి ఉంచినా చాలును; గాని పాదమున మూడునాలుగు చోట్ల వడి కావలసిన వృత్తములలో స్రగ్ధరాది వృత్తములలో సర్వత్ర ఏదో ఒకవ్యంజనమునే పాటించవలెను.

18. ఉభయవడులు-అఖండవడి—(వీటిని గురించి ప్రత్యేకముగా చర్చ చేయవలసినది.)

19. ప్రాసవడి.

పైన ఉదాహరించిన వాటిలో 1, 4, 5, 6, 7, 8, 11, 15, 17 సర్వలాక్షణిక సమ్మతములు.

2-వ దానిలో ఇ ఈ ఎ ఏ ఋ ౠలకు మైత్రిమాత్రమే కవిజనాశ్రయములోను కావ్యాలంకారచూడామణిలో ఉన్నవి; తక్కిన విషయములు మూడున్ను అనంతుడున్ను అప్పకవియు చెప్పినారు. అయితే అప్పకవి చెప్పినట్లు మూడున్ను మూడుభేదములుగా చెప్పక అనంతుడు రెండుభేదములుగానే చెప్పినాడు.

3-వ ది అనంతుడు మాత్రమే చెప్పినాడు తక్కినలాక్షణికులు దీనిని గురించి ఏమీ చెప్పినట్లు కనబడదు. అవసరమునుబట్టి ఇదియు ఒప్పుకోవలసినదే.

9-వ దానిలో ఙంల్-ల్; ఙంట్-ల్; అని బిందుయతులందును ల్-ల్ అని సరసయతులందును, అందరున్ను చెప్పినారు. ఇదిగాక, ఙంల్-ల్; ఙంట్-ట్; ఙంల్-ఙంట్ వేరభేదములుగా అప్పకవి చెప్పినాడు; గాని అనవసరము, బిందుసరసయతులబట్టి ఇది సాధించవచ్చును.

10-వ దానిలో ఙంరు-రు అని మాత్రమే బిందుయతి కింద అందరును చెప్పినారు. ఙంయు-యు అనే దకారయతి అనంతుడు అప్పకవి చెప్పినారు విన్నకోట పెద్దన చెప్పలేదు. అప్పకవీయములో తిమ్మకవి లక్ష్యముగా భీమన చాటుపద్యము (చ. గరళపు ..) ఉన్నది. ఈభీమనే కవిజనాశ్రయ కర్త అయితే ఈయతిభేదము తన లక్షణగ్రంథములో ఎందుకు చేర్చలేదో!

12-వ దానిగురించి భారతములో ప్రయోగములున్నా కవిజనాశ్రయములోగాని కావ్యాలంకారచూడామణిలోగాని ఏమీచెప్పలేదు. అనంతుడు వపులకుమాత్రమే మైత్రిచెప్పి దీనికి అభేదవిరతి' అని పేరుపెట్టినాడు. వపులకు అభేదమున్నదిగాని వపులకు లేదుగదా! గనుక, ఈపేరుదీనికి సార్థకము కాలేదు. అప్పకవి అందుచేతనే వపులకు అభేదవిరతి ఙపవలకు అభేదవర్గ యతులనిన్ని పేర్లుపెట్టినాడు. అయితే, రెండవదానిలో మొదటిదికూడా ఇమిడి ఉన్నది గనుక ఙపవలమైత్రి (అభేదవర్గయతి) అని ఒక్కటిగాచెప్పితే చాలదా!

13-వ దానిగురించి కవిజనాశ్రయములోగాని కావ్యాలంకార చూడామణిలోగాని ఏమీ కనబడదు జ్ఞనలకు మాత్రము వడి అనంతుడు చెప్పినాడు జ్ఞ ఙకలకుకూడా వడిగలదని తిక్కనసోమయాజి ప్రయోగమాధారముగా తీసికొనిచెప్పినాడు. గాని సోమయాజి మరిఎక్కడను ఇటువంటి ప్రయోగముచేయలేదు ఈ ప్రయోగమైనాచేసి ఉండదనిన్ని ఇది సరియైన పాఠముకాదనిన్ని కొందరి అభిప్రాయము. ఇదిసరియైనపాఠమే అయితే తిక్కనసోమయాజిగారి కాలముననే జ్ఞకు తాలవ్యోచ్చారణ మారి ఇప్పుడు వున్నట్టు గ్య' అని కంఠ్యోచ్చారణ వచ్చినదని ఊహించవలెను. నన్నయ

ఈపది వాడలేదు; మీదచెప్పిన ప్రయోగముకాక పూర్వకవిప్రయోగము మరి యొకటి కనబడలేదు గాని, ఉత్తరాంధ్రకవులు కొందరువాడినారు.

14-వ దానిగురించి స్పష్టముగా చెప్పినవాడు అప్పకవి. స్పష్టముగా లక్షణముచెప్పకపోయినా, అనంతకవి తాను వ్రాసిన పద్యములో శిథిలత మైత్రి పాటించుటచేత అతనికి మైత్రి ఇష్టమే అని ఊహింపవలసి ఉన్నది. (భూ. మా. 1, 95) లేక మైత్రికలదని ఎక్కటియతి గురించి వ్రాసిన పద్యములో చెప్పినాడు. వీటినిగురించి కవిజనాశ్రయములోను కావ్యాలంకారచూడామణిలోను ఏమీ చెప్పియుండలేదు. లేమైత్రికి ఆదిపర్వమందే ప్రయోగమున్నది.

16-వ దానిలో నాలుగువిషయము లున్నవి. రెండువిధములయిన సంధికార్యములచేత స్వరమున్ను మరిరెండువిధములయిన సంధికార్యములచేత వ్యంజనమున్ను గూఢముగా ఉంటవి. ఈనాలుగు విషయములను నాలుగు విధములైన యతులుగా అప్పకవి పేర్కొన్నాడు (లుప్తవిసర్గ, వృద్ధి, అంత్యోష్మసంధి వికల్పసంధి) వీటిలో స్వరసంబంధమైనవి రెండున్ను ఒక్కటిగాచేసి అనంతుడు మూడువిధములయిన యతులు పేర్కొన్నాడు. చిన్నకోటపెద్దన వృద్ధివళులగురించే లక్షణముచెప్పి ఆదేశయతికి లక్ష్యముగా ఇచ్చినపద్యములో లుప్తవిసర్గవళికూడా సరిపోయినట్లు 'అనోగ్నస్య'లో గూఢస్వరమునకు 'అ' తో వడి కూర్చినాడు. గూఢముగాఉన్న వ్యంజనముగూర్చి ఏమీ చెప్పలేదు. కవిజనాశ్రయములో వీటిగూర్చి ఏదిన్ని చెప్పియుండలేదు. నన్నయ భారతమందు కాక తక్కిన కొన్ని పూర్వగ్రంథములందు వీటికి లక్ష్యములు చూపించవచ్చును.

16.వ దాని గురించి మతభేదము లున్నవి.

సుప్రసిద్ధమైన ప్రయోగములు అనేకముగా ఉండుటచేతను పేరు పొందిన లాక్షణికులలో కొందరిసమ్మతికలదు కనుకను అభ్యంతరపడి ఒప్పుకోక

తప్పదని, "తెలుగు" అనే పత్రికలో సం॥ 9-10 లో నేను వ్రాసిన వ్యాసము చూడండి.

అఖండవడి ఒప్పుకొన్న తర్వాత ప్రాదిమొదలయిన ఉభయవడులు వేరే పేర్కొనుట అనవసరము. కాకుప్లుతము మొదలయిన వాటిలో స్వరము ప్రధానము అని చెప్పితే చాలును. అఖండవడి ఒప్పుకొనకపోవుటచేత అనంతుడు కొన్ని ఉభయవడి విభాగములు ఏర్పరుపవలసివచ్చినది. అతడేర్పరచిన విభాగములలో చేరక కొన్ని అఖండవళ్లు కనిపించడముచేత అప్పకవి మరికొన్ని విభాగములేర్పర్చవలసివచ్చినది 12 విధములయిన ఉభయవళ్లు అప్పకవి పేర్కొన్నా వీటిలో దేనిక్రిందనూ రాని అఖండవళ్లు కనబడుతూనే ఉన్నవి ఉ. ఏవార్థకవడి; ఆముగ్వడి; చతుర్థీ విభక్తివడి మొదలయినవి.

19-వ ది గీతాద్యుకాతులలో తప్ప మరెక్కడను దీని ప్రయోగనములేదు గనుకను, అక్షరమైత్రితో సంబంధములేదు గనుకను, దీనిని పూర్వలాక్షణికులు యతులలో పేర్కొనలేదు. యతికి బదులుగా వచ్చేదిగనుక ఇదిన్ని ఒకయతిభేదమే అని అప్పకవి పేర్కొన్నాడు.

## అనవసరముగా చెప్పిన యతిభేదములు

భిన్నయతులు, ప్రత్యేకయతులు —అనంతుడు, అప్పకవి పేర్కొన్నారు. 'చేరిది' * లో ఉన్న 'రీ'కిన్ని 'దివిజ' లో ఉన్న 'దీ'కిన్ని మైత్రి కలదు; చేరియ దిలో ఉన్న 'రూ'కు అకారముతో మైత్రి కలదు; 'ధరించె' $ లో ఉన్న 'రి'కి రేఫతో మైత్రి కలదు 'ధరియించె' లో ఉన్న 'యా'కి ఇకారముతో మైత్రి గలదు; అని ప్రత్యేకముగా క్రొత్తయతిభేదములనేల ఎందుకు చెప్పవలెనో తెలియదు. చేరిదిలో ఉన్న రకారముపై స్వరము విరుగనన్ను భేదముకాదని చెప్పవలెనంటే, అలాగునే చెప్పరాదా! ఇటువంటివి ఇంకా ఉన్నవి; ఎన్ని పేర్కొనగలము! ఉ ఉన్నది, (ఉన్న + అది), ఉన్నవి

* చూ. అప్పక. అనంత 128. $. చూ. అప్పక. అనంత. 123.

ములు 'మయరలవ' లు అని కవిజనాశ్రయములోను 'మరలవ' లు అని కావ్యాలంకారచూడామణిలోను, 'మరలశవ' లు అని ఛందోదర్పణములోను ఉన్నది.

బిందుయతినిబట్టి, మా'క ఙ్ంబతో వడి ఉండగా, 'మ' ఎట్లు ఎక్కటి వడి కాగలదు? సరసయతినిబట్టి అయవాలకు వడి చెల్లగా, 'య' ఎట్లు ఎక్కటి వడికాగలదు? రకారములోను, లకారములో 'శా' కు వడి అంగీకరించిన అనంతుడు శా ఎక్కటి వడిగా ఎట్లుచెప్పగలడు?

ఇది అంగాచక్కగా విమర్శించేకాలోలు అప్పకవి, రఱలకే వికలర యతుల క్రింద చేర్చాన్నాడు.

లాక్షణికులు పాటించిన అక్షరమైత్రి చాలామట్టుకు "తుల్యాస్య ప్రయత్నం సావర్ణ్యం" అనేధర్మమునుబట్టే ఏర్పడ్డదని చెప్పవచ్చును. గాని ఈదిగువ నుదాహరించినవాటిలో తుల్యాస్య ప్రయత్నము పూర్తిగా ఉన్నట్లు కనబడదు.

1. ఇ. ఎ ఋ ఋకారము మూర్ధన్యముగదా! తాలవ్యాచ్చులతో ఎట్లు మైత్రి కలుగును? అయితే, ఋకారమునకు తాలవ్యోచ్చారణ పూర్వము ఉండెను. గనుకనే కృష్ణుడు. కిత్తడయినది* రానురాను ఋకారమునకు తాలవ్యోచ్చారణమారి ఉత్వములో కలిసిన రేఫోచ్చారణవచ్చినది ఋౠలు రురూలని తెలుగువారు పలుకుచున్నారు. ఇది అనంతుని నాటికేవచ్చినట్లు కనబడుచున్నది 'ప్రుక్క రేఫయుతమేగాని పృక్క' అని ఋకారయుతము కాదని చెప్పినాడు. ఇటువంటిదే ఇవడి.

2. దంత్య 'చజస' లకు తాలవ్య 'చజశ'లకు మూర్ధన్య 'ష' కారము నకు మైత్రి ఎట్లు సావర్ణ్యమునుబట్టి కలిగినది? వీటిమైత్రి కంటె సెలవు'లా

---

* ప్రాకృతభాషలలోను, పాలిలోను ఋకారము కొన్నిచోటల ఇకారమయినది. అరవములో కృ—కిరు, తెలుగులోను, కన్నడములోను కృ—క్రి.

సి' యన్ను 'శలభము'లో ఉన్న 'శ' యన్ను మైత్రి తెలుగువారి ఉచ్చారణ బట్టి ఎక్కువగా ఉన్నట్లున్నది ఇవి అన్నీ ఊష్మములు గనుక వాటికి మైత్రి కలదు అంటే, హకారముకూడా ఊష్మము, ఉపధ్మానీయజిహ్వామూలీయములు కూడా అట్టివే. అంతస్థములయిన 'యరలవ''లకేల మైత్రి లేదు?

3. లఘ్వలఘు యకారములకు తుల్యాస్య ప్రయత్నము పూర్తిగా ఉన్నదా? 'యామిని' లోని 'య' వచ్చినయప్పుడు' లోని 'య'—ఈ రెండున్ను ఒక్కలాటివా?

4. నణలు భిన్నవర్గములు, అనునాసికత్వమే సామాన్యము అంటే, తక్కిన అనునాసికలతో ఎందుకు మైత్రి కూడదు? తత్సమతద్భవములలో నణలు మారుచుండును. ఉ. గుణము గోనము; సావర్ణ్యము కొంతవరకుండ బట్టే ఈ రెండును ఒకదాని కొకటి వచ్చునంటే, దడలు ఈలాగునే దేశ్యపదము లలో కనిపించుచుండగా; వాటికి మైత్రి ఎందుకు చెప్పరాదు? ఉ. దొంగ, డొంగ, దాకలు; డాకులు, సంస్కృతమందు తకార మొకప్పుడు టకారమగును గదా.

5. లడలకు, వ బలకు (వ ≤ బ) అభేదమున్న కారణముచేత మైత్రి అంగీకరించినప్పుడు, రలల కెందుకు మైత్రి ఉండరాదు? (సరిరము, సలిలము; రేఖ, లేఖ)

6. తెలుగులో గవలు, లన'లు కొన్నిమాటలలో మారుచుండును ఉ. పగడము, పవడము, తెలుగు, తెనుగు.

## వడిస్థలము

సంస్కృతశ్లోకములలో విశ్రాంతి ప్రధానము; ఖండాద్యక్షర మైత్రి కావలెనన్న నియమము లేదు. తెలుగు పద్యములలో ఖండాద్యక్షర మైత్రి ప్రధానము విశ్రాంతి (అనగా పదము ముగియవలెనన్న) నియమము లేదు విశ్రాంతి ఐచ్ఛికముగా ఉండుటవల్ల మేలే కలిగినదని చెప్పవచ్చును. అన్ని పాద

ములలోను విశ్రాంతి ఒక్కచోటనే ఉండుటకంటె మారుచూ ఉంటే పద్యము రసోచితముగా ఉండుటకు వీలుండును. అక్షరమైత్రి కావలెనని కోరేవారు విశ్రాంతిస్థలమందు వడిపాటించుట మంచిదే కాని విశ్రాంతిస్థలమును నిర్ణయించుటలో రసజ్ఞులైన కవులు తమ స్వాతంత్ర్యము విడగొట్టుకో కూడదని నా మతము.

లక్షణసూత్రములు మీరరాని వన్నట్లున్నా కవులుకొద్దిగా స్వాతంత్ర్యమును చూపించకపోలేదు. సంస్కృతలాక్షణికులు వృత్తములలో ఎక్కడెక్కడ విశ్రాంతి ఉండవలెనని చెప్పినారో ఆవృత్తములకు సరియైన తెలుగు పద్యములలో ఆయాస్థలములందే వడి నియమము సాధారణముగా ఉన్నది; గాని, చాలా చోట్ల తప్పినది. ఉదాహరణములు —

1 భుజంగప్రయాతము:—సంస్కృతమున 6 అక్షరముల తర్వాత * తెలుగున 7 తర్వాత వేదము వేంకటరాయశాస్త్రులవారు సంస్కృత పండితులు గనుక సంస్కృతనియమమే పాటించినారు.

2. పంచచామరము —సం. 8, తెలుగు 9.

3. శిఖరిణి —సం, 6; తె. 12.

4. ఆర్యాదిజాతులు:—చూడండి, మూలము III 3 .4.

తెలుగుపద్యములలోనే వళిస్థలముల గురించి లాక్షణికులలోను కవుల లోను మతభేదమున్నది. చూడండి —

1. పృథ్వి

సంస్కృతములో 8. ఈమర్యాద ననుసరించినవారు పెద్దన.

| | |
|---|---|
| అప్పకవి అనంతుడు, విన్నకోట పెద్దన కవిజనాశ్రయకర్త వీరి మతమున | 11 తర్వాత ఈ నియమమును నన్నయ రామరాజ విభూషణుండు మొదలయిన వారు పాటించినారు. |

---

* కొందరు లాక్షణికులు ఎన్ని అక్షరములయిన తర్వాత వడి ఉండునో ఆసంఖ్య తెలియచేతురు కొందరు ఎన్నవ అక్షరము వడిగలదో ఆసంఖ్య తెలియచేతురు. సంకేతభేదమే గాని, స్థితి ఒకటే.

తాళంభొట్లు మతమున 13 తర్వాత

2. కవిరాజవిరాజితము:—

అప్పకవి మొదలయిన లాక్షణికు లందరిమతమున పాదాక్షరములలో 8 వది, 14 వది, 20 వది మొదటి అక్షరముతో మైత్రి గలది. కవిజనాశ్రయములో —(చూ పు. 49) రెండవపాదమున "కామనిభా" * అనుచోట మాత్రము వడి తప్పినది గాని, అప్పకవి మొదలయిన వారు చెప్పినట్లే వడి ఉన్నది.

కంకంటిపాపరాజు మొదలయిన కవులు కొంద రిట్లే వడి పాటించినారు. కాని నన్నయ, పెద్దన, ఎఱ్ఱన మొదలయినవారు కొందరు పాదమధ్యమున ఒక్కచోటనే వడి పాటించినారు.

3. మధ్యాక్కర —

లాక్షణికు లందరును మూడుగణముల తర్వాత వడి నియమించినారు. నన్నయ ఒక్కడే నాలుగుగణముల తర్వాత వడి పాటించినాడు. యుద్ధమల్లుని శాసనమందున్న మధ్యాక్కరలలో నాలుగుగణముల తర్వాతనే వళి ఉన్నది.

## ప్రాసము.

అలంకార తుల్యములైన ప్రాసములు— సుకర, దుష్కర, ద్వి, త్రి, చతుష్ప్రాస, అనుప్రాస, అంత్యప్రాసములు ఏడింటిని అప్పకవి చెప్పినాడు.

---

* జయంతి రామయ్యపంతులుగారిచే పరిశోధితమై ఆంధ్రసాహిత్య పరిషత్తువారిచే ప్రకటితమైన ప్రతిలో "కామనిభా" అని ఉన్నది గాని నావద్ద నున్న ప్రతిలో 'రామనిభా" అని ఉన్నది. పరిష్కర్తలు తమవద్ద నున్న ప్రతులలోని పాఠము నిచ్చినారు కాబోలు. కవిజనాశ్రయములో వడి గురించి లక్షణమున ఏమీ చెప్పియుండలేదు; గాని లక్ష్యలక్షణపద్యములో, అప్పకవి చెప్పినట్లు మొదటిపాదమున వళ్లు ఉండడముచేత రెండవపాదమున కూడా అట్లే ఉండవలెనని తోచును.

వీటిలో మొదటిది గాక తక్కిన ఆరున్ను ఛందోదర్పణములో ఉన్నవి. చతుష్ప్రాసము గాక తక్కిన ఆరున్ను కవిజనాశ్రయములోను, కావ్యాలంకార చూడామణిలోను ఉన్నవి. అయితే కావ్యాలంకారచూడామణిలో చతుష్ప్రాస ప్రాసము లక్షణపద్యమందు కనబడకపోయినా దానికి లక్ష్యముగా త్రిప్రాస లక్ష్యపద్యము తర్వాత నొకపద్యమున్నది ఇది ప్రక్షిప్తము కావోలు.

ప్రధాన ప్రాసభేదములలో లేని ఋక్రాంతప్రాసములపద్యములు మూడు కవిజనాశ్రయములో ఉన్నవి. ఈపద్యములే కావ్యాలంకారచూడామణిలో కూడా ఉన్నవి ఇవి ఎవరివో తెలియదు. ఇంతకు మించి ప్రాసభేదములు ఈ లక్షణగ్రంథములలో లేవు. ఈ లక్షణగ్రంథకర్తలు నన్నయ భారతములోని పద్యములందు గల ప్రాసభేదములను చక్కగా పరిశీలించలేదని చెప్పవచ్చును.

అనంతుడు సమప్రాస విధులు చూపించి మరి పదకొండు విధములైన విశేషప్రాసముల గురించి చెప్పినాడు. (మూలము 10-వ పుట చూడుము )

అనంతుడు చెప్పిన పండ్రెండువిధములే గాక అతడు చెప్పక విడిచిన మరి ఏడు విశేషములు అప్పకవి చెప్పినాడు. అవి ఏవంటే —

1. రేఁడు, పండ్లకు. 2 లోక, (భా)షోక్తకు. 8 సములకు. 4. తమ్ములు,(ధ)త్రి మ్మర (ధ_త్రి + మర) లకు. 5 దధులకు, ందంధలకు 6. లఘ్వ లఘు యకారప్రాసము. 7. ఐదలకు.

ఈ ప్రాసములలో కొన్ని అనంతునికి పూర్వము ప్రసిద్ధులైన కవులు వాడినారు గనుక కొంతవరకు వీని పరిశీలనలో లోపమున్నదని చెప్పకతప్పదు.

సీ స ము లు. 16, 143

లాక్షణికు లందరిలోను అనంతుడు ఎక్కువగా పదిసీసభేదములను చెప్పినాడు

1. సమసీసము —(సామాన్యసీసము లాక్షణికులు కూడా లేదు.)
2. సర్వతఃప్రాససీసము:—(అన్ని చరణములలోను ఒకే అక్షరము ప్రాసయతులు

గలది. అనగా 24 చోట్ల ఒకటే ప్రాసాక్షరము.)

3. అక్కిలి ప్రాససీసము;—(పెద్దపాదములందుగల 8 ఖండములలోను గీతి నాలుగు పాదములలోను రెండవఅక్షర మొక్కటే అయి ఉండవలెను. అనగా 12 చోట్ల ఒకటే ప్రాసాక్షరము.)

4. పదప్రాససీసము —(నాలుగు పెద్దపాదములందును గీతిలో బేసిపాదముల రెంటను రెండవ అక్షరము ఒక్కటే అయి ఉండవలెను. అనగా ఆరు చోట్ల ఒకటే ప్రాసాక్షరము.)

5 వృత్తప్రాససీసము —(పెద్దపాదము నాల్గింటమాత్రమే వృత్తముల కున్నట్లు ప్రాస ముండవలెను.)

6. అవకలిప్రాససీసము—(అన్నిచోట్లను ప్రాసయతి నియమము మాత్రమే కలది.)

7. అక్కిలివడిసీసము— (అన్నిచోట్లను వడి నియమమే కలది.)

8. వడిసీసము.—(అన్నిచోట్లను వడి నియమ ముండవలెను; అంతేకాక పాదాదినున్న వర్ణముతో మైత్రిగల వర్ణములే పాదముపొడవున యతి స్థలములందు రావలెను.

9. విషమసీసము —(ఉత్సాహ, గీతపద్యమున్ను కలిసినది.)

10. సర్వలఘుసీసము —(ఇందలో ఇంద్రగణమునకు బదులుగా అయిదు లఘువుల గణములుండును.]

వీటిలో 3, 4, 6, 7, 8, 9—భేదములు కవిజనాశ్రయము లోను కావ్యాలంకారచూడామణిలోను ఉన్నవి. అయితే 3 వది సరిగా అనంతుడు చెప్పినట్లులేదు; 8 పాదములలోను ప్రాసాక్షరమొక్కటయితే చాలును; పెద్దపాదముల పశ్చిమార్థములం దీ నియమము లేదు.

ఈరెండు లక్షణగ్రంథములలోను సీసభేదముల విభాగమున్ను లక్షణము లున్ను ఒక్కలాగుననే ఉన్నవిగాని. కవిజనాశ్రయములో ఐదేసి భేదముల

కొక్కొక్క పద్యమే ఉన్నందున కావ్యాలంకారచూడామణిలో ఉన్నంత స్పష్టముగా లక్షణము లేదు. రెండు గ్రంథములలోను విషమసీసములుగాక తక్కిన అయిదున్ను సమసీసములని చెప్పియున్నదిగాని సమసీసము ఒకటిగ భేదముగా చెప్పలేదు.

సీ వృత్తంబునకునలి" అన్నపద్యము కవిజనాశ్రయములోను ఛందోదర్పణములోను ఉన్నది ఇది సీసభేదముల పేళ్లుగలసీసము; అవకలిసీసమునకు లక్ష్యముగా ఉన్నది ఇందులో వృత్తప్రాసీసమును సమసీసమును పేర్కొన్నారు వీటికి కవిజనాశ్రయములో లక్ష్యపద్యములు లేవు సీసభేదములకు పేర్కొన్న గద్య వేరే ఉన్నది ఆగద్యలో ఈరెండు భేదములు పేర్కొనలేదు. ఈవిషయము లన్నిచూడగా ఈపద్యము అనంతునిదే అనిన్ని కవిజనాశ్రయములో ప్రక్షిప్తమనిన్ని ఊహించవచ్చును.

ఇలాగుననే మరికొన్ని పద్యములు కవిజనాశ్రయము వ్రాతప్రతులలో దూరినవి. అవి ప్రక్షిప్తములని ఆంధ్రసాహిత్యపరిషత్ప్రకాశిత ప్రతిలో పుట అడుగున సూచితమై ఉన్నదిగాని ఈ పద్యముగురించి ఏమియు చెప్పలేదు. పరిష్కర్తలు చూచిన అన్నిప్రతులందును ఈపద్యమున్నది కాబోలు.

అప్పకవీయములో లక్షణపద్యములకుఁబట్టి లక్ష్యములు సరిగా లేవుగనుక కవి అభిప్రాయము స్పష్టముగా తెలియదు. అతడు చెప్పిన సమసీసము, సర్వతఃప్రాససీసము, విషమసీస సర్వలఘుసీసములు అనంతుడు చెప్పినట్లేఉన్నవిగాని, అప్పకవి అక్కలి ప్రాససీసమున్నది అనంతుని సమప్రాససీసమునకు సరిపోయినది. అయితే అందుకు లక్ష్యముగా అప్పకవి ఇచ్చినపద్యములో చివరను 'చెలఁగుచుండు వృత్తప్రాససీసము లిల" అని ఉండుటకు కారణమేమో తెలియదు.

'ఆదినే వడి నిల్పి రావడే పదపెల్లఁజేయ సయ్యడ వడిసీసమునఁగ" అని అప్పకవి అనంతునివలెనే లక్షణము చెప్పి అందుకు లక్ష్యముగా ఇచ్చిన పద్యములో ఆ లక్షణము పాటించలేదు. అనంతుడు అక్కలివడికి చెప్పిన లక్షణము మాత్రమే పాటించినాడు.

అనంతుడు అవకలిప్రాస' మన్న సీసమునకు అప్పకవి అవకలివడిసీసమని పేరు పెట్టినాడు.

ఇంతకున్ను ఎంతమట్టుకు ఈసీసభేదములు కవులు తమకావ్యములలో చూపించినారో విచారణీయము. సప్తవిధము లివియ శబ్దశాసనుండు, పంచమామ్నాయ భక్తిలోఁ బల్కెఁగాని, కడమకవు లాయసీసము ల్విడిచిపెట్టి, తెలుఁగి సమసీసపద్యమే చెప్పినారు" అని అప్పకవి వ్రాసినాడు, గాని ఇది సత్యము కాదు.

నన్నయ 13 విధములయిన సీసములు చెప్పినాడు. వీటిలో రెండు మాత్రమే లాక్షణికులుచెప్పిన సీసభేదములలో ఉన్నవి —(1) అక్కలి వడి సీసము (2) అవకలిప్రాససీసము. ఈవిషయము తెలుగు" రెండవసంచికలో చర్చించినాను.

అవ్యాసమున చెప్పమరచిన దొకటేమంటే నన్నయసీసములలో రెండు (ఆది II. 21, III. 27) వృత్తప్రాససీసము లున్నవి అయితే వాటిలో ఒకటిచేవ మున్నది. ప్రాసాక్షరము పశ్చిమార్ధము లందున్ను కలదు.

ఎఱ్ఱాప్రెగడ భారతములో నన్నయచెప్పిన సీసభేదములు కలవు.

భాగవతములో పోతనామాత్యుడు నన్నయవలెనే కొన్నినియమము లను పాటించి పలువిధములయిన సీసములను చెప్పినట్లు వావిలికొలను సుబ్బారావుగారు పరిషత్పత్రికలో (సంపుటము 6 పుటలు 417-420) తెలియచేసినారు.

భాగవతము ఏకాదశస్కంధమున 72-వ పద్యము సర్వలఘుసీసము. లాక్షణికులు చెప్పినట్లు ఇందులో ఇంద్రగణములకు బదులుగా 5 లఘువుల గణము లున్నవి. ఇది తెలియక కాకోలు చే. ఆనంద ..1904 ముద్రితము) పుట అడుగున ఈసీసము లక్షణ సమన్వయముగాక యున్నదని సంస్క రించినవారు వ్రాసినారు.

కూచిమంచి తిమ్మకవి మొదలయినకవులు కొందరిట్టే సర్వలఘుసీసముల

చెప్పినారు. గణపవరపు వేంకటకవిమాత్రము తన ప్రబంధములో నలములయిన ఇంద్రగణములతో నే సీసము వ్రాసినాడు (చూ. 75, 221 పద్యములు)

## ఆర్యలు, గీతులు

పథ్య, విపుల చపల, ముఖచపల జఘనచపల అని ఆర్యలు అయిదు గీతి, ఉపగీతి, ఉద్గీతి, ఆర్యాగీతి అని గీతులు నాలుగు ఈ తొమ్మిదిన్ని సంస్కృతఛ్ఛందములో ఉన్నవి, కందమన్న పేరు దానిలో లేదు గాని, ఆర్యాగీతిలక్షణము కందపద్యలక్షణమునకు సరిపోయినది. గనుక కందముగీతులలో ఒకటిగా చెప్పవచ్చునుగాని అప్పకవి చెప్పినట్లు కందమును ఆర్యలయిదింటిలో చేర్చి కందము లారువిధములని చెప్పుట యుక్తియుక్తముగా లేదు.

సంస్కృతమున ఉన్న ఆర్యలయిదింటికిన్ని సామాన్యలక్షణములు:—

లక్ష్మైతత్ సప్తగణా, గోపేతా భవతి నేహ విషమే జః,
షష్ఠో జశ్చ నలఘువా, ప్రథమార్ధే నియతమార్యాయాః.
షష్ఠే ద్వితీయలాత్పర కే న్లే ముఖలాచ్చ సయతిపదనియమః,
చరమేऽర్ధే పంచమకే, తస్మాదిహ భవతి షష్ఠో లః."

4 + 4 + 4
4 + 4 + 1 + 3 + 4 + 4
4 + 4 + 4
4 | + 4 + 1 + 4 + 2

} అంకెలు మాత్రాసంఖ్యను నిలువు గీతలు యతి స్థానములను తెలియజేయును.

(రెండవపాదము మూడోగణము నలమో జగణమో కావలెను. దానిలో మొదటిలఘువు తర్వాత యతి గనుక 1 + 3 అని వ్రాయవలసివచ్చినది.) పైని చెప్పినవిషయములు సూత్రప్రాయముగా అనంతుడు III 3-4లో చెప్పినాడు ఈలక్షణము యతిప్రాసనియమములలో తప్ప తక్కిన విషయములలో సరిపోయినది కందములో కనబడునట్లు ప్రాసయున్న సమపాదములలో మూడవగణముతర్వాత యతిన్ని ఉండవలెనని తెలుగులాక్షణికులు చెప్పినారు.

ఇప్పుడు ముద్రితమైన ఛందోదర్పణ ప్రతిలో ఆర్యాగీతుల లక్ష్యపద్యములు కనబడవు. లాక్షణికుల ఆచారమును అనుసరించి లక్ష్యలక్షణములను ఒక పద్యమందు ఇతరస్థలములలో చూపించిన అనంతుడు ఈ ఆర్యాగీతులందు మాత్రము చూపించియుండడా ! అజ్ఞానముచేత కొందరు లేఖకులు అనంతుని ఆర్యాగీతులను కందములవలె నడిచేటట్లు సవరించి" రూపుమాపినారు. అనవసరముగా అధికమైన మాటలు తీసివేసినయెడల వాటిలో లక్ష్యలక్షణములు రెండున్ను స్పష్టముగా కనబడగలవు. చూడండి.—

పథ్యార్య —

బేసులు త్రిగణయుతము లై, యూనవ పాదములఁ బొరసి + యార్యయనన్
భాసిల్లుఁ బథ్య యనఁగా, వాసవముఖదివిజ + వర్గనుతా. (పుట 66)

విపులార్య.—

ప్రకటనవపాదముల నిలువక శబ్దము నవలఁ జొచ్చి + వచ్చినఁ ద
త్ప్రకట విపులార్యయగును సే, వక జనమందార + వనజాక్షా. (,)

చపలార్య —

వరుసను ద్వితీయ తుర్యము, స్ఫురద్గమాద్యగజకార + ములు దగఁ బెం
దరయఁగఁ దనర్పు చేనిన్, వారీము రారిచప + లార్య యగున్. (,,)

ముఖచపలార్య.—

చపలాగణ ప్రకారం, బపారకారుణ్యసాగ + రా ప్రథమా
ర్ధపరం బగుచున్నది ముఖ, చపలార్య యనంగఁ + జనుఁ గృతులన్. (,)

జఘనచపలార్య.—

మొదలిసగము చపలార్యా, స్పదగణలక్షణము బొరక + చరమార్ధం
బదిత ప్రకారరేఖన్, గదాధరా ! చను జ + ఘనచపలన్ (పుట 67)

గీతి —

అపదార్య మొదలి సగమున, కపగఁగ రెండరలు చెప్ప + రే నది గీ
తిపమాఖ్యయగుఁ గృతులన్, మనుధాధర కృష్ణయాద + వస్వామీ.(,,)

ఉపగీతి.—

భరవార్యమిత్రాదిగణముల నిరుగడల నొప్పు+రేపది దా
నరగు నుపగీతి యనఁగా, సరసిజదళనేత్ర+శార్ఙ్గధరా. (వృత్త, 67)

ఉద్గీతి.—

నిదితార్యచరమదళమున్, మొగలి నగము చేసి+మొదలినగం
బది యపరార్థముఁ జేసినఁ బొదుపగు నుద్గీతి భుజగ+భుగ్గమనా. (॥)

నేను చూచిన (పరవస్తువారి) ప్రతిలో మొదటివి రెండున్ను నాలుగు లక్షణములున్ను నేనిక్కడ చూపించినట్లే ఉన్నవి. మొదటిది ఇప్పుడు ముద్రితమైన ప్రతిలో ఉన్నట్లేఉన్నది, రెండవదానిలో రెండవపాదము నేను చూపించి నట్లే ఉన్నది.

## అక్కరలు.

అక్కరలు దేశ్యజాతులలో చేరినవి. ఇవి కన్నడమందును గలవు. తెలుగు అక్కరలకు కన్నడపు అక్కరలకు చాలా మట్టుకు సాదృశ్యమున్ను కొద్దిగా భేదమున్ను ఉన్నది.

| సం | తెలుగు పేరు | లక్షణము. | కన్నడపు పేరు. |
|---|---|---|---|
| 1 | మహాక్కర | సూర్య ఇంద్ర చంద్ర<br>1+ 5+ 1 = 7 | పిరియక్కర |
| 2 | మధ్యాక్కర | ఇం సూ ఇం సూ<br>2+1+ 2+1 = 6 | దోరెయక్కర |
| 3 | మధురాక్కర | సూ ఇం చం<br>1+3+ 1 = 5 | నడువణక్కర |
| 4 | అంతరాక్కర | సూ ఇం చం<br>1+2+ 1 = 4 | ఎడెయక్కర |
| 5 | అల్పాక్కర | ఇం చం<br>2+ 1 = 3 | కిరియక్కర |

వీటిలో మహాక్కరకు పిరియక్కర, అంతరాక్కరకు ఎడెయక్కర, అల్పాక్కరకు కిరియక్కర అనే పేర్లు సరిగా ఉన్నవి కాని తక్కినవి సరిగా లేవు. అక్కర లయిదింటిలోను పాదమున ఉన్న గణసంఖ్యనుబట్టి నడుమ నున్నది గనుక నడువణక్కర అనే పేరు కన్నడమున అన్వర్థముగా ఉన్నది. అయితే లక్షణమును బట్టి దీనికి సరియైన తెలుగు పేరు మధురాక్కర అర్థమును బట్టి సరియైన తెలుగు పేరు మధ్యాక్కర మధ్యాక్కరకు లక్షణమునుబట్టి సరియైన కన్నడము పేరు దోరెయక్కర దోరెయక్కరనగా సమానభాగములు గల అక్కర అని అర్థము అంటే పాదము రెండుసమభాగములు చేయగా రెండు సమభాగములలోను గణములు ఒక్కతీరున ఉంటవని అర్థము.

2, 3, అక్కరల పేర్లలో ఇంతవట్టుకు వైషమ్యమున్నా జయంతి రామయ్యపంతులుగారు అది కనిపెట్టకపోవడమే కాక "పాదమున నైదేసి గణములుగల యక్కర గణసంఖ్యచే నైదక్కరలకు మధ్యస్థానమున నుండుటచే మధ్యాక్కర మను పేరును నన్వర్థములుగా నున్న" వని వ్రాయుట చాలా వింతగా ఉన్నది మధ్యాక్కర పాదములో ఉన్న గణములు ఆరుగాని ఆయన చెప్పినట్లు అయిదు కాదు "మధ్యాక్కర" అని అర్థమిచ్చే కన్నడపు నడువణక్కర అనే పేరు అన్వర్థముగా ఉన్నదని కాబోలు వారు చెప్పదలచి అట్లు వ్రాసినారు.

కన్నడపు అక్కరలకున్ను తెలుగు అక్కరలకున్ను లక్షణములో కొద్దిగా భేదములున్నవి.

1 తెలుగు పద్యములలో సూర్యగణములుండేచోట కన్నడపద్యములలో బ్రహ్మగణములుంటవి (అనగా నగణ హగణములే కాక గగ, సగణములు కూడాను). తెలుగులో ఇంద్రగణము లుండేచోట కన్నడములో విష్ణుగణము లుంటవి (అనగా నల నగ సల, భ, ర తలే కాక మగణము, సగణగురువు కూడాను). తెలుగులో చంద్రగణములుండేచోట కన్నడములో రుద్రగణము లుంటవి (అనగా నగగ నహ, సలల భల భగ, మల, సస, సహ, తల రల, సస, నలల రగ, తగ లే కాక మగ, సగగములు కూడాను).

2. తెలుగు మధ్యాక్కరకు లక్షణముబట్టి సరిపోయిన కన్నడపు దోరెయక్కరలో చివరనున్న బ్రహ్మగణము అంతమందు గురువుగలదిగా ఉండవలె

నన్న నియమమే ఉన్నది. అంటే గగమో నగణమో కావలెను ఇందులో విష్ణుగణములు మాత్రము 4 గాని 5 గాని మాత్రలుగల గణములే కావలె నన్నారు గనుక తెలుగున ఉన్న ఇంద్రగణములే అగును.

నాగవర్మ కన్నడఛందములో లక్ష్యములుగా ఇచ్చిన యక్కరలలో పాదాదినుండే బ్రహ్మగణములు మూడుమాత్రల గణములుగానే ఉన్నవి; గాని దోరెయక్కరలలో నడుమనున్న బ్రహ్మగణములు కొన్ని గగములున్ను, కొన్ని నగణములున్ను అయి ఉన్నవి.

3. కన్నడ పిరియక్కరల ప్రతిపాదములందు 6 వ గణము బ్రహ్మ గణము కావలెనన్న నియమమున్నది ఆటువంటి విశేషలక్షణము మహాక్కర లందున్నట్లు కవిజనాశ్రయములో చెప్పలేదు "రెండును నాలుగునగు వాన రంబున నర్కుఁడైన నాదరంబున నెడ సొచ్చునని మహాక్కరం బలుకుదు రార్యులెల్ల" అని అనంతుడును 'రెండవచోట నాలవచోటఁ జిత్రభాను గణంబు గదియుచుండు" అని అప్పకవీయములోను ఉన్నది ఈవిశేషలక్ష ణము తెలుగు లాక్షణికుల మతమున ఐచ్ఛికముగా ఉన్నట్లు కనబడుచున్నది.

తెలుగు లాక్షణికులు అందరును ఒక్కలాగుననే మధ్యాక్కరకు లక్ష ణము చెప్పినారు (ప్రతిపాదమునను రెండు ఇంద్రగణములు ఒక సూర్య గణము, రెండు ఇంద్రగణములు, ఒక సూర్యగణము ఉండును. అని) అంద రున్ను మూడవగణము తర్వాతనే వడి నియమించినారు.

నన్నయ మధ్యాక్కరపాదములలో నాల్గవగణము తర్వాత వడి కని పించుచున్నది యుద్ధమల్లునిశాసనాక్కరలలో సైతము నాల్గవగణము తర్వా తనే వడి ఉండడముచేత పూర్వము అట్లే వడిస్థానముండేదని ఊహించవలసి ఉన్నది. తిక్కన మధ్యాక్కరలు చెప్పలేదు ఎర్రాప్రెగడ మూడవగణము తర్వాతనే వడి పాటించినాడు. మరి యేకవిన్నీ మధ్యాక్కరలు చెప్పినట్టు కన బడదు. లాక్షణికులు ఎర్రాప్రెగ్గడ పాటించిన వడి గురించే చెప్పినారు గాని నన్నయ పాటించిన వడి గురించి చెప్పలేదు.

## షట్ప్రత్యయములు.

అనంతుడు షట్ప్రత్యయములను సూత్రప్రాయముగా చెప్పినాడు

విద్యార్థులకు సులభముగాను స్పష్టముగాను బోధపడవలెనని వాటిని వివరించి వ్రాస్తున్నాను.

### 1. ప్రస్తారము (చూ. మూ. iii. 66)

అయిదవ ఛందమునకు ప్రస్తార మీలాగు చేయవలెను ! మొదట అయిదు గురువులు ఉంచవలెను, దాని క్రింద మొదటిగురువు లఘువుగా మార్చి లఘువు-గీత గీచినతర్వాత తక్కినవన్నీ పైదిచాలు ననుసరించి గురువులే వేయవలెను. రెండవచాలు చూచి మూడవది, మూడవదానినిచూచి నాలుగోది ఈలాగున తుదవరకు వెళ్లవలెను. పైదిచాలున ||U U ఉన్నప్పుడు మొదటి రెండులఘువు లున్న గురువులుగామార్చి తర్వాత నున్నగురువు లఘువుగామార్చి లఘువు కనబడినది గనుక మరి మార్చకుండా పైదిచాలున ఎట్లుంటే అలాగున వేయవలెను. అట్లు వేయగా UU||U ఏర్పడుతుంది.

| | | | |
|---|---|---|---|
| UUUUU | 1 | UUUU | 17 |
| UUUU | 2 | UUU | 18 |
| U UUU | 3 | U UU | 19 |
| UUU | 4 | UU \| | 20 |
| UU \|UU | 5 | UU U | 21 |
| \| U UU | 6 | U U | 22 |
| U UU | 7 | U U | 23 |
| \| \| UU | 8 | U \| | 24 |
| UUU U | 9 | UUU \| | 25 |
| UU U | 10 | UU | 26 |
| U \|U \|U | 11 | U U \| | 27 |
| U U | 12 | U \| | 28 |
| UU U | 13 | UU | 29 |
| U U | 14 | \| U \| | 30 |
| U U | 15 | U \| | 31 |
| \| U | 16 | \| | 32 |

ఈ 32 లో చివరను గురువుగలవి 16, లఘువుగలవి 16 నాలుగో ఛందము ప్రస్తరిస్తే చివరను U గలవి 8 లఘువుగలవి 8 మూడో ఛందములో చివరను U గలవి 4 లఘువుగలవి 4 రెండో ఛందములో చివరను U గలవి 2; లఘువుగలవి 2; ఈవిషయములన్నీ మీదిపట్టికలో చూచుకోవచ్చును.

## 2 నష్టలబ్ధి (చూ. మూ. VI. 67)

9 వ ఛందమున పుట్టిన 13 వ వృత్తమునకు గణములేవి ?

13 రెండుచే భాగించి భాగించగావచ్చినలబ్ధమును (అరలు నిండుగా చేసుకొంటూ) మరల రెండుచేత భాగించవలెను ఈలాగున భాగించుకొంటూ వెళ్లవలెను బేసిసంఖ్య భాగించినప్పుడు గురువున్ను సరిసంఖ్య భాగించినప్పుడు లఘువున్ను పెట్టవలెను

```
2|13                 |   2|2
 |____               |    |__
2|6½=7     —U        |   2|1   —|
 |____               |    |__
2|3½=4     —U        |    ½=1 —U
 |____               |
   2       —         |
```

లబ్ధము ఒకటికాగానే బేసిసంఖ్యగనుకను ఎన్నిసార్లు భాగించినా ఒకటే వచ్చును గనుకను గురువులే పెట్టవలెను

9 వ ఛందమున పుట్టినవృత్తములలో పాదమునకు 9 అక్షరము లుండును. గనుక అందుపుట్టిన 13 వ వృత్తమునకు గణములు:—

UUU UU | UU
త, య, స

## 3 ఉద్దిష్టము. (చూ. మూ. III. 68)

UU U ఈగణములు గలది ఎన్నోఛందములో ఎన్నోవృత్తము ?

అయిదు అక్షరములుగనుక అయిదోఛందము (సుప్రతిష్ఠ) ఈ అయిదు స్థలములలోను మొదటిదానిక్రింద 1, రెండవదానిక్రింద 2, 3 వ దానిక్రింద 4, 4 వ

స్థానమందు 8, 5 వ స్థానమందు 16 ఇట్లు ద్విగుణముగా లెక్కవేయగా ని లఘువుల క్రిందనున్న లెక్కలను మొత్తముచేసి ఒకటికలుపగా వృత్తసంఖ్య ఏర్పడును.

ల ల ల
1 2 4 8 16   4+8+1=13

## 4. వృత్తసంఖ్య (చూ. సూ. III. 69)

5 వ ఛందమున ఎన్ని వృత్తములు పుట్టినవి ?

5 వ ఛందమున పుట్టిన వృత్తములలో పాదమునకు అయిదక్షరము లున్నవి. వాటిలో ప్రతి అక్షరమున్ను గురువో లఘువో కావలెను గనుక అయిదుసార్లు 2 ఇబ్బడించినయెడల ఎంతవచ్చునో అన్నివృత్తములు పుట్టును $2\times2\times2\times2\times2=32$

అలాగుననే 12 వ ఛందమున $2^{12}=4096$ వృత్తములు పుట్టినవి. 26 వ ఛందమున $2^{26}=6710\ 8864$ వృత్తములుపుట్టినవి.

సమవృత్తములవెరసు (చూ. సూ. III 77) ఈ 26 ఛందముల లోను పుట్టిన వృత్తము లన్ని ఎన్ని ?

$$2+2^2+2^3+2^4 \ldots 2^{25}+2^{26}=2^{27}-2=134217726$$

## ౫. లగక్రియచక్రము (చూ. సూ. III. 70-71)

1 + 1

1 + 2 + 1

1 + 3 + 3 + 1

1 + 4 + 6 + 4 + 1

1   5   10   10   5   1

ఇదిపాదమున కెన్నిలఘువులుగల వృత్తములెన్నెన్ని యొక్కొక్క ఛందమున బుట్టినవో తెలియజేసే లగక్రియచక్రము. పైది చక్రములో అయిదవఛందమువరకు ఉన్నది. అయిదవచాలున కనబడే 1,5,10,10,5,1 అనే అంకెల అర్థమేమంటే, ఒక్కలఘువైనా లేక అన్నిగురువులు గలవృత్తము 1; ఒక్కలఘువుమాత్రమే గలవృత్తములు 5; రెండులఘువులుకలవి 10; మూడులఘువులు కలవి 10, నాలుగులఘువులుకలవి 5; అయిదున్ను లఘువులే అయినవృత్తము 1, మొత్తము 32.

ఈలాగుననే పైది వరుసలలో రెండవఛందమునుండి నాల్గో ఛందమువరకు పైని చెప్పినవిషయముల వివరణ ఉన్నది.

అయితే పైది వరుసను బట్టి క్రిందివరుస చేసుకొంటూ ఉంటేనేగాని 8 వ ఛందములోనో 16 వ ఛందములోనో మరియేదైనా ఛందములో ఈ వృత్తములసంఖ్యలు తెలియజేయుట కష్టము గనుక ఇంగ్లీషుబడులలో చదువు కొనే విద్యార్థులు ఈ విషయములను తెలుసుకొనుటకు ఒకసులభమైన మార్గ మున్నది. దీనినిబట్టి అడిగిన ఛందముగురించి ఈవిషయములు వెంటనే చెప్ప గలము ఉ॥ పదియవ ఛందములో ఎన్నెన్నిలఘువుల వృత్తము లెన్నెన్ని ఉన్నవి?

$(గ+ల)^{10} = 1గ^{10}+10గ^{9}ల^{1}+45గ^{8}ల^{2}+120గ^{7}ల^{3}+210గ^{6}ల^{4}+252గ^{5}ల^{5} + 210గ^{4}ల^{6} + 120గ^{3}ల^{7} + 45గ^{2}ల^{8}+19గ^{1}ల^{9}+1ల^{10}$

$1గ^{10}$ అంటే 10న్ను గురువులే అయినవృత్తము ఒకటి

$10గ^{9}ల$ అంటే 9 గురువులున్ను 1 లఘువున్ను అయినవి 10

$45గ^{8}ల^{2}$ అంటే 8 గురువులున్ను 2 లఘువులున్ను ఉన్నవి 45

ఈలాగుననే కడమవి తెలుసుకోవచ్చును.

---

* ఈవిషయము లీలావతిగణితములో విపులముగానున్నది. చూడ దగును.

## 6. సగణాలగ క్రియ శకటచక్రము. (ఛా. మా. III. 72-76)

| | |
|---|---|
| 1 | ఇది పాదములో అన్నీ గురువులే కలవృత్తము (1) |
| 2 | 3 \| 5 \| 9 \| 17 \| ఇది లఘువుగలవృత్తములు (5) |
| 4 | 7 13 \| 25 \| 6 11 \| 21 \| 10 \| 19 \| 18 \| ఇది 2 లఘువులవి (10) |
| 8 | 15 29 14 27 \| 26 22 23 22 20 \| ఇది 3 లఘువులవి (10) |
| 16 | 31 30 28 \| 24 ఇది 4 లఘువుల వృత్తములు (5) |
| 32 | ఇది 5 లఘువుల వృత్తము |

ఈ చక్రము వేసేపద్ధతి —

నిలువుగా ఉన్న మొదటిఅరుగళ్లలోను— 1 2, 4 8 16, 32 ఇట్లు సంఖ్యలు ద్విగుణముగా వేయవలెను తర్వాత అడ్డుగా ప్రతిసంఖ్య ద్విగుణము చేసి ఒకటి కొట్టివేస్తూ అట్లుచేయగా వచ్చిన సంఖ్యప్రక్కను మళ్లీ అట్లే చేస్తూ వేయవలెను. ఈఛందమున 32 వృత్తములకంటె ఎక్కువ పుట్టవు గనుక 32 కు మించేసంఖ్య వేయరాదు. ఇట్లు చేసినతర్వాత పైచాలున ఉన్న సంఖ్యలు క్రిందిచాలున ద్విగుణముచేసి వేయవలెను ఈసంఖ్యలలో ప్రతిదాని ప్రక్కను అది ద్విగుణముచేసి ఒకటి కొట్టివేయగా వచ్చినసంఖ్య వేయవలెను. దానిప్రక్కను మళ్లీ అదేవిధముగా సంఖ్యలువేస్తూ ఉండవలెను ఎన్నో ఛందమునకు ఈ చక్రము వేస్తున్నామో చూచుకొని అందులో ఎన్నివృత్తములు పుట్టినవో ఆసంఖ్యకు మించకుండా అంకెలు వేసుకొంటూ వెళ్లవలెను.

కొన్నివృత్తముల లక్షణమును లాక్షణికులు వివిధముగా చెప్పినారు. చూడండి:—

### 1. క్రౌంచపదము

1 క్రౌంచపదా భ్మౌస్నౌ నననా న్గావిషు శరవసుముని విరతిరిహా భవేత్

U UUU U U U

భ మ స భ న న న న గ

(ఇది సంస్కృతవృత్తలక్షణము. 25 వ ఛందము 16776391 వ వృత్తము)

అన్ని గన్నడలాక్షణికులన్ను చెప్పినట్లు పాదములందు ప్రాసయతి ఉన్నది; కాని తెలుగు లాక్షణికులు చెప్పిన వడినియమము పూర్తిగా లేదు. పాదద్వితీయార్ధమునగల విశ్రమస్థానముల వెంటను ఉన్నవడి అక్షరములు తమలో తాము మైత్రిగలవేగాని పాదాద్యక్షరముతో మైత్రి గలవి కావు గనుక నన్నెచోడునిపద్యము వృత్తము కాదనిన్ని మాత్రాపద్యమనిన్ని తీయమువలె నున్నదనిన్ని అందుచేత ఇది నన్నెచోడుని ప్రాచీనత కొక గొప్ప కారణ" మనిన్ని మా. రామకృష్ణకవిగారు వ్రాసినారు వృత్తముల కుండవలసిన ముఖ్యలక్షణము ఉన్నది గదా ఇది వృత్తము కాదని కవిగారు ఎట్లు చెప్పగలరు? నాలుగు పాదములందున్ను గణము లొకరీతిన ఉన్నవి. (మాత్రాపద్యములందు అన్ని పాదములలోను గణము లొక్కరీతిగా నుండ నక్కరలేదు) తెలుగుకన్నడ పద్యముల సంప్రదాయ మనుసరించి నాలుగు పాదములలోను ద్వితీయస్థలమున ప్రాస మున్నది. లయగ్రాహి మొదలయిన ఉద్ధరమాలావృత్తములలో ఉన్నట్లు ప్రతిపాదమున కొంతవరకు ప్రాసయతి ఉన్నది జాత్యుపజాతులు మొదలయిన దేశ్యపద్యములలో చేరదు ఇది ఒకరీతి క్రౌంచపదము దీనికి సరియైనలక్షణము విలాక్షణికుడున్ను చెప్పలేదు.

## II త్రిభంగి.

ఈగ్రంథమందు మూలమున (చూ II. 184) త్రిభంగి వృత్తము అచ్చుతప్పులతో నిండియున్నది. సరియైనపాఠము:—

ననవన ననవన+లను భమసగలును+
    దనరి నటింపఁ గణంకల్ నలువంకల్ బెంపు దొలంకల్
మునుకొని నభము భ+మున వెలఁగ దలుపఁ+
    జనుగదు నొప్పుగుచేణల్ చెరజాణల్ వేలుపుగాణల్
ననరుహజనితుని+తనయులు మొదలుగ+
    ఘనమతు లాదటతోడన్ శ్రుతికూడన్ వెన్నునివాడన్
వినగలిగిన నది+జనసము ఫల మని+
    మునిజను లిందు శుభాంగుల్ దగుభంగిన్ జెప్పఁ ద్రిభంగిన్.

పాదమునకు 34 అక్షరములు; 42 మాత్రలు పూర్వార్ధమున ప్రాసని

యతి పశ్చిమార్ధమున మూడుచోట్ల అంత్యప్రాసనియమము ఉన్నది. కావ్యాలంకారచూడామణి అప్పకవీయములలో నైతము ఇట్లే ఉన్నది. కాని, కవిజనాశ్రయములోని త్రిభంగి ఇందుకు భిన్నముగా ఉన్నది.

భసనసలును సురభములును నాయుక్తము లైనన్
మృదువైనన్ బ్రస్తుతమైనన్
వనరుహభవనిభ! మన మలరఁ ద్రిభంగిని చెప్పన్
వడి దప్పన్ బ్రాసము లొప్పన్.

ఇందులో పాదమునకు 28 అక్షరములు, 36 మాత్రలు ఉన్నవి. పాదమున ప్రాసయతి నియమము లేదు మూడుచోట్ల అంత్యప్రాసనియమము మాత్రమున్నది.

నడక.

కోట్లకొలది వృత్తములు పుట్టినా లాక్షణికులు సుమారు 200 వృత్తములకంటె ఎక్కువ పేర్కొలేదు వాటిలో సుమారు 30 కంటె ఎక్కువగా కవులు వాడడము లేదు ఎందుచేత? లాక్షణికులు చెప్పిన లక్ష్యలక్షణపద్యములు చూచినా కొన్నివృత్తములనడక తెలియదు పద్యములనడక ఏలక్షణము బట్టి ఉండునో ఆలక్షణరహస్యము తెలిసినయెడల వేలకొలది క్రొత్తక్రొత్తవృత్తములను ప్రస్తరించి తీయవచ్చును ఆరహస్యము తెలియకపోవుటకు మన గణవిభజనసంప్రదాయము ముఖ్యమైనకారణము మూడేసి అక్షరములు గణమంటే గణవిభజన పద్యము నడకబట్టి ఉండుట యసంభవము. నడకబట్టి గణవిభజన ఉంటేనేగాని గణవిభజనప్రయోజనము కనబడదు కొన్నివృత్తములు చక్కగా నడిపించుటకు వీలున్నా లాక్షణికులు తమలక్ష్యపద్యములు వ్రాయవలసినట్లు వ్రాయకపోవడముచేత కవులావృత్తములను చెప్పడములేదు. అందుకు అనేక ఉదాహరణములు చూపించవచ్చునుగాని ఈపీఠికలో అవకాశము చాలదు గనుక మూడు మాత్రమే చూపిస్తున్నాను.

(1) పాలాశదళము (దీనికే త్వరితగతి యనికూడా పేరున్నది.)

అడుగడుగున హరిసురు+లమరు ధరఁ గొలా
కడకే మనఁ దనరుఁ గవి+జనులు వచియింపన్

పదునొకఁ డగుచుండ యతి+పదిలముగఁ జేరఁ
గదియుఁ నగణము లయిదు+గగము తుదనొందఁగ. (అప్పకవి)

ఇంతకంటె అనంతుడు చెప్పినది బాగున్నదిగాని అందులో రెండవ పాదము స్వాగతపాదము నడకచెడి యున్నది (చూ. పూ II. ౮౪) ఎట్లుండిన యెడల నడక బాగుండునో తెలియజేస్తున్నారు —

అయిదులము లయిదులము +లయిదులములంగా
లయఁజనును ద్వరితగతి +లములు పదిసాగఁ
నియమమున వడియుగర+నిలుచు శ్రుతికిం బై
కయితలఘు దరుసనిది+ఖగతురగ శ్రీ.

## 2. విచికిలిత.

ప్రవిలయగతియమునను బద+వడి జలనిధినదుల న
ద్భుతనములు కదుపున నిడుక+భుజగపతిశయనము పై
నవిరళగతిఁ గురుకు వరదుఁ+డని విచికిలితఁ బదమూఁ
డవ రెండవడి యిడునదియొక+లఘువు గము బలుక నగుఁ. (అప్పకవి)

ఇటువంటి లక్ష్యలక్షణపద్యములబట్టి దీనినడక ఎట్లు తెలుసుకోగలము! ఇందులో 21 లఘువులున్న చివరను గురువున్ను ఉన్నదిగనుక త్రిశ్రగతి"ని* నడిపించవచ్చును. ఏడుహగణములున్ను గురువున్ను కలది సుగంధి, ఏడు నగణములున్ను గురువున్ను కలది విచికిలిత హగణనగణములలో వినైనా ఏడున్ను గురువున్ను గలది ఉత్సాహము. విచికిలిత నడక ఎట్లుండవలెనో చూడండి:—

మనుల వలపు నబల బలము+మదిమి సొగసు కలసిరుఁ
జెనటి రాకము విషము రుచియు+చెలిసుఖము పగతాతుఁ
తనిని తృషను కవికి స్థిరత+తమికి వెలుఁగు సొగసగఁ
కవికి సుకృతి శిలల రసము+నవతి చెలిమి కలుగుఁ జే

---

* అనగా మూడుమాత్రలకు విరుగుతూ ఉంటుందని అర్థము. త్రి + అస్ర = త్ర్యస్ర అని ఉండవలెనుగాని సంగీతపుస్తకములలోని వ్యవహారము ననుసరించి 'త్రిశ్ర' అని వాడినాను.

## 3. తురగము.

ననననసజజగలు తిథివిరతు+లగు ద్దురగంబునన్
గనలుచు నగరముపయి విడిసిన+గాంచి తానొక రుండెదు
కొల్చిలిదవులకుఁగొని చనిరిగువాఁ+కూర్కి సాముచితుండు చే
తను యవనునిఁ బోరిగొని వని వసు+ధన్గణింతురు ఘూదురుల్. (అప్పకవి)

దీని నడక తీరు ఈలక్ష్యమునుబట్టి కనుగొనుట శక్యమా !
నసల యుగళము పాథము రగణము+నాల్గుపాత్తులనొప్పఁగాఁ
దనరు విరమము నసల యుగళము+దాటగాఁ దురగంబునన్.

ఈలాగున లక్ష్యలక్షణపద్య మున్నయెడల ఈతురగవృత్తము తరళమత్తకోకిల కరిబృంహిత వృత్తములవలె నడుచునని సులభముగా తెలుసుకోవచ్చును.

జాగ్రత్తగా విమర్శించి చూచినయెడల చక్కగా నడిచే పద్యములన్ని ఏదో ఒకతాళమునకో ఒకలయకో సరిపడి ఉంటవి. విషయము బోధపడవలె నని కొన్నిమాత్రమే ఉదాహరిస్తున్నాను.

1. త్రిశ్రగతిని నడిచేవి (అనగా మూడుమాత్రలగణములు గలవి) ఉత్సాహము, సుగంధి, విచికిలిత మొదలయినవి.

2. త్రిశ్రగతిని ఎదురుగా నడిచేవి (అనఁగా మృదంగ వాద్యములో ఎదురు వాద్యమువలె నడిచేవి) వీటిలో లఘువు తర్వాత గురువువచ్చును

సుకాంతి ప్రమాణి, పంచచామరము మొదలయినవి. ఉ. ‘ఇదే యపేన్ మదాన్వితున్ సుదేవునిన్ వధించెదన్”

3. చతురస్రగతిని నడిచేవి (అనగా నాలుగుమాత్రల గణములు గలవి) మత్తకోదకము, ప్రహరణకలిత, మానిని, కవిరాజవిరాజితము సరసిజము, క్రౌంచపదము మొదలయినవి ఇంగాక ఇంకా ఈగతిని నడిచే వృత్తములు పెక్కులది ప్రస్తరించి తీయవచ్చును.

ఇందుకు తార్కాణముగా కవియవచ్ఛందములో చతురస్రగతిని నడిచే పద్యము లెన్నిగలవో చూడండి —

ఈ ఛందములో 16 మాత్రలుండి సర్వాంతముగా ఉండే వృత్తములు

II. రూపక మను తాళంబున + ద్రుతలఘువులు చనుచుండుఁ
III. నలగముపై నగ మొప్పఁ + నలగముల్ జోడింపఁ
IV త్రాలుఁ తల నలలల మన + గంబుల్ పాదములందుఁ
V. కల్యాణిఁ మనలలలన + గభగంబుల్ పాదముల్

ఈలాగున క్రొత్తక్రొత్తవృత్తములను ఎన్నైనా తీయవచ్చును

8 మిశ్రగతిని నడిచేవి (అనగా 3+4 మాత్రలకు విరుగుతూనడిచేవి).

మత్తకోకిల తరళ తురగము మొదలయినవృత్తములు

వృషభగమన, హరిణగతిరగడలు (గురజాడ అప్పారావుగారి ముత్యాల సరములు మొదలయినపద్యము లీగతిని నడుచును)

9. త్రిపుటతాళమునకు (చతురస్రగతి తిశ్రజాతి త్రిపుట)
4(3+2+2)=28

ఉత్పలమాల, చంపకమాల నడుచును.

10. ఆదితాళమునకు (చతురస్రగతి చతురస్రజాతి త్రిపుట)
కందము, సరసిజము క్రౌంచపదము మొదలయినవి

ఈలాగున ఇంకా నిరూపించి చెప్పవచ్చును.

పాదమందుండే అక్షరముల సంఖ్యబట్టి ఛందము తేర్పరిచి ఆఛందములలో ఒకొక్కటి ప్రస్తరించి వృత్తములు కల్పించడమువల్ల ప్రయోజనము విశేషముగా కనబడలేదు అంతకంటె శ్రుతి లయపూరితిపై నడకకు ఆధారమైన లక్షణముబట్టి తిశ్రగతిచ్ఛందము, చతురస్రగతిచ్ఛందము మొదలయినఛందము తేర్పరిచి పద్యములు చెప్పుటవల్లను ప్రయోజనము విశేషముగా ఉండుననిన్ని అట్లు ఏర్పడిన పద్యములు తెలుగుభాషకు అమరి ఉండు ననిన్ని నాయభిప్రాయము వృత్తములలో ప్రతిపాదములోను గణములవరుస ఒక్కలాగుననే ఉండవలెనన్న నిర్బంధ మున్నది. దానివల్ల ప్రయోజనమేమో!

అయితే లయకు సులువుగా విరిగేటట్లున్న పద్యములకంటె లయ ఉండీన్ని కనబడకుండా ఉండేపద్యములు అప్రతిహతమైన నడకకు అనుకూలముగా ఉంటవి ఇటువంటివి ఉత్పలమాల, చంపకమాల, శార్దూలము మత్తేభము. ఇవి ఏదో ఒక తాళమునకు లొంగే ఉన్నవి.

ఉత్పలమాల చంపకమాలపాదములు చతురస్రగతి చతురస్రజాతి త్రిపుటతాళమునకు సరిపోవును. శార్దూలమత్తేభములు మత్యతాళమునకు చదువవచ్చును.

ఇటువంటివృత్తములు విశేషముగా లేవు ప్రస్తరించి కల్పించుట కూడా కష్టముగానే ఉన్నది. శోధనకోసము నేను వ్రాసినవాటిలో ఒకటి చూపిస్తున్నాను.

కవికాంత.

శూరుఁడు వీర్యపరాక్రమోన్నతుఁడు + సుశ్లోకుండు జనార్దనుండు కం
సారి మురాసురవైరి మాధవుఁడు + సౌమ్యం బంచు వారి న్నుతింపఁగా
ధారుణ స్వర్గ మంచి విశ్వయతి + పాటింపన్ గవికాంత యాకృతిన్
సూరిజనస్తుతవృత్తమై తనరు + సొంపారన్ గవి చెప్పఁ గల్గినన్.

ఇది ఆకృతి యనే 22 వ ఛందమున పుట్టిన 141279 వ వృత్తము. ప్రతిపాదము చతురస్రగతి ఆదితాళమునకు సరిపోవును పరిచితిగలవృత్తముల వలె చదువబోయినవారికి నడక చెడినదన్న భ్రమకలుగును గాని రెండుమూడు సార్లు చదివిన పిమ్మట దీనినడక పట్టుపడగలదు దీనిలో మొదటనున్న భగణము నలముగాను యతిస్థానమందున్న మగణము సగముగాను మార్చి క్రొత్తవృత్తములు చేసుకోవచ్చును దీనివలెనే నడిచేవృత్తములు మరికొన్ని చెప్పవచ్చును

ఈకవికాంతా పాదములు చతురస్రగతి చతురస్రజాతి త్రిపుటతాళమునకు (అనగా త్రియను నాలుగు అక్షరములు చొప్పున ఆదితాళము $4\times(4+2+2)=32$ సరిగా నడుచును. *

1. 7. లఘువునకు ఒకమాత్ర గురువు నొదవు ద్విమాత్రల్" ఈ విషయమునుగూర్చి జయంతి రామయ్యపంతులుగారు వ్రాసినది అశాస్త్రీయము.

వ్యంజన మర్ధమాత్ర యనున్యాయమునే మరల్' అను సప్పుడు

---

* ఆంధ్రపత్రిక సంవత్సరాదిసంచికలో ఛందోరహస్యదర్పణము— పద్యరచనావ్యవస్థ" అను పేరుగలవ్యాసములో ఇక్కడ సంగ్రహించి చెప్పిన విషయములు కొన్ని విపులముగా చర్చించినాను.

'తన్' అనుగురువు సార్ధమాత్రక మగును. అనగాన్' అనుచో 'గాన్' అను గురువు సార్ధద్విమాత్రకమగును" అని వ్రాసినారు.

ఈసందర్భమున మాత్రా" పరిమాణము అచ్చునుగూర్చి చెప్పవలెను గాని వ్యంజనమునుగూర్చి చెప్పకూడదు. అచ్చులబట్టి (Syllables) అక్షరము లేర్పడును గాని వ్యంజనములబట్టి ఏర్పడవు ధ్రన్'లో ఎన్నివ్యంజనములున్నా అచ్చు ఒక్కటే గనుక అది ఒక్క Syllable) అక్షరముగ చెప్పవలెను.

వనితన్ అనునప్పుడు చివరనున్న హ్రస్వాచ్చుపై నిల్చిన నకారపొల్లు ద్విగుణోచ్చారణకలది యని చెప్పవలెను, గాని దానికి మాత్రాపరిమాణము చెప్పకూడదు. అనగాన్' అనునప్పుడు దీర్ఘాచ్చుపై నున్న నకారపొల్లుకు ఈద్విగుణోచ్చారణములేదు. ఎంతవరకు అచ్ దీర్ఘోచ్చారణప్రయత్నము ఎక్కువై ఉంటుందో అంతవరకు వ్యంజనద్విగుణోచ్చారణప్రయత్నము తగ్గును. గనుక తన్' కాన్ తాల్)' తాంల్)'—వీటి అన్నిటిలోను తకారము పైనున్న అచ్చు రెండుమాత్రల గురువేగాని భిన్నము కాదు అయితే వీటిలో వ్యంజనమునకు పూర్వమందున్న హ్రస్వాచ్చు ఎందుకు రెండుమాత్రల గురువైనదంటే—ఎప్పుడైనా ఉచ్చారణప్రయత్నమును బట్టి అచ్చుకు మాత్రాపరిమాణము చెప్పవలెను. తన్ అనునప్పుడు తకారముమీది అకారము ఉచ్చరించినప్పుడు వెంటనే నకారోచ్చారణ చేయవలసివచ్చుటచేత వ్యంజనోచ్చారణ ప్రయత్నము ద్విగుణమైనది. అందుచేత తన్' రెండుమాత్రల గురువుగా చెప్పవలెను.

1. 20 ఈపద్యములో నాల్గవపాదము చక్కగా అర్థముకాలేదు. "నగణ పునరుక్తి నొక్కటి డిగెను" అంటే చంద్రగణములు ప్రస్తరింపగా కడపటి నలలము) ఒకలఘువు తక్కువగా రెండువగణములని అర్థము కావలెను. "ఇరువది తొమ్మిదింట" అంటే అర్థము కావటలేదు.

67. దశరథాత్మజుడు స్వామి ధాత్రికనరా" ఇందులో ద్విత్వము నకు పూర్వమందున్నది గనుక డు' ఊది పలుకవలెననిన్ని గురువుగా పలుక వలెననిన్ని అనంతుడు వ్రాసినాడు, గాని ఇది ఇతరలాక్షణికుల సమ్మతము కాదు. తెలుగులో పదాదినున్న ద్విత్వమునుబట్టి వ్యస్తముగా ఉన్న పూర్వ పదాంతవర్ణము గురువుకాదని తక్కినలాక్షణికుల మతము.

94. టీక. వ్యావహారిక భాషలోనే ఉన్నది.

. యిరువదిన్ని .. స్వరయతిరైనాను, వ్యంజనయతిరైనాను ప్రయోగించతగును" అనే ఉన్నది. ఇందులోనేకాదు. అప్పకవీయము మొదలు యినలాక్షణిక గ్రంథము లన్నింటిలోను ఇట్టే వాడుక భాషను టీకలువ్రాసినారు. అనవసరముగా నిరాధారముగాను భాషమార్చి అచ్చువేయడము అచారమైనది.

IV 107 తదరుగ అ ఆ ఇ ఈ లనగా ఉ ఊ లనాగ .." ఈపద్యములో హ్రస్వాక్షరములే అయినా అ' ఇ' ఉ' ఋ' గురు వర్ణములుగానే ఉచ్చరించవలెను. అదియెట్లు జరుగునంటే! ఈ హ్రస్వాక్షరములుచ్చరించినతరువాత ఏకలఘుమాత్రాకాలము ఊపిరి ఆపి 'అ లిగపట్టి పైవర్ణము లుచ్చరించుటచేత ఈ హ్రస్వాక్షరోచ్చారణలో ద్విమాత్రోచ్చారణ ప్రయత్నము జరిగినది

అంతేకాని పరమందున్న అ' అనే అచ్చు ద్విత్వాక్షరమువలె ఉచ్చరించుటచేత పూర్వమందున అ' గురువు అగునని జయంతి రామయ్యపంతులుగారు చెప్పినసమాధానము అశాస్త్రీయము అచ్చువిషయమున ద్విత్వాక్షరోచ్చారణమంటే దీర్ఘోచ్చారణమని చెప్పవలెనేకాని వ్యంజనములవిషయమై చెప్పిన అర్థముపొసగదు. ద్విత్వవ్యంజనమునకు పూర్వమందున్న హ్రస్వాచ్చు గురువు కాగలదుగాని కేవల దీర్ఘాచ్చునకు పూర్వమందున్న హ్రస్వాచ్చు గురువు కాలేదు.

ఈ ఛందోదర్పణమునకు ముఖబంధనముగా ఉపోద్ఘాతము వ్రాయవలసినది అని నన్ను కోరి గౌరవించినందుకును ఛందోవిషయములగూర్చి నా యభిప్రాయములను తెలియచేయుటకు నాకవకాశము ఇచ్చినందుకును నామిత్రులు బ్రహ్మశ్రీ, వావిళ్ల. వెంకటేశ్వరులుగారికి నాకృతజ్ఞతావందనములను సమర్పించుకొంటున్నాను.

ఇట్లు,

పర్లాకిమిడి 1—6—1921 }

గిడుగు వేంకట సీతాపతి
పర్లాకిమిడి రాజావారికాలేజిలో లెక్చరరు

# ద్వితీయ ముద్రణ పీఠిక

ప్రాచీనులగు తెలుఁగుకవులలో ననంతుఁడు ప్రసిద్ధుఁడును లాక్షణికుఁడు నగుకవి. ఈతనికృతులు మూఁడు మనకు లభ్యము లగుచున్నవి. 1 భోజరాజీయము—పద్యకావ్యము. 2 ఛందోదర్పణము—ఛందస్సు 8 రసాభరణము— అలంకారము. ఈ మూఁడును ముద్రితములైనవి. ఈతనిచరిత్రము మన కెఱుకపడినంతవఱకుఁ దెలిసికొందము

భోజరాజీయమున (1. ఆ. 12-56 పద్యములం) నీతనివంశవర్ణన సమగ్రముగ గలదు.

## ఆర్వేలనియోగి శాఖయందు కౌండిన్యగోత్రము

నందన లక్కమాంబ



శైవాలలో శ్రీరత్నదేవు అయ్యన తిక్కనసోమయాజిచేత 'శివ్యభారతి' యనిపిలువబడు నందరు. (1-24) ఈతఁడు భాస్కరరామాయణకర్తలలోనివాఁడు. (1-10) కవిరత్నము (1-24) అని ప్రస్తుతుఁ డయ్యెను.

తన యన్నదమ్ము లాఱ్వురిలో నాగ్నిక్కుఁడు పేరు యుండ్లకు పెంద అగుటచే నాత్రేయవంశ మయ్యెనని (1-43) అనంతుఁడు చెప్పినాఁడు.

## అనంతుని తల్లివంశమువారు ప్రసిద్ధులు.

శ్రీవత్సగోత్రుఁడు అక్కదండాధినాథుఁ డీమె తండ్రి. అక్కమాంబ తల్లి చిట్టనమంత్రి, అయ్యలార్యుఁడు నన్నలు తమ్మనమంత్రి తమ్ముఁడు కోట కరుణాకరుఁడు, మడుమూరి పెద్దన్న యీమె మేనమామలు (1-42) అనంతుని పితతండ్రి సింగన భార్య యాజ్ఞసేనవంశమువారు ప్రసిద్ధులు. భారద్వాజగోత్రుఁడు-సింగనమంత్రి తండ్రి అన్నడు తల్లి నారన మారన, సింగన మాచన వల్లభన్న తమ్ములు. (1-52) అనంతుఁడు కృష్ణవేణ్ణా, మహానదీ భీమరథి యను నదీత్రయాంతర్వేదియందు పెరమగూరు నివాసి. ఈతని తండ్రి కృష్ణామండలములోని శ్రీకాకుళక్షేత్రదైవతమగు ఆంధ్రవల్లభుని గొలిచెడివాఁడు. (1-40) అనంతుడు వైష్ణవప్రపత్తి గలిగినవాఁడు తిరువెంగళ అళగురి, యాజ్ఞ శ్రీదేవచక్రవర్తు లన్నలుగా పేరుగన్న నల్లాన్ గోవిందచక్రవర్తుల శిష్యుఁడు. వాణీప్రసాదలబ్ధవాగ్విభవుఁడు. (1-11 12) నల్లాన్ గోవిందచక్రవర్తి శాసనము పల్నాడులో (కారెంపూడిలో) గలదు

" Another record on a detached slab from the same temple (No 556 of 1909) is dated earlier in the year Saka 1318 (—A D 1396-97) and reg sters the decision of the Vaishnava Teacher Na lanu Gov ndachakravarthi Iyyangar in the matter of certa n relig ous rights bestowed on Badugulavaru of Pa l nadu' .

(Madras Epigraphical Report. 1910. page 109para 49)

నర్తాత్తికొలుపు నా వ్యవహారలక్షణం
　　బెట్టిగెడుకొలుపు ననేకవిధము
లగు నతుంగళములు హరియించుకొలుపు ను
　　చితవితర్కసౌఖ్యనంసిద్ధికొలుపు
నొవరఁ గాంతానమ్మితోపదేశంబునఁ
　　బ్రీతిమై హిత మాచరించుకొలుపు
నద్యోగగాని పెద్ద లాదరించెద రందు
చేస్పకొలఁది కృతి యొనర్పఁబూని
యస్మదీయకృతికి నధిపతిఁ గావింప
నర్హుఁ డెవ్వఁ డొక్కొ యని తలంచి

అనియు ననువదించినాఁడు.

తెలుఁగుకవులలో—

ఉ. 'నన్నయభట్టుఁ దిక్కకవినాయకు భాస్కరు, రంగనాథుఁ, జే
　వన్నెకఁగన్నయట్టి యమరేశ్వరు పెట్టయమంత్రి నాదిగాఁ
　బన్నకవీంద్రులన్ ......' పేర్కొనినాఁడు. (1-2)

అనఁగాఁ కవిత్రయమును, (భారతకవులను) భాస్కరరంగనాథుల రామాయణకవులను, ప్రసిద్ధకావ్యరచయిత చిమ్మపూఁడి యమరేశ్వరుని స్తుతించినాఁడు.

రసాభరణములో ననంతుఁడు తనకాల మిట్లు చెప్పుకొనినాఁడు.

శా. శాకేంద్రాళ్ శకవర్షముల్ యుతశరద్వ్యోమేందులై యొప్పు న
　వ్యాప్యానందాబ్దమునందు మాఘమున కృష్ణైకాదశిన్ భౌమయు
　క్తానామామృతవేళ నీకృతి యనంతాఖ్యుండు సమ్యగ్రస
　శ్రీ నందర్ ధర్మపట్టణాధిపున కర్పిత్వ భక్తిపూర్వంబుగన్.

శా. శ. ఋతు-6, శర-5, [1]జ్వాలా 3, ఇందు-1, 'అంకానాం వామతో గతిః' అను న్యాయమున 1356. (1356+78) ఆనందనామ సంవత్సర మాఘ బహుళ ౧౧ మంగళవారము 1435 జనవరి 25 తేదీ యగును. కవి పదునైదవ శతాబ్ది, మధ్యమున్నవాఁడని నిశ్చితము.

## భోజరాజీయము

భోజరాజీయము 'దత్తాత్రేయమునీంద్రుఁడు వక్తగాఁ గాంభోజరాజు శ్రోతగా నధిగతవిద్యాసమాజం బగు భోజుని పూర్వవృత్తాంతముఁ దెలుపు శేదాఖ్యానముల చంపూకావ్యము ఇందు 1 ఆ. 187 2 ఆ. 224, 3. ఆ. 266, 4 ఆ. 359 5. ఆ. 377, 6. ఆ. 415, 7. ఆ. 263. మొత్తము 2091 గద్యపద్యములు గలవు. అనంతునిశైలి తిక్కనశైలి వెన్నంటుచు, లలితపదబంధురమై, సులభగ్రాహ్యమై యుండును. భోజచరిత్ర యనికూడ నీగ్రంథమును కవి యిందునను, ఛందోదర్పణమునను పేర్కొనినాఁడు. ధర్మరీతులు, నీతులు, చిత్రకథలై యుపాఖ్యానశ్రోతృపేయముగా దీనిని రచించినాఁడు దీనిని తొలుత క్రీ. శ 1904 లో శ్రీ వీరేశలింగము పంతులవారు శ్రీచింతామణిముద్రాక్షరశాలలో రాజమహేంద్రవరమున ముద్రించి ప్రకటించిరి. శ్రీవావిళ్లవారు క్రీ. శ. 1924 లో ద్వితీయ

---

1 సంస్కృతాంధ్రనిఘంటువులలో 'జ్వలన' శబ్దమునకు గణితపరిభాషలో మూఁ డనునర్థము గలదు కాని 'జ్వాలా' శబ్దమున కాసంఖ్యావాచకముగా నర్థము లేదు 'జ్వాల' యనగా నగ్ని యనునర్థము కలదు గాన దాని నుండి గణితపారిభాషికముగా ననంతుఁ డిట్లుపయోగించి యుండవచ్చును. అట్టిచో తెలుఁగునిఘంటువులలో 'జ్వాలా' శబ్దమునొద్ద నీయర్థమును ప్రయోగసహితముగాఁ జేర్పనగును.

ముద్రణము గావించిరి.[1] దీనికి 'కాంభోజరాజు కథలు' అను పేర వచనానువాదము కలదు. శ్రీ. శ 1921 లో శ్రీ త్రిశేషులం నాగభూడి కుప్పుస్వామయ్యగారు దీనిని భోజరాజీయకథ లను పేర నిర్దుష్టముగ గ్రాంథికశైలిలో వచనముగా రచియించిరి.

## రసాభరణము

రసాభరణము కాలంగాళ్వారుల పద్యకావ్యము. పేరినిబట్టి యిది వైద్యవిషయికముగాక యలంకారికవిషయమని తెలిసికొనదగును. ఇందు 1. సంజ్ఞాప్రకరణము. 2 రతిప్రకరణము 3. శృంగారప్రకరణము 4 నాయికానాయకప్రకరణము అను ప్రకరణములు కలవు. ఇది రసాభరణము కావున కావ్యమున కాత్మ రస మని చెప్పిన మమ్మటుని కావ్యప్రకాశమును విశ్వనాథ పంచాననుని సాహిత్యదర్పణము సాధారముగాఁ జేసికొని కవి విషయములను మేళవించఁ జేసినాఁడు" అని శ్రీకాకారులు వ్రాసిరి. ప్రతాపరుద్రీయము దీనికి మూలగ్రంథ మగునని విమర్శకులు తెలుఁగున మనకు లభ్యమైన యలంకారగ్రంథములలో నిది రెండవది మొదటిది విన్నకోట పెద్దన కావ్యాలంకారచూడామణి. ఇందు శృంగార భక్తి, వాత్సల్యముల కైకమత్యము చెప్పఁబడినది. నాట్యవేదమునఁ దెలుపఁబడిన వాగ్విలసన, వైపర్య అంగక్రియలును, సంకీర్ణ, మిశ్ర శృంగారములును దెలుపఁబడినవి

---

1 దీనిని శ్రీవావిళ్లవారు తిరిగి నూతనముగ పరిష్కరణము గావించి మూఁడవతూరి ముద్రింపుచున్నారు.

భోజరాజీయమునుగూర్చి—

1. భోజరాజీయము—వైలి శ్రీ అవసరాల వేంకటవరదు. భారతి 12 సం. సం. 1 (1928)

2. అక్కన అనంతామాత్యుఁడు శ్రీ దేవుమళ్ల అచ్యుతరావు విజయనగరసామ్రాజ్యమందలి ఆంధ్రవాఙ్మయము 1-వ భాగము 4 అధ్యాయము. పుటలు 73—79 చూడుఁడు.

ఈ గ్రంథము చిత్రకవి అనంతకవి హరిశ్చంద్రనలోపాఖ్యాన వ్యాఖ్యలో నుదాహరించినాఁడు.

రసాభరణము-ఆంధ్రసాహిత్యపరిషత్తు (కాకినాడ) 1931లో విద్వాన్ కోట్ల శివకామేశ్వరరావుగారి పీఠికతోఁ బ్రకటితము. రసాభరణముపై ఉభయభాషాప్రవీణ కొమ్మనమంచి జోగయ్యశర్మగారి విమర్శవ్యాసము చూడఁదగును. ఇది సాహిత్యపరిషత్పత్రిక సంపుటి 21. సంచిక 4 145-160 పుటలలోఁ గలదు. మూలము ప్రతి పరిషత్తులోఁ గలదు. వ్రాఁతప్రతి సంఖ్య 178.

## ఛందోదర్పణము

తెలుఁగుభాషలోఁ బ్రసిద్ధములై, వ్యాప్తిలో నున్న ఛందోలక్షణగ్రంథములయందు ఛందోదర్పణ మొకటి. దీని వెనుక వెలువడిన లక్షణగ్రంథకర్తలందఱును నీగ్రంథము నుదాహరించినవారే! వెల్లంకి తాతంభట్టు చిత్రకవి పెద్దన, లింగముగుంట తిమ్మన ముద్దరాజు రామన అప్పకవి మొదలగు సుప్రసిద్ధ లాక్షణికు లందఱును ననంతునిఁ బేర్కొనిరి. అప్పకవి యందఱికన్న హెచ్చుగా నిందుండి విషయముల గ్రహించెను పది లక్షణపద్యముల నుదాహరించెను ఇట్టి ప్రశస్తగ్రంథమును దొలుత శ్రీవావిళ్లవారు క్రీ. శ. 1921 లో డాక్టరు గిడుగు సీతాపతిపంతులుగారి విపులపీఠికతోఁ బ్రకటించియున్నారు. నేఁడు తిరిగి వారే దీనిని క్రీ శ. 947 లో పునర్ముద్రణముఁ గావించియున్నారు. ఈగ్రంథము 1921 లో ప్రకటితమైనవెనుక శ్రీయుత రావూరి దొరసామి శర్మగారు దీనిపై నొక సమీక్షఁ బ్రకటించియుండిరి (చూ. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక సంపుటము 32. సంచిక 3-4-5-6 పుటలు 113-128, 153-73.) ఈసమీక్షయందలి సవరణలు కొన్ని యీకూర్పున గ్రహింపఁ బడినవి. దానిపై యీవ్యాసకర్తకు ప్రకాశకు లెంతయుఁ గృతజ్ఞులు.

తెలుఁగు భాషలోని ఛందోగ్రంథములయందు రెండు గ్రంథములు 'ఛందోదర్పణ' మను పేరుతోఁ గలవు. ఒకటి అనంతునిరచితము. అనంతుఁడు దీని గద్యలలో 'ఛందోదర్పణము' అనియే పేర్కొన్నాఁడు. రెండవది

ఇట్టి తాతంభట్టు రచించినది. తాతంభట్టు 'కవిచింతామణి' కాక 'ఛందోదర్పణము'ను రచియించియున్నాఁడు అది యముద్రితము.[1] అప్పకవికి ముందుగనే ఛందోదర్పణములు రెండుండుటచేత నాతఁడు పూర్వగ్రంథనామ సంగ్రహమున' ఛందోదర్పణమనియు అనంతామాత్యచ్ఛందంబనియు వీనిని వేఱుగా పేర్కొనినాఁడు అముద్రితమగుటచే తాతంభట్టు ఛందోదర్పణము వ్యాప్తిలోనికి రాలేదు.

అనంతుఁడు తన ఛందస్సులో తనకు ముందున్న లాక్షణికులనుగాని, అట్టి గ్రంథములనుగాని పేర్కొనలేదు. కాని యాతఁడు తనకాలమును స్పష్టముగాఁ దెలిపియుండుటచేత నంతకుముందున్న ఛందోగ్రంథములను దెలిసికొనుట కష్టసాధ్యము కాదు. అనంతునికంటె ముందును సమకాలికము లగునవి 1. మల్లియరేచన కవిజనాశ్రయము. 2. గోకర్ణుని గోకర్ణచ్ఛందస్సు 3. కవివాగ్బంధనము లేక కవిసార్వభౌమచ్ఛందస్సు (లింగమనసోమయాజికృతము) 4. అథర్వణచ్ఛందస్సు 5 శ్రీధరచ్ఛందస్సు 6. కవిరాక్షసచ్ఛందస్సు 7 కావ్యాలంకారచూడామణి 7 8 ఉల్లాసములు (ఛందస్సు). (ఇది క్రీ. శ. 1402 1407 లో రచింపఁబడినదిగాన అనంతుని సమకాలికమే యగును) 8. కవిగజాంకుశము. (వైరవకవిది) ఇదియు ననంతుని సమకాలికమే.[2] కాని వీనిలో కవిజనాశ్రయమును, కావ్యాలంకారచూడామణియు నేఁటికి వ్యాప్తిలో నున్నవి తక్కినవానిలో కవిసార్వభౌమఛందస్సు అముద్రితము. మిగిలినవి సమగ్రముగ లభింపలేదు. అయినను తరువాతిలాక్షణికు లనంతుని విశేషముగ పేర్కొనుటచే నాంధ్రచ్ఛందోగ్రంథములలో ఛందోదర్పణమున కున్నతస్థానము గలదని చెప్పనొప్పును

1. ఇది తంజావూరి సరస్వతీభాండాగారమున నున్నది సంఖ్య 713. దీనిఁగూర్చి తే 19-5-1947 ది 'త్రిలిఙ్గ' పత్రికయందు ప్రకటితమైన 'సులక్షణసార విమర్శనము, ఛందోగ్రంథములు' అనువ్యాసమును చూడుఁడు.

2 నీలకంఠచ్ఛందస్సు, లక్షణసారము, ఉత్తమగండచ్ఛందస్సుమున్నగునవి ప్రాచీనములని వాడుక. ఈ ఛందోగ్రంథములనుగూర్చిన పర్యాప్తమైన పరిశీలన కవిజనాశ్రయ పీఠికయందు చూడుఁడు.

అనంతుని ఛందోదర్పణమునందలి కొన్ని విశేషములు.

2. ప్రాచీనలేఖన క్రమపద్ధతి —

ఆ. వె. కుఱుచమీఁద నున్న హలి తేలవ్రాయఁ బ్ర
పద్యయాది నిట్టు జరుగ నచ్యు
తుఁడు నమస్తవల్లభుఁడు నాఁగ నయ్యచ్యు
తుండు సకలవల్లభుం డనంగ. (1-34)

ప్రాచీనకాలమున నేఁటి యరసున్న లేమ అన్నియును బిందుసున్నలు గానే వ్రాయుటచే పద్యములు చదువునపుడు గణభంగ మగుచుగాన కొన్ని బిందుసున్న లూఁది పలుకుటయు కొన్ని బిందుసున్నలు తేల్చి పలుకుటయు సంభవించెను. ఇది కేవల ముచ్చారణ ననుసరించినది కావునను, ఉచ్చారణ ననుసరించియే వర్ణక్రమము తెలుఁగున వ్రాయఁబడుచుండుటచేతను పూర్వము బిందుసున్నను తేల్చి పలికినప్పుడు బిందుసున్న గానే వ్రాయుటయు ఊఁది పలికినపుడు బిందుసున్న తరువాత నుండు హల్లును ద్విత్వముగా వ్రాయుటయు నను నొకసంప్రదాయసిద్ధమైన లేఖనపద్ధతి యేర్పడినది. పైవిషయమును స్పష్టపఱచుట కాపద్యమునే యనంతుని కాలమునాఁటి లేఖనపద్ధతిలో వ్రాయుచున్నాను.

ఆ. వె. కుఱుచమీందనున్న హలితేల వ్రాయం బ్ర
పద్యయాది నిట్టు జరుగ నచ్యు
తుండు నమస్తవల్లభుండు నాంగ నయ్యచ్యు
తుణ్డు సకలవల్లభుం డ్డనఙ్గ.

పైదానిలో 2 వ పాదమున కుఱుచలమీఁద నవఁగా హ్రస్వములమీఁద - ప్రాయం బ్ర, తుండు, ఖుండు—అనువానిలో బిందుసున్న తేల్చి పలుకవలయును. లేనిచో గణభంగ మగును. 4 వ పాదమున తుండు ఖుండు అనువాని నూఁది పలుకకపోయిన గణభంగ మగును. అనంతుఁ డీ పద్యమున

హ్రస్వములకు (కుఱుచ) నుదాహరణముగా నీ పద్ధతిని చూపుటయేగాక దీర్ఘములమీఁది యుచ్చారణగుఱించియు నిట్లు చెప్పియున్నాఁడు.

ఆ. వె. అర్ధబిందుసహిత మగు వర్ణమునకుఁ బ్రా
సాది యరయ నిడుద యక్కరంబు
పేఁడు మనకు గల్గినాఁడు లక్ష్మీనాథుఁ
డేఁటి కింక పేఁడు మాట లనఁగ. 1-33

హ్రస్వములపై బిందువున్నల నూదికలిపినపుడు తేల్చికలిపినపుడు గణభంగ మగునుగాని దీర్ఘములమీఁద గణభంగము కాదు కాబట్టియే క్రమక్రమముగా దీర్ఘములపై బిందువున్న యుచ్చారణలోపించి, లోపించిన బిందువున్న యుచ్చారణచిహ్నముగ నరసున్న వెలసినది. ఈవిషయమునకు పైపద్యములోని 'మీఁద, సాఁగ,' అనుపదములే యుదాహరణములు. అచట ఎట్లు పలికినను గణభంగము కాదు. దీర్ఘమున కుదాహరణముగా నిచ్చిన పద్యమును కూడ పైరీతిని వ్రాసిన నీవిషయము స్పష్టమగును.

ఆ. వె. అర్ధ బిందుసహిత మగువర్ణమునకుం బ్రా
సాది యరయ నిడుద యక్కరంబు
పేండ్డు మనకు గల్గినాండ్డు లక్ష్మీనాథుం
డేంట్టి కింక పేండ్డు మాట లనంగ.

అనంతుని కాలమునకు పైరీతి లిపిక్రమము వెలయుటచేత, 'ఏంట్టి మొదలగుశబ్దములలో బిందువున్న యుచ్చారణమే పూర్తిగ నశించినదనియు, ఏఁటికి' అనియున్నను ట్టి ద్విత్వమైనను లఘువే యగుటచే మాటలు' అను బిందువున్నదని శబ్దములో వ్రాయ సరిపోయినదనియు గ్రహింపనగును.

దీని ననుసరించియే, సార్ధబిందుక నిర్బిందుక ప్రాసము ననంతుఁడు తెలుఁగులాక్షణికులలో తొలుత తెలిపినాఁడు. దీనిని తెలుపుటలోఁగూడ ననంతుఁడు ప్రాచీనమైన తెలుఁగుభాషా సంప్రదాయములను గ్రహించియే తెలిపియున్నాఁడు. దానివలన నీఛందోదర్పణవిశిష్టత తేటపడును.

అనంతుఁడు పైని చూపినపదములన్నియు తెలుఁగుపదములు- తెలుఁగునకు సహజమున్న స్వభావసిద్ధమైనది అచ్యుతుఁడు, వల్లభుఁడు, లక్ష్మీనాథుఁడు అను నవి సంస్కృతపదములే యైనను, వాని ప్రథమావిభక్తి ప్రత్యయము 'ఁడు' తెలుఁగేకదా! ఇఁక సంస్కృతమున బిందుసున్నయేగాని యరసున్న యుండ నేరదు కాబట్టి సంస్కృతశబ్దముల లోనిసున్నలు కూడ పై లేఖనపద్ధతిని పూర్ణములుగానే లిఖింపబడుచుండెడివని పై లేఖనక్రమమే తెలుపుచున్నది. కాఁగా ననంతునికి ముందీలేఖనపద్ధతిని నన్నెచోడ మల్లియరేచన, పాల్కురికి సోమనాథాదికవులు బిందుపూర్వక సంస్కృతపదములతోడను, బిందుపూర్వక తెలుఁగుపదములతోడను ప్రాసము పాటించిరి.

1. చ పింగ నకారసత్త్వగుణవిస్ఫురణా బరమేశ్వరోదయా
   మాంగము . ..నే
   వాంగ .. .. .. .. ..... . ... ..(కుమారసంభవము 1-4)
2. కం. పొందిగ-మాందు-బ్ర, ష్టాందము-ఖాండము
   కుమారసంభవము (6. ఆ. 814 ప.)
3. పాందు రాంగంబైన ..... ..
   పొందిగా . ..... (సోమనాథుఁడు)
4. మాందు సేసిన .. .. ..ంబు
   ట్టుండవలయు .. ..

కవిజనాశ్రయము (రేచన) వాక్యధికారము. 2

మొదలగునవి యుదాహరణములు. ఇచ్చట పొంది మాందు మొదలగు తెలుఁగుపదములలోని బిందుసున్న తేలిపోవునుగాని బ్రష్టాంద ఖాండ, పాండు రాంగశబ్దములలో బిందుసున్న యెట్లు లోపించఁగలదు! కాబట్టి తొలుత తెలుఁగులో దీర్ఘములమీఁద బిందుసున్న యుచ్చారణములోనున్నట్లే మనము గ్రహింపవలెను. ప్రాచీనభాషాసంప్రదాయము ననుసరించి యాప్రాసము

సంగ్రహింపఁబడినదే గాని, తెలుఁగు లాక్షణికులు దీనిని గ్రహించియుండలేదు. దీనికి కారణము నన్నయభట్టారకుఁడు తన భారతభాగమున నిట్టి ప్రాసలను ప్రయోగింపకపోవుటయే యని తలఁపనగును. నన్నయభట్టారకుఁడే కాక తిక్కన ఎఱ్ఱనాదిమహాకవులును దీనిని గ్రహించి యుండలేదు. కవిత్రయభారతము పూర్తియైనవెనుక నదియే భాషకు ప్రమాణమగుటచే లాక్షణికులు దీనిని పాటింపరైరి. అనంతుఁడు దీనిని స్వీకరించుటయే యాతని విశిష్టత.

పైని వివరించిన లేఖనక్రమమునుబట్టియు కేవల మరసున్న కంటెయే లేని సంస్కృతశబ్దములతో తరువాత నరసున్నలై, నిండుసున్నగల తెలుఁగు శబ్దములతో ప్రాసఁ గూర్చుటయును పరిశీలింపగా నన్నయనాఁడు కూడ దీర్ఘముమీఁద నిండుసున్నయే యుచ్చారణమునందుండెనని నిశ్చయముగా స్పష్టమగుచున్నది. నన్నయ యిట్టి ప్రాసలు వాడకపోయినను, నన్నయ సమకాలికగ్రంథములయందును తరువాతిగ్రంథములయందును నిది తెలియుచుండుటయే, నన్నయనాఁటికి యనఁగా 1050 నాఁటి కీపద్ధతియుండెననుటకు తార్కాణము. అయినను నన్నయభట్టకృతమని చెప్పఁబడు సాంధ్రశబ్దచింతామణిలో 'దీర్ఘాచ్చేత్ ఖండ ఏవ స జ్ఞేయః' దీర్ఘాచ్చునకుఁ దర్వాత ఖండముమాత్రమే నిలుచునని తెలియనగును." అని యెట్లు సూత్రింపఁబడినదో దురూహ్యముగ నున్నది.

దీర్ఘముమీఁద నిండుసున్న యూఁదిపలుకుట యుచ్చారణలో శ్రమ హెచ్చుగావున నది దీర్ఘములమీఁద క్రమక్రమముగా త్వరలోనే తేలిపలుకుట సంభవించెనని యెన్ననగును. అనంతుని కాలమునాఁటికి (క్రీ. శ. 1436) తెలుఁగుపలుకులలో కొన్నింటిలో దీర్ఘముమీఁద నిండుసున్న పైకారణముచే నుచ్చారణభ్రష్టమయ్యెననియు, కొన్నింటియం దింకను తెలియుచునే యుండెననియు, నందుచేత తనకు ముందు వాఙ్మయములో వెలసిన సంస్కృతపద, తెలుఁగుపద పూర్ణబిందుప్రాసములను నివారించుటకు కేందు మనకు గల్గి కాంచు 'లక్ష్మీనాథుఁ' డిత్యాదిగా తెలుఁగుపదములతో ప్రాసలో నుపయోగింప

దగినదనియును స్పష్టమగుచున్నది. మఱియు నీ విషయ మొక్కటియే నన్నయభట్టాంధ్రశబ్దచింతామణి విరచింపలేదని యాంతరంగిక సాక్ష్యమని చెప్పనొప్పును. కాఁగా ననంతుని కాలమునకు ముందు సార్ధబిందునిర్బిందు శబ్దముల పరిజ్ఞానము చాలవఱకు స్పష్టముగ నుండెనని చెప్పనగును.

## 2. అర్ధబిందుప్రాసము —

గీ. సార్ధబిందువులై తేలిపట్టి పటుల
పరఁగు ప్రాసంబు నిర్బిందులైనఁ జెల్లు
వీఁపుమూఁపులు మఱి తలమోపు లయ్యె
మాట లేఁటికి మేటి తా మేఁటి కనఁగ. (1-52)

ఇవియుఁ బై విషయమునకు సంబంధించినదియే. ఇచ్చట ప, ట లకు మాత్రమే బిందువు తేలఁబలుకుటచే వ్యవహారభ్రష్టము కాఁగా ననంతుఁ డీ రెండింటికి మాత్రమే వ్యవస్థ యేర్పఱచినాఁడు. మఱియు నిచ్చట ననంతుఁడు వీఁపు' శబ్దములో బిందువు తేలిపోఁగా నర్ధబిందు వున్నదని చెప్పినాఁడనుకొని యప్పకవి దీనిని గ్రహించి, నన్నయభట్టారకుని భారతమునుండి ఖండాఖండ ప్రాసమునకు నుదాహరణము నిచ్చియున్నాఁడు. ఆ పున్నగ...వీఁపున... ద్విపదాం హాల ..(ఆది 2-15. అప్పకవీయము 3. ఆ. 311 పద్యము) కాని యిచ్చట ననంతుఁడు చెప్పినది మోపు' శబ్దమునకుఁగాని వీఁపు'నకుఁ గాదు. నాల్గవపాదములోని మాట లేఁటికి మేటి తా మేఁటి కనఁగ' అను పాదములోని క్రమమే దీనిని నిర్ధరింపఁగలదు. మొదట నిర్బిందుకశబ్ద మిచ్చి తరువాత సార్ధబిందుకశబ్దము ననంతుఁడు చూపియున్నాఁడు. దీనిని నప్పకవి తప్పుగా గ్రహించి ఖండాఖండప్రాసము నన్నయభట్టునకే యంటఁగట్టియున్నాఁడు. తన కాలమున నట్టిప్రాసములు వెలసిన కారణముచే నప్పకవియు నదియే సిద్ధాంతమని నమ్ముటయేగాక తనసిద్ధాంతమున కనుగుణముగా ప్రామాణికులైన మహాకవుల గ్రంథముల పాఠములను మార్చివైచుట పరమసాహసకృత్యము. మఱియు ననంతుఁడు ప, ట లకు మాత్రమే చెప్పగా నప్పకవి—

తుల్యలఘుఁ డనఁగ నీయములకు
తలపడ రీతోడి విరతి తలఁకొన దండున్. 88

గీ. మును ఋకార మీయేలతో నొనరినట్లు
చేర దొరకట యణాదేశకారణమున
ఋనలకారంబు యగు స్వరత్ గారవిరతి
కృతి లేదు గౌరి గుణావళుల కనంగ. 90

కాని అప్పకవి యీయతులను సంగ్రహింపకపోవుటచేతను, ఋకారము నకు ఇ ఈ, ఎ ఏ లతోడను రి రే లతోడనే యతుల నాతఁడు చూపుట చేతను నీయనంతుని ఛందోదర్పణములోని పైపద్యము లిట్లు మార్పుగావింపఁ బడినవి

విలసద్ఋకారమును మఱి
రిలలి విరతు నొందు గౌరి ఋషులకు”

అనియు,

“కృతిలేదు గౌరిగుణావళికి ననంగ”

అనియుం నప్పకవీయానుగుణముగా మార్పు చేయఁబడినది.

విలసద్రికారమును న
త్రిల విరమణ నొందు గౌరి ఋషులకు (ఛ. ద.)

అప్పకవీయములో లేనిదాన్ల తప్పుగానే భావించి, ప్రాచీనగ్రంథములలోని పాఠములుగూడ మార్పుచేయఁబడినవి. కాని యట్లు మార్పుచేయఁబడినను, పెక్కుచోట్ల వాఙ్మయమున నిట్టియతులు వెలయుచుండుటచేత, నిది యప్పకవి ప్రభావమే యనియు, నతని గ్రంథమువలన ప్రాచీనభాషాస్వచ్ఛందస్సం ప్రదాయములు మఱుఁగుపడినవనియు నీక్రిందివివరణముబట్టి గ్రహింపనగును.

కొన్ని యనంతునిఛందస్సు వ్రాఁతప్రతులలో నిట్టిపాఠము లున్నవి. ఈ పద్యములు కాఁగను లింగమగుంట తిమ్మన తన సులక్షణసారములో గ్రహించి యుండుటచేత నందు నవియును ననంతకవిపాఠములు కన్పట్టుచున్నవి.

౮. విలసద్రికారముచు వట్రులు విరమణ పొందు కోరియుచునులకు
క్షిప్తిలేదు కారిగుణావళుల కనంగ

(సులక్షణసారము 1862 లో ముద్రితము.)

కాని తరువాత నప్పకవీయము ననుసరించి సులక్షణసారములోకూడ పాఠములు మార్పుచెందినవి

* అనంతుడు యుద్ధయతిని కాకాదేశించుటయేగాక తన భోజరాజీయమునందే దానిని వాడియున్నాఁడు.

సీ. కృపాధర్మనిరతులు కానివచ్చి భక్తిపూర్వకముగా (3-27)

ప్రాచీననవీనకృతులలో నీయతికి కొన్ని యోదాహరణములు గలవు. గ్రంథవిస్తరభీతిచే వానిని విరమించి ప్రసిద్ధమును లాక్షణికమునని యంగీకరింపఁబడిన భాస్కరరామాయణమునుండి కొన్ని ప్రయోగములఁ జూపుచున్నాను. మఱియు నిట్టి యతి భాస్కరరామాయణమువంటి గ్రంథములనుండి కొన్నింటికి పాఠభేదములుకూడ కల్పింపఁబడినవి. ఈ క్రిందివి యచ్చులో నట్లే యున్నవి దీనివలన మన ప్రాచీనగ్రంథపరిష్కరణవిధాన మెట్టిస్థితియం దున్నదనియుం గ్రహింపవచ్చును.

ఆం. సా. ప. పత్రిక సం 5 సంచిక 1. 105, 106 పుటలు.

1 కాని యల్లన కాలనేమి కృపామున కరిగెన్ (యుద్ధకాండ. 1617)

2. సురనదీవీచులం దడియం శృంగములం ( . ... .....2527)

3. సూర్యాస్త్రచంద్రార్ధ-కృతోరుబాహాంశై - ( .. . 1455)

మార్చినవి 1 పృథివి బగిల్చి బంగరపుఁ బింజలయమ్ముల ( ........20 5)

(అచ్చుపాఠము)

(పుట క్రిందపాఠము - 595 పుట.)

పృథివి బగిల్చి హేమమయపుంఖశరంబుల

2. పృథుతరవిస్మయక్రమము పెంపొనరింపఁగ జూచి (2021)

---

* అనంతుఁ డిందులో చెప్పినది యుడి' కాని రిపడి కాదని బ్రహ్మశ్రీయుత వఝుల చినసీతారామస్వామిశాస్త్రులుగా రిప్పటికి ముప్పదేండ్లక్రింద తెలిపియున్నారు

(అచ్చు)

పృథుతరవిస్మయక్రమముఁ బొందిరి వారలు

(పుట క్రింద పాఠము - 595 పుట.)

నేఁటి పండితులకు సుకవుల ప్రయోగములు ప్రమాణములు కావు. కావున వారు లాక్షణికులుగా నంగీకరించిన కవులయొక్క ప్రయోగములను చూపెదను.

మడికి సింగన-వాసిష్ఠరామాయణము.—

తృణకణాంశంబు వజ్రమై త్రుంచునట్లు 3-230

క. త్ర్యక్షముకు వెలింగి - తోఁచుచుండు 2-12

గౌరన-నవనాథచరిత్ర—

త్రోదరి చొప్పుఁగ జోగి - తృతీయుఁడు మాలి. 2. ఆ. 57 పుట.

నృపునితో నొండు రత్నముగాఁగఁ జెప్ప 1. ఆ 41 పుట.

అహోబలపతి కాళిందీకల్యాణము —

మృదువైనచేతులు-ముండ్లతోదలు

ఇన్ని ప్రయోగములున్నను వైయాకరణపారిజాతములో (91 పుట) నట్రులు విరమణపొందు కొరి ఋషులకు శక్వత్ ...(అముద్రితమగుఛందోదర్పణము) అని యిట్లు ఋవర్ణమునకు రు' వర్ణములో యతి చెప్పఁబడెను. కవిప్రయోగములు దొరకనందున సరికాదని ముద్రణములలో దిద్దివేసిరి" అని యుండుట వింతగ నున్నది.

4 అనంతుఁడు రగడలనుకూర్చి విపులముగాఁ దెలిపిన లాక్షణికులలో తొలివాఁడు.

5. ఎత్తుగీతికి గీదియ' అని గీతికా తద్భవరూపము వాడినాఁడు. కవిజనాశ్రయములో

శ్రీదయితాధిపాద
యోదయమునలిపత్ర
కోదితమైనకొత్త
గీఃయ యొప్పుఁ గృతుల
(కావ్యాధికారము 20.)

అచ్చానికి అనంతుడు— నీచనరులకు కొత్తు
గీడియు కొడుకు కృష్ణ. 3-16

అని చెప్పినాడు. ఇది నిఘంటువుల కెక్కలేదు

6 తరువోజలో-నాగినుండే గిరి యతి నొక్కొక్కచరణ
మునుగొని చేయింప నుజ్జ్వలం బగుచు
దగ నుల్లసిల్లు పాదములు నాల్గింట. 3-39

గిరి యతి యనఁగా పదియవ యక్షరము యతి. గిరి' అనునది యతులకు శాస్త్రస్వీకారము చేయునప్పుడు పెట్టుకొను పేరు. ఆనందగిరి మొ. వీనికి దశనామము లని పేరు. (గిరి, పర్వత అరణ్య, వన తీర్థసాగర, ఆశ్రమ, భారతి, సరస్వతీపురి.)

7. వ్యాకరణవిషయమున ననంతుఁడు సంస్కృతసంధులనుగూర్చి విపులముగాఁ దెలిపినాఁడు సంస్కృతభాషకు వర్ణంబు లేబది యని తొలుత తెల్పినవాఁ డితఁడే. మఱియు సంస్కృతము తెనుగైన తత్సమపదంబు' అని తత్సమమునకుసరిగా నిర్వచనము గావించినవాఁ డనంతుఁడు. ఆంధ్రశబ్ద చింతామణి నన్నయకృతమను నభిప్రాయ మింతను విమర్శకలోకమునఁ బొడమకొనుటయు, దానిప్రమాణమున ప్రాచీనాంధ్రభాషా సంప్రదాయములతో రచితమైన గ్రంథములను విమర్శించుటయు జరుగుచున్న నేటికాలమునం దనంతుడు చెప్పినవానిఁగూర్చిగాని, తెలుఁగులోగల వ్యాకరణముల విషయమునుగూర్చిగాని విస్తరించి వ్రాయుట యనావశ్యకమయ్యె గ్రంథవిస్తరభీతిని విరమించితిని.

ఆంధ్రశబ్ద చింతామణ్యప్పకవ్యహోబలపతి గ్రంథపారంగతులగు పండితులకుఁ బ్రామాణికుఁడైన యనంతుఁ డీక్రింది ప్రయోగములఁగూడఁ జేసియున్నాఁడు.

1. యవ్వనము—యౌవనమునకు

ఉ. నవ్వుచు చెక్కుమీటి (భోజరాజీయము 7-108)
యవ్వనలక్ష్మికిన్-దుర్విభలారు-నివ్విధ మెల్ల - యవ్వనమంతోన యుంటఁ
గలయవ్వనంబు చెలమిఁబొంద (3-159)

పైదానిని కొందఱుపండితులు నవ్వుచు' నాపుడు' గామార్చి (మార్పుటకుగల

తత్పురుషమున సదంతరూపము కలుగుటకు సంస్కృతమున నభశ్శబ్దము సకారాంతమై యుండవలెను. కాని సంస్కృతములో అకారాంత పుంలింగమైన నభశ్శబ్దము లేదు. ఇది ఇకారాంతపుంలింగశబ్దము సంస్కృతములో సమాసాంతమందు మాత్రమే అకారాంతముగా నుండును. సమాసాంతము కానప్పుడికారాంతమే కాఁబట్టి 'నభునకు' అనునది అపశబ్దము అని శాబ్దికులు. నన్నయభారతములో 'నిషధనంచు' అని ప్రయోగము కలదు. 'నిషధుఁ డంచు' అని నన్నయ్య ప్రయోగించు దాని ననుసరించి అనంతుఁడు ప్రయోగించి యుండును.

6. ఏ ని ద్రుతాంతముగాఁ బ్రయోగము ఏ విషంగ నిచ్చయేని నొకమహా యమే నిపుడు పరిశీలించిన భోజ (6-299)

7. పృథయను సంస్కృతావ్యయము-పృథాయని దీర్ఘముగా బ్రయోగించి దీని ప్రత్యేకతను ననంతుఁడు తన ఛందస్సులో నిరూపించినాడు. (చూ 3 ఆ 118 ప) సంస్కృతావ్యయములలో పృథ యొక్కటియే దీర్ఘాంతముగాఁ బ్రయుక్తమగుటయే యిందలి ప్రత్యేకత-తక్కినవి హ్రస్వములు దీర్ఘములుగను దీర్ఘములు హ్రస్వములుగను ప్రయుక్తములుకావు. కావున యనంతుఁడు పరిశీలించియే దీనిని వ్రాసినాఁడని చెప్పనొప్పును

అనంతుఁడు ప్రాచీనాంధ్రభాషా సంప్రదాయముల ననుసరించి తన ఛందస్సులో కొన్నియో విషయములు వివరించినాఁడు. ఈనాఁడు మనకా సంప్రదాయపరిజ్ఞానము క్రమక్రమముగా క్షీణించుటచే వానిని సంపూర్ణముగ గ్రహింపలేకున్నారము. మనఛందోవ్యాకరణగ్రంథములు తెలుగుభాషాసంప్రదాయమునుబట్టి సంశోధితములై సంస్కృతములైనప్పుడు తెలుఁగుభాషా విశిష్టత తేటపడును.

ఈఛందోదర్పణము ద్వితీయముద్రణమునకు పూర్వముద్రణమునందు తడవని కొన్నియంశములనుగూర్చి పీఠిక వ్రాయుఁడని కోరి, కాకియవకాశము కల్పించిన బ్రహ్మశ్రీ వావిళ్ల వెంకటేశ్వరశాస్త్రివర్యులకు సాకృతజ్ఞత నిందు మూలముగఁ దెలుపుకొనుచున్నాఁడను.

ఇట్లు విధేయుఁడు,

10-10-1947 నిడుదవోలు వేంకటరావు.

శ్రీరస్తు.

# ఛందోదర్పణము

## తృతీయముద్రణము

# సమీక్ష

అనంతామాత్యకృతమగు నీ ఛందోదర్పణమునకుఁ బ్రథమముద్రణలో శ్రీ నిడుగు వేంకటసీతాపతిగారు విపులమగు నుపోద్ఘాతమును, ద్వితీయ ముద్రణలో శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు పీఠికయు రచించిరి అందు నై యుభయులు కవింగూర్చియు గ్రంథస్థ విషయములంగూర్చియు సవిస్తరముగఁ దెలిపియున్నారు. ఈ కృతికర్తృనకుఁ బరిష్కర్తగా నున్న నేను నా తెలిసిన కతిపయాంశముల సంగ్రహముగ నివేదింతును. కొన్ని పట్లఁ జర్వితచర్వణదోషమునైనను పాటిల్లును అందులకు సహృదయులు మన్నింతురు గాక.

ఈ ఛందోదర్పణ ప్రథమ ముద్రణానంతరము నేనొక విపులసమీక్షను రచించి యాంధ్రసాహిత్యపరిషత్పత్త్రికలోఁ బ్రకటించితి (చూ. సంపుటములు - ౩౭, ౩౮, ౩౯)

ఆ నా సమీక్షలో నిడుగువారి యుపోద్ఘాతము విమర్శింపఁబడెను. నా సమీక్షలోని కొన్నివిషయములను దమ పీఠికలో నిడుదవోలువారు స్వీకరించిరి. నా సూచించిన సవరణలు కొన్నింటిని రెండవముద్రణలోఁ గైకొనఁబడినవి. తదుపరి మఱికొంద ఱప్పుడప్పు డీఛందములోని విషయములఁ గొన్నింటిని బరామర్శించియున్నారు. ఇఁకఁ బ్రకృతము—

E

## అనంతామాత్యుఁడు

ప్రసిద్ధలాక్షణికుఁడు, మహాకవి. ఆఱువేలనియోగి ఆపస్తంబసూత్రుఁడు. కౌండిన్యగోత్రుఁడు. తండ్రి తిక్కన, తల్లి మల్లమ. ఇతని ముత్తాత అయ్యన మంత్రి, తిక్కన సోమయాజిచే భవ్యభారతీ బిరుద మందిన కవిరత్నము.

అనంతుని రచనలు మూఁడు—(1) భోజరాజీయము-చిత్రకథాత్మకమైన కావ్యము. (2) ఛందోదర్పణము - ఛందశ్శాస్త్రము, (3) రసాభరణము - అలంకారశాస్త్రము (శా. శ 1356 - క్రీ 1435 లో రచితము) కవి క్రీ. 14-15 శతాబ్దముల మధ్యకాలమువాఁడు. కవి నివాసము కృష్ణామండలము.

## ఛందోదర్పణప్రాశస్త్యము

అనంతునియీకృతి యీతని యితరరచనలకన్న సుప్రసిద్ధము, పండితారాధ్యము. తరువాతిలాక్షణికు లనంతుని బరమప్రమాణముగా నంగీకరించిరి.

చిత్రకవి పెద్దన (16 శతాబ్ది) లక్షణసార సంగ్రహములో—

"శ్రీయుతవరప్రసాదకవితాఢ్యుని వేములవాడ భీమన
య్యాదృత భక్తి వినుత దనంతు ననంతుని"

అని కవిస్తుతిలోఁ జేర్కొన్నాఁడు. మఱి లక్షణసార సంగ్రహము చాలవఱకు ఛందోదర్పణానుసారి యని పరికించినఁ దెలియఁగలదు. సులక్షణసారము కవి సంజీవని, అప్పకవీయము, సర్వలక్షణసార సంగ్రహము, రంగరాట్ఛందము మున్నగు లక్షణగ్రంథములందు ఛందోదర్పణ ముదాహృతము. పిదప మిక్కిలి యప్పకవి కీ ఛందోదర్పణమే యుపజీవ్యగ్రంథములలోఁ బ్రధానమైనది. పెక్కులక్ష్యలక్షణము లప్పకవి ఛందోదర్పణచ్ఛాయలో సంతరించెను. మఱికొందఱు వ్యాఖ్యాత లిందలి పద్యములఁ బ్రమాణముగా నుదహరించిరి.

## గ్రంథవిషయ పరిశీలనము

ఇయ్యది నాలుగాశ్వాసముల కృతి ఇందు వరుసగా (1) గురు లఘు గణయతి ప్రాసలక్షణములు, (2) వృత్తములు, (3) జాతులు, షట్ప్రత్యయములు, (4) దశదోషములు, సంధిసమాసములు ప్రపంచింపబడినవి.

### I ప్రథమాశ్వాసము

### గణభేదములు

పద్యసంఖ్య—20

గీ. ఒక్క తెలుగున తొమ్మిది యొకట నాల్గు
రెండు లఘు వెక్కినవి నాల్గు వీనిలోన
నగణ పునరుక్తి నొక్కటి డిగిరు నాల
దొంతి పదునాల్గు నిరువది తొమ్మిదింటు.

ఈపద్య మర్థము కాలేదని గిడుగువారు వ్రాసిరి. ఇందుల కర్థ మిట్లూహ్యము—తెనుగు ఛందస్సులోని గణముల మొత్తమును తెలుపు పద్య మియ్యది.

ఒక్క తెలుగున తొమ్మిది—మ య ర స త జ భ న లం... 8
ఒకట నాల్గు—గగ, లల, హ, వ ... 4
రెండులఘు వెక్కినవి నాల్గు—సూర్యేంద్రగణప్రస్తారమున ఆది లఘువున్న గణములకు ముందు రెండేసి లఘువు నిల్ప వలయు, అట్టివి నాల్గు—నగణము నల నగ, సల—వీనిలో నగణపునరుక్తి నొక్కటి డిగిరు—మొదటి దాన నగణమున్నది అది తీసివేయగా ... 3
దొంతి పదునాల్గు చంద్రగణములు ..., 14

—

గణముల మొత్తము .. 29

## బిందుప్రాస

51\. చెప్పి రొల్లు నకారంబు బిందువగుచు
మీఁద నున్న ధకారంబు మీఁదఁ బ్రాస
బంధముగఁ గృష్ణుఁ డుదయించి సంధరిత్రి
యంతయును నిరుపద్రవంబయ్యె ననఁగ.

సిద్ధపూర్ణబిందుపూర్వక ధకారమునకు ద్రుతసంధివశమున వచ్చిన బిందుయుక్త ముందుగాఁగల ధకారమునకుఁ బ్రాసమైత్రి చెల్లునని పై లక్షణమున కర్థము.

1 కేవలము ధకారమునకేకాక యన్నింటికి బిందుప్రాసచెల్లును.

విరాటపర్వము-

సింగంబాఁకటితో ..మీఁదవ, చెంగుంటిసుతమధ్యముండు...

'బిందుపై పొల్లనాఁ కెందుసంధులను గనందగుప్రాసంబు బిందువగుచు' అని పొల్లుల కన్నింటికిని ప్రాసచెల్లునని స్పష్టమగునట్లు చిత్రకవి పెద్దన వైయాకరణుని మతమును వివరించియున్నాఁడు. ఇచ్చట గమనింపవలసిన యంశ మొకటిగలదు. ఈ బిందుప్రాస సంధిగతప్రాసలోఁ జేరును. కావున బిందుప్రాస మనుభేద మనవసరము లేదు. అనంతుఁడు సంధిగత ప్రాసయఁ జెప్పెను గాని యందు సంధియం దాదేశముగా వచ్చిన నకారమునకు సిద్ధ నకారమునకుఁ గల ప్రాసమైత్రినే నిర్దేశించెను. సంధివశమున నాగమాదేశ ములుగా వచ్చిన యక్షరము లన్నియు నీప్రాసభేదములోఁ జేరును. అప్పకవి సంధిగత ప్రాసలక్షణ మిట్లే చెప్పినాఁడు.

## అర్ధబిందుప్రాస

52\. సార్ధబిందుపూర్వ తేలినట్టిపటుల
కరుఁ బ్రాసంబు నిర్బిందుకైనఁ జెల్లు
చిఁగురుటాఁకులు మఱి తల మోపు లయ్యె
మాఁటలేటికి పోటి కాఁకేటి కనఁగ

అరసున్న పూర్వమందుఁ గల యక్షరమునకు పరయున్నచో దానితోఁ ప్రాసకూర్చుట యర్ధబిందు ప్రాస యనఁబడును. దీనిని ఖండాఖండప్రాస మన్నాఁ డప్పకవి. టపలకుమాత్రమే యీ ప్రాస చెల్లునని యనంతుని లక్షణము చెప్పుచున్నది. ఈ ప్రాస టపలకేకాక తదితరవర్గముల చెల్లఁ జెల్లు నని యితర లక్ష్యలక్షణములవలన నిర్ధారితమగుచున్నది. ముద్దరాజురామన తన కవిజన సంజీవనిలో నిట్లు నిరూపించెను.—

'అర్ధబిందువు నిర్బిందువగు పదంబు
ప్రాసముల దీర్ఘములమీఁదఁ బలుకఁ జెల్లు
మూఁడు మూర్తులు సాక్షిగా మూఁడె నవఁగ
పోఁతరాజుల పలుకె నిదర్శనముఁ దనఁగ.

వ. అనంతుఁడు చెప్పినరీతి టపలకు మాత్రమే కాదు, అన్నింటికిఁ జెల్లవచ్చును." (ప్రథమతరంగము)

దీనిపై సర్వలక్షణసార సంగ్రహకర్త యగు కూచిమంచి తిమ్మకవి యనంతరామకవి ద్వయమతముల నీ క్రిందిరీతి ఖండించెను;

'అర్ధబిందువు నిర్బిందు వగు పదముల
ప్రాసములం దీర్ఘములమీఁదఁ బలుకఁ జెల్లు
ననుచుఁ దగ ముద్దరాజురామన వచించె
ప్రాస్యములమీఁద నటువలె నలరు రుద్ర.

వ. అనంతుఁడు టపలకుమాత్రమె చెప్పఁడు కాని అన్నింటికిఁ గద్దు
(2. ఆ.)

అప్పకవియును నిడుపులమీఁది యరసున్నలచే పేర్కొన్నాఁడు.
(3-302)

పై యనంతుని పద్యమున ముఖ్యముగాఁ బరిశీలింపవలసిన విషయ మొక్కటిగలదు. అర్ధబిందు ప్రాసలక్షణమునకుఁ బద్యోత్తరార్ధము లక్ష్యము.

'పిఁడు' లో నరసున్నగలదు, 'పాడు' లో లేదు; ఇది స్పష్టము. నాలవ పాదమున 'మాట, కాఁచేటి' అను వానిలో నరసున్న యుండుఁగలదని ప్రశ్న. 'మాట' లో నరసున్న లేదనుట తెల్లము. ఇఁక 'కాఁచేటి' లో నరసున్న యుండవలయు. ఏపవిభక్తికటి వర్ణకమునకుఁ బూర్వ మర్ధబిందువు గల దనుట శాస్త్రసమ్మతముగాదు. అప్పటున నీ యుదాహరణ వ్యర్థము. కాని 'మాట' సార్ధబిందుకముగా ననంతుఁడు దలఁచినట్టున్నది. చూడుఁడు.

అర్ధబిందు సహితముగ వర్ణమునకుఁ బ్రా
సాది యరయ నిడుద యక్కరంబు
లేఁదు మనకుఁ గల్గినాఁడు లక్ష్మీనాథుఁ
డేఁటి కింక లేఁదు మాఁట లనఁగ. (1—33)

---

దీనికి ముందు పద్యము పూర్ణబిందు పూర్వక సమప్రాసమును దెల్పును. ఇది యర్ధబిందు పూర్వక సమప్రాసమును జెప్పును. దీర్ఘముల మీఁదనే ప్రాసలో నర్ధబిందువుండునని లక్షణము చెప్పుచు 'లేఁదు - నాఁడు' 'ఏఁటి - మాఁట' అను నుదాహరణలఁ జూపెను. దీనింబట్టి యనంతుని 'మాఁటలో' నర్ధబిందు వున్నదని యూహింపనగును.—

## ఉభయప్రాస—(౭౩—౭౬)

రేఫలకార సంయుక్తములగు తకారములకు దత్సంయుక్తలేని కేవల తకారములు ప్రాసమైత్రి నందును.

ఉదా. పాఁతి ... వాంత్రిల
వాంత్ర ... కంత్రి
పంతు ... ఇంత్లకు
ప్లంత ... పంత్లు

దీనికే యప్పకవి సంయుతా సంయుత ప్రాసమని పేర్కొనిరి. అతఁడు దకారమునకు మాత్రమే కాక యన్ని హల్లులకీ ప్రాసమైత్రి యంగీకరించెను. అప్పకవి చెప్పిన సంయుతాసంయుత ప్రాసలో ననంతుని త్రిప్రాస, ఉభయ ప్రాస యిమిడిపోవును. అనంతుఁడు రెండు వేర్వేరుగాఁ జెప్పుట యనవసరము. ఉభయప్రాసకనంతుఁడు చూపిన యుదాహృతులకుఁ బూర్వక విలక్ష్యము లున్నట్లు లేదు. 'కాఁడి - వాండ్రు' అర్థబిందు పూర్ణబిందులకుఁ ప్రాసమైత్రి చెల్లునట్లనంతుఁడు గాని మరి యే యితర లాక్షణికుడుగాని చెప్పలేదుగదా! 'కుందు—ఇండ్ల' వంటిప్రాసమైత్రి కారణము ప్రామాణిక ప్రయోగ మెందున్నదో! అప్పకవియు ననంతుని లక్ష్యమువంటి దొకటి స్వయముగా రచించి యుదహరించెను.

ఇవ్విషయమిట్లుండ ననంతుఁడు 'వాండ్ల లేఁజాఁపు మోములఁ దీండ్రమార' (54) ననుప్రాసమైత్రి పొరపాటని విమర్శించెను. "ండ్ల—ండ, ండ్ర—ండ," ప్రాసచెల్లు చుండ ండ్ల - ండ్ర' కు చెల్లరాదో!

'వాండ్లలేఁజాఁపు' లనుచో వాండ్ల' శబ్దరూపము లక్షణవంతమా యని ప్రశ్న.

## సంధిగతప్రాస

వాఁడుదపోనిధి:—

ప్రథమాంతవిభక్తులపైని కచటతపలు గసడదవలగు ననులక్షణమునకీ క్రింది లక్ష్యము నొసంగెననంతుఁడు.

సీ. వాఁడు గమవాఁడు సోమ వాఁడు దెక్క-
టాఁడు <u>వాఁడు దపోనిధి వాఁడు</u> పెద్ద...' (62)

'వాఁడు + తపోనిధి' అనుచోటఁ బొలుఁగుమీఁది సాంస్కృతిక తకారమునకు డకారాదేశము రానేరదు. సవికృతి శబ్దాశ్రితత స్సాంస్కృతి

# ప్రాసభేదముల పట్టిక

| ఛందోదర్పణము | అప్పకవీయము | విశేషములు |
|---|---|---|
| 1. సమప్రాస | 1 అర్ధబిందు సమప్రాస<br>2 పూర్ణబిందుసమప్రాస<br>4 సంయుక్తాక్షరప్రాస | సమప్రాసమునే మూఁడు భేదములుగాఁ జెప్పెఁ నప్పకవి |
| 2. ప్రాసమైత్రి | 11 ప్రాసమైత్రి<br>16 అభేదప్రాస | ఈ రెండు భేదములు ప్రాసమైత్రిలోనే యనంతుఁడు చెప్పెను. |
| 3. ఋప్రాస | 14 ఋప్రాస | |
| 4. త్రిప్రాస | ... | ఇది యప్పకవి మతమున సంయుతాసంయుతప్రాసలో నిమిడియున్నది. |
| 5. ప్రాదిప్రాస | 9 ఉభయప్రాస | |
| 6. సమలఘుప్రాస | 7 లఘుద్విత్వప్రాస | |
| 7. వికల్పప్రాస | 8 వికల్పప్రాస | |
| 8. బిందుప్రాస | ... | అప్పకవి చెప్పిన సంధిగతప్రాసలో నంతర్గతమగును. |
| 9 అర్ధబిందుప్రాస | 8 ఖండాఖండప్రాస | |
| 10. ఉభయప్రాస | 5 సంయుతాసంయుతప్రాస | |
| 11. సంయుతప్రాస | .. | అప్పకవి యిది యనవసరమని చెప్పలేదు కాఁబోలు. |
| 12. సంధిగతప్రాస | 17 సంధిగతప్రాస<br>6 రేఫయుతప్రాస<br>10 అనునాసికప్రాస<br>12 ప్రాసవైరము<br>18 స్వవర్గజప్రాస<br>15 లఘుయకారప్రాస | అనంతుఁడు రేఫయుతయతి చెప్పెం. అప్పకవి యీయతి చెప్పలేదు, ఈ ప్రాసభేదములు చెప్పె |

దగును. మఱియు ఛందోదర్పణములోని 88-వ పద్యమును బరిశీలించిన నియ్యది రివర్ణ విషయకమే యని తెల్లమగును.

## ౠ కారయతి

ఋకారమునకు రి' వర్ణము చెల్లునట్లు, ౠకారమునకు 'రీ-ఱీ' వర్ణములు చెల్లునని యనంతుని మతము.

ఉదా॥ క్షత్రిలేదు కారి గుణాఢ్య + ౠవనంగ

ఋకారమునకు ఇ ఈ ఎ ఏ లు చెల్లుబడియగునట్లు, ౠకారమునకు ఇకారాదులు చెల్లవని యనంతుఁడు నిర్దేశించెను. ఋ ౠ వర్ణములకు సావర్ణ్యము కలదుగదా! అట్టుండ నేల చెల్లరాదు! ఇంతకు ననంతుని లక్షణమునకుఁ బ్రాచీన ప్రయోగము మృగ్యము.

ఈ క్రింది ప్రయోగములు గమనార్హములు:—

భారతము - ఆదిపర్వము—

సీ. వినవయ్య కృతవీర్యుఁడను జనపతి...
అతని వంశమున వార్త ధన లుబ్ధులై
కృతవీర్య ధనమెల్లఁ + గ్షత్రియేసి (7 - 133)

శ్రీనాథుని కాశీఖండము—

సీ. ఘృతపయోరాశి సం+క్షప్తావధికమైన
చంచత్కుశద్వీప జగతిఁ జేరి (5 - 281)

చంద్రరామాయణము—

క్షత్ర పట్టాభిషేకమం+గీకరించి (8 - 165)

ఎఱ్ఱన హరివంశము—

కేవల భోగయోగ్యము + క్షితి (ఉత్తర -4-814)

ఈపై ప్రయోగములంబట్టి ఇ ఈ ఋ ౠ ఎ ఏ లం గూడిన క ఖ గ ఘ లు క్ష' వర్ణముతో యతిమైత్రి నందునని యేర్పడుచున్నది. దీనిఁ జెల్ల నప్పకవ్యాదు లెవ్వరు పరిశీలించినట్లు గానరాదు.

---

*(చూ వ్యాసము - ౠకారయతి-ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక- 43 సంపుటము - 4 సంచిక)

## ప్రాదియతి

'పరాభవములం జొరక తెలుఁగుబాసను పొందుగా' (92ప) - అని యుపసర్గలగు ప్రాదుల యిర్వదింటిలో పరా, అప్, అపి' అను మూఁటికి నిషేధము సూచించినాఁడు ఇందుఁ దెలుఁగుబాస యనఁగాఁ దత్సమాంధ్ర భాషయనియే యర్థము గ్రహింపవలయు. అచ్చతెనుఁగునఁ బ్రాదులకుఁ బ్రవేశము లేదు గదా! కవిజనాశ్రయమున 'ఉపసర్గవింశతికి వళ్లు దెలియమెల్లు' నని చెప్పఁబడినది; దీనికి నిషేధము గానరాదు. భీమనకుఁ దర్వాతి వాఁడును, అనంతునికిఁ బూర్వుఁడగు విన్నకోట పెద్దన అప్యాక్' అను నిరూపణ మప్రసిద్ధమనియో 'పరా' అనునుపసర్గ కభేదయతి లక్ష్యములఁ బ్రదర్శించినాఁడు కూడ.

తిరుల విరసించుచోటఁబ+రేతనాథుఁ
దుర్విరక్షించుచోటఁ బ+రోధభవుఁడు

(కావ్య - చూడామణి 7 ఉల్లా - 49)

అప్పకవి యనంతుని మార్గముచే యనుసరించి ఆంధ్రమునకు 'వేరు పరాభవములు గూడదుగాక' యని చూడామణినైనను సరిగాఁ బరిశీలింపక నుడివినాఁడు. తర్వాతఁ గస్తూరిరంగకవి తన రంగరాట్ఛందమున నుపసర్గవింశతి కభేదయతి ప్రయోగములఁ జూపెను. 'పరా' అను నుపసర్గ కుదాహృతి యింతకు ముందే చూపఁబడినది.

అపి' కి రంగకవి యిచ్చిన లక్ష్యములు—
శయధృతి ఫణివలయ ధవా
ప్యయ విహిత విశుద్ధ సంవి+దాత్మక (స్వరమైత్రి)
జయ విజయ వినుత జన్మా
ప్యయ దూరానంద రూప+భాసుర (వ్యంజనమైత్రి)
అపి+అయము—అప్యయము-(లయము)
అప్—రంగకవి చూపిన లక్ష్యము—
మానితిలక సజ్జన సం
తాన మహీరుహా భవత్సు+ధాలాపము...

'సుధా+ఆకారము' - ఇందు 'అక్' కలదుగాని పై యుపసర్గల పద్ధతిలో లేదు. ప్రాదులమీఁద స్వరము లభించినపుడే ప్రాదియతి చెల్లును. పై లక్ష్యమున అక్' పై స్వరము సంధింపలేదు. సుధాశబ్దమునకు అక్' పరమైనది. ఇది ప్రాదియతి లక్షణ లక్షితముగాఁజాలదు. 'భానుసహస్రభాసి వృష+భాధిపుఁ' డను నఖండయతిం బొలిపెది. ఇట్టి యతిని నుపసర్గసంధి యతిగాఁ జేర్చుకొని యప్పకవి నిత్యసమాస విశ్రాంతులలోఁ గలిపివేసెను (చూ. అప్ప-3-134 అక్ నకు ప్రాదియతి విధానము పరిపడదు అక్' లో ఉకారము లోపించుటయే యిందులకుఁ గారణము. సమ్+అంచిత—సమంచిత' అనురీతి 'అక్ + ఉదక - అకుందక' కాదు, ఓదక' మనియగును. సంహితయందు హల్లు నిలువదు.

దీనింబట్టి యొక్క అక్' అను నుపసర్గను ప్రాదియతిలో నిషేధించుట సమీచీనమగునని యరయునది.

## ప్రభునామాంత విరమణము

ఒరుల నన్నమ్మయనుచోట నూఁదఁబడక
ద్వివిధమగుఁ బ్రభునామాంత విరమణంబు
మహి వసూధ్యక్ష రాజారా+మనయనంగ
అతని పట్టపుదేవి సీ+తమయనంగ (119)

రాముని సీతమ - అనురీతి నూఁదఁబడకయున్న చోట్లయందు మాత్రమే యుభయ యతి చెప్పఁబడినది. కాని యూఁదఁబడినను (ద్విత్వ యుక్తమయ్యును) నీ యుభయయతి చెల్లు ప్రయోగములు గలవు. అప్పకవి రెంటి కుభయయతి చెప్పినాఁడు (చూ-కామాఖండ విక్రమములు)

## యుక్తవికల్పయతి

పలి కకారహల్లిక రామనామికాఖ్యఁ
గదిసి తత్పంచమముగా వికల్పవిరతి
గలుగుఁ జక్రి పల్లవముద్ర+క్షముఁడనంగఁ
గమలనేత్రుండు సకల ది+క్షహితుఁ డనఁగ (124)

కకారమునకు ననునాసికము పరమగు స్థలమందు వికల్పయతిని చెప్పి నాఁడనంతుఁడు. 'దిక్ + మహిత - దిఙ్మహిత' ఇచ్చోటఁ గకారము లోపించి యున్నదిగాఁక గకారమునకు యతి పాటింపవచ్చు దిగ్మహిత, దిఙ్మహిత, అని రెండు రూపములుండును. ఈ సంధి వికల్పముగాన నీ యతికి పేరు పెట్టఁ బడినది ఈయతి కకారమున కొక్కదానికే యేల చెప్పెనో! కచటతపలన్నింటి కనునాసికము పరమగునేని ద్విత్వంచమాక్షరము లాదేశమగును సత్ + ముని - సన్ముని సద్ముని. వర్గహల్లు లన్నింటికి యతి చెప్పుట సమంజసము. ఈయనంతుఁడే వికల్పప్రాసలో వర్గహల్లు లన్నింటిఁ జెప్పినాఁడు. చూ.

అనునాసిక లౌ వర్గ హల్లులకు ద్వి
తీయములు వికల్ప ప్రాసమై యొలయు
ప్రాఙ్నగంబుపై రవిదోఁచె నగ్నివోలె
ప్రాఙ్ముఖుండై నుతించె నీవాగ్మియనఁగ (1-50)

వికల్ప ప్రాసయు వికల్పయతియు ననునాసికసంధికి సంబంధించినవి. ప్రాసలో వర్గహల్లులన్ని చెప్పి, యతిలో నొక్క కకారము మాత్రమే గ్రహించుట వింతగా నున్నది

చిత్రకవి పెద్దన యనంతు ననుసరించిన వాఁడయ్యును నీసందర్భమున బహుసూక్ష్మదృష్టితో నిట్లు రచించె—

సంధులను రెండు రూపముల్ జరగు వర్ణ
మున వికల్పాక్షరయతులు దనరుఁ గృతులఁ
దలఁపు రామునైపెనిడినన+స్మితిని యనిన
భంజితాసురసముదాయ యాంజనేయ”

అనంతుఁడు (జగత్ + హిత) జగద్ధితాది (అంతోష్మ) సంధులందలి యతికి వికల్పయతియనియు (దిక్ + మహిత) దిఙ్మహితాది (అనునాసిక) సంధులందలి యతికి యుక్తవికల్పయతియనియు వేర్వేరుగా నామకరణము గావించె, అంతియకాక యుక్తవికల్పమున నొక్క కకారమునకే చెప్పినాఁడు.

రై రెండు యతులను వికల్పసంధికిఁ జెంది యొకవిధానముచే కలిపి గాక రెంటిని కలిపి పెద్దన వికల్పయతిలోఁ జెప్పినాఁడు. సంధులను రెండురూపములన్ జరగు వర్ణమున' ననుటచేఁ బైరెండు సంధులందేకాక యింక నట్టి వేవేని యున్నను నిందులోనే గ్రాహ్య మగునట్లు చేసినాఁడు.

అప్పకవి యతిసంఖ్య పెంచుకుతము గలవాఁడు గాన ననంతునిధోరణి నితఁ డాదరించలేదు కాఁబోలు. వికల్పయతికి నంత్యోష్మసంధి యనియు, యుక్త వికల్పయతికి వికల్పవిరమణ మనియుఁ బేర్లుంచినాఁడు.

## II ద్వితీయాశ్వాసము

## అర్ధసమవృత్త విషమవృత్తములు

అంగళాస్త్రము—

అనంతుఁడు దీనిని స్వస్థానవిషమవృత్త మని చూపినాఁడు.

భూరి భయంబున్ బొందు జగంబిం
పారగ నర్ధం బై యట పామున్
కారి విస్మయజంబు గాంతమై
యూరూఢంబగు నంగళాస్త్రమున్. (122)

ఒక్క ఛందంబున నాలుగింటి పాదముల్ వేరైన స్వస్థాన విషమ మర్యో' అని యనంతుని నిర్వచనము (119). ఒకే ఛందమునఁ బుట్టిన నాలుగు భిన్నవృత్తములు నాలుగు పాదములం దున్న స్వస్థాన విషమ వృత్త మగు నని పై నిర్వచన భావము. పై లక్ష్యమునఁ బూర్వార్ధమున భ-మ-స-గ' గణములు, ఉత్తరార్ధమున మ-న-జ-గ' గణములు లున్నవి. నాల్గు పాదముల భిన్నవృత్తములు లేవు. పై లక్ష్యపద్యము స్వస్థానార్ధ సమవృత్త లక్షణ ప్రకార మున్నది. అనంతుఁ డెట్లు విషమవృత్త మని పేర్కొన్నాఁడో దురూ

స్వ్యయముగా నున్నది. అప్పకవి యంగశాస్త్రమునను నాల్గుచరణములందుఁ గ్రమముగా - 'భనజగలు, మసజగలు, మసయగలు, రజరగలు" అను గణములుండునని చెప్పెను. (4-209)

ఇంక నిట్టివి కొన్ని యీ ఛందమునఁ బరిశీలింపవలసినవి గలవు. మఱియొక్క పద్యమును జూపి యీ ప్రకరణము ముగించెద.

వీణారచనము - ఇది సర్వపరస్థాన విషమవృత్తము. (127)

భిన్నచ్ఛందములకుఁ జేరిన వృత్తములలో నాల్గుపాదములు నాల్గు విధములుగ సర్వము విపరీతముగా నుండు వృత్తభేదము సర్వపరస్థానవిషమవృత్త మనఁబడును.

ఈ వీణారచనలోని గణముల విషయమున ఛందములందుఁ బరస్పర భేదము గానఁబడుచున్నది.

| అనంతుని మతము. | విన్నకోట పెద్దన. |
| --- | --- |
| 1. త - య - స - స - గ | త - య - స - స - గ |
| 2. త - జ - స - భ - గగ | త - స - స - స - గగ |
| 3. త - జ - స - భ - స | త - జ - స - భ - స |
| 4. భ - న - న - భ - స | భ - న - న - జ - ర |

| అప్పకవి — | చిత్రకవి పెద్దన — |
| --- | --- |
| త - య - స - స - గ | త - య - స - స - గ |
| త - జ - స - భ - గగ | త - జ - స - భ - గగ |
| త - జ - స - భ - స | త - జ - స - భ - స |
| భ - న - న - జ - న - గ | భ - న - న - జ - న - గ |

అన్నిష్టసఖ (భారతము ఆది. 3ఆ. 140), గళద్రక్తార్ద్రసర్వాంగు నిష్ఠురభూతాప్రతిమ ప్రగల్భ పరివాదాంతర్హితోద్వేగ్రమున్ (భా. శాంతి వంశము 6-226), సర్వమున్నతనిదివ్యశరీరమయమంచు (భాగవతము 6-142), వరదుఁడు పార్థు కార్యవిభవంబున కాతని ధైర్యశక్తి మెచ్చుదుగ (భారత - అరణ్య - 1)

విసర్గకు లోపము—

గీ. లోలిఁ బురుషసింహో యని యుగ్గడించు
చోటఁ దా సింహ ఇవ పురుషోయనంగ (104)

పరుశ్నల్ల విసర్గస్యలోప ఏతస్యచేచ్ఛతే' యని యధర్వణకారిక. ఈ సూత్రము లాంటిచో సహితము గానంబడియెడి అందులకు లై (పురుష సింహః + అని) పురుషసింహోయని యతి - ప్రయోగము లక్ష్యము

## భాషాభేదములు

గీ. సంస్కృతము తెనుఁగైనఁ దత్సమ పదంబు
దానఁబుట్టి తెనుంగైనఁ దద్భవంబు
దేశి తెనుఁగు దేశజ మచ్చ తెనుఁగు తెనుఁగు
నిర్మలుఁడు పిరి యొందయుఁడు నిక్క మనఁగ. (105)

'తజ్జా సమాచ దేశ్యా గ్రామ్యాచేయం చతుర్విధా భవతి' అని చింతామణి. గ్రామ్యము భాషాభేదము కావక్కఱలేదు గాన నసంతుఁడు గ్రహింపలేదు.

'తత్సమంబు నాఁగఁ దద్భవం బన నచ్చ
తెనుఁగు నాఁగ మఱియు దేశ్య మనఁగ
గ్రామ్యభాష నాఁగఁ గల వైదు తెలుఁగులు" అని కేతన విభజించె.

స్తై దేశితెనుఁగునే కొం దన్యదేశ్య మందురు; అచ్చతెనుఁగును దేశ్య మందురు.

## పంచాశద్వర్ణములు

క. భూమిఁ బదాఱచ్చులగాఁ, గామించి అకారమాదిగా స్వరములగున్
కాఁ మొదలు క్షకారము తుదయై ముప్పదినాల్గుహల్లులగు వ్యంజనముల్.

క. కలలను భేదము లేదను వలనున ళాఁ దొలఁగి యైదుపదులగు వర్ణం
ములు సంస్కృతభాషకు ... (123, 127)

అనంతుఁడు హల్లులలో ళకారమును విడిచి క్షకారమును గ్రహించెను. ఈ మతము నప్పకవి యీక్రింది రీతి ఖండించినాఁడు—

"కాకుషాబద్ధమైన క్షకార మనఁగఁ
దలఁప కేఁబది లిపులలో దానిఁ గూర్చి
తొలఁగ భిన్నాక్షరంబైన దొడ్డ ళాను
విడిచిపెట్టె ననంతుండు వెఱ్ఱిగాఁడొ".

## అనంతుని యితర రచనలలోని ఛందోవిశేషములు

అనంతుఁడు తన ఛందస్సులోఁ జెప్పని లక్షణములు గొన్ని యాతని యితర కృతులగు భోజరాజీయ రసాభరణములందుఁ గానవచ్చెడు. అందుఁ గొన్ని యీక్రిందఁ జూపెద.

## అర్ధబిందుప్రాస

పటులకుమాత్రమే సార్ధబిందుక నిర్బిందుకప్రాస చెప్పను గాని యీక్రింది పద్యమున నట్టి ప్రాస రకారమునకుఁ బ్రయుక్తము.

అప్పకవియే యట్టి ప్రమాదమునకు లోనైనాఁడు-

క్రౌంచపదీ వృత్తమ్మునఁ జెప్పె+రఁగఁ బలుకుదురిలఁ
+ గవి వరులెల్లన్

'ప్రమాదో ధీమతామపి' కదా !

అనంతునిదే మఱొక పద్యపాదము-

'నాగకులజులు+నముచి సూదనుల్పూజ+నతఁడు దాఁనైనొప్పు
+ నందగోపాత్మజాఁడు (జయభద్రరగడ-3-57)

నాకశబ్దముభయయతిలోఁ జేసినదిగాన నిందుఁ దొలంత హల్లునకుఁ దర్వాత స్వరమునకు యతిగూర్పఁబడినదని యూహింపనగును.

## అఖండయతి

ప్రాదినిత్య సమాసాద్యుభయ యతులందుఁ జేరని స్వరసంధి ఘటిత శబ్దములందు సంధ్యక్షరమునకు హల్లుతో యతిమైత్రి పాటించుట యఖండ యతి యందురు. కవిజనాశ్రయమం దఖండయతి చెప్పఁబడినది. అనంతుఁడీ యతిభేదమును జెప్పకలేదు గాని యాతని పద్యములలో నఖండవళ్లు చూపట్టుచున్నవి.

ఆశోదంచితు ఫుత్రము త్రి ఫలదుర్+గీర్వాణ నిర్వాణకున్
(భోజ-6-213)

జ్ఞానమునకు యోగ్యముగుట+నమభావంబై (రసా-2-9 వృ)

అఖండవళ్లు భారతాది గ్రంథములందును గనవచ్చుచున్నవి. కొందఱు పాతములను స్వమతానుకూలముగఁ దర్వాతమార్చివైచిరి. అప్పకవి యొక్కఁడు తప్పఁ దక్కంగల లాక్షణికులెల్ల రఖండయతి నంగీకరించిన వారే యని పరిశీలనవలనఁ దెలియుచున్నది.

## మఱికొన్ని విషయములు.

నాయీ పరీక్షలోఁ బూర్వపీఠికా కర్తలు వ్రాసినకతిపయాంశము లటనట ఖండింపఁబడినవి. ఇందు మఱికొన్ని ముఖ్యములయిన వానిం బరామర్శించెద.

(1) అనంతుఁడు కవిజనాశ్రయమును ఎరిగి ఉన్నట్టు కనబడదు' అని శ్రీసీతాపతిగారు వ్రాసిరి (చూ-ఉపోద్ఘాతము.)

ఈ యభిప్రాయము సరిగాదు. కవిజనాశ్రయము పోలిక లిందంతటను గానవగు. (చూ - నావ్యాసము - అనంతుని ప్రశస్తి - ఆంధ్రసాహిత్య పరిషత్ - పత్రిక 3౮ సం-౧-3 సంచికలు.)

(2) ప్రథమాంత విభక్తులపై' అను పద్యమును ముద్దరాజురామన్న 'రాఘవపాండవీయాదర్శము'లో నుదాహరించినాడు అని యుపోద్ఘాతములో నున్నది (4 పుట) ముద్దరాజురామన్న వ్రాసినది కవిజన సంజీవని, రాఘవపాండవీయాదర్శ వ్యాఖ్యరచించిన దీతఁడుగాఁడు. ఇతని యన్నయగు ముద్దరాజు పెదరామన్న దానికిఁగర్త. (చూ. ఆదర్శ వ్యాఖ్యాంత గద్యము.)

(8) రేఫయుత యతి- ఈ యతిభేదము అనంతు డెందుకు చెప్పినాడో తెలియదు ..ఇది యొక యతిభేదముగా చెప్పియుండదని నాయభిప్రాయము' అని సీతాపతిగారు వ్రాసిరి (చూ ఉపో-16 పుట) మీఁదు మిక్కిలి వారు రేఫయుతయతిని దీసివైచి భిన్నయతి లక్షణముక్రిందఁ జెప్పఁబడిన

అట ఇకారాంత పదము మీఁదటి దికార

మని యనంగ నర్వల భిన్నయతికిఁ జెల్లు' (1-122)

అను పద్యమును ప్రత్యేక యతిని జెప్పునదిగా భావించి దాని దియతి' యను పేరిడి యతుల పట్టికలో 24 యతుల నరిపుచ్చిరి అనంతుఁడు భిన్నయతి యని పేర్కొనుచుండఁగా దియతి' యను నూతన సృష్టియేలొకో!

తెలుఁగున ఋత్వముండదనియు ప్రుచ్చిమి ప్రుక్క, ప్రుష్టి మున్నగు శబ్దములలో నున్నవి రేఫలేకాని వట్రసుడులు గావనియు, నిట్టి వానికి యతి స్థలములందు రేఫమైత్రి కూర్పవలయుననియు నిర్దేశించుటచే యనంతుఁ డీ రేఫయుతయతిని చెప్పియున్నాఁడు. అప్పకవియు నిట్టి తలంపుతోడనే రేఫయుత యతి చెప్పకున్నను రేఫయుత ప్రాసము జెప్పినాఁడు. ప్రారార్ధచంద్రాస్త్ర+కృత్తోరుబాహులై' (భాస్కర - యుద్ధ 1448) వంటి రేఫ ఋకార యతిమైత్రి గల ప్రయోగములు ప్రమాద పతితములు గలవు ఇట్టి వానిని వారించుటకే యీ యతిభేదము చెప్పఁబడియె నని యరయునది 24 యతులలో 'రియతి' యను భేదము లేదు. రేఫయుతయతి యన్న దొక యతి భేదము.

ఈ ఛందోదర్పణమున సమీక్షింపవలసిన విషయము లింకను పెక్కులు గలవు. దీనింగూర్చిన విపులసమీక్షను ఆంధ్రసాహిత్య పరిషత్పత్రికలోని వ్యాసములఁ దిలకింపఁగోరెద. ఈ క్రొత్తకూర్పులో నీగ్రంథము పైవెలువడిన శ్రీవద్దమూడి గోపాలకృష్ణయ్య ప్రభృతుల విమర్శలందలి విషయములు సవరణలు గొన్ని యుక్తములని తోఁచినయవి గ్రహింపఁబడినవి.

తృతీయ ముద్రణార్థము గ్రంథ మామూలాగ్రము పరిష్కరించి యీయఁగోరినందులకును దదనుగుణముగ సమీక్షను బ్రకటింప సమ్మతించినందులకును మా మిత్రులు శ్రీ చంద్రమౌళిశాస్త్రులవారికిఁ గృతజ్ఞుఁడ.

మదరాసు<br>20-2-1959 } ఇట్లు<br>విద్వాన్ రావూరి దొరసామిశర్మ, బీ.ఓ.ఎల్.

# కృ త జ్ఞ త

అనంతుని ఛందము ద్వితీయ ముద్రణమునందుఁ గల తప్పులను (అచ్చు తప్పులుగాని పరిశీలనా భావజనితంబులుగాని) తమకుఁ గనిపించినవి శ్రీ భట్టాచార్యులవారు ప్రకాశకుల కోర్కె మేరకు వ్రాసి పంపిరి. ఈ ఛందము తృతీయ ముద్రణార్థ మిటీవలఁ బరిష్కరించియుంటిని గాన భట్టాచార్యుల సవరణల ప్రతి ప్రకాశకులు నాకుఁ బంపిరి. సంప్రతించిచూడ వారు చూపిన 108 సవరణలలో సుమారు 75 కి నింతకుముందే సవరించిపెట్టియున్నాను. ఇఁక మిగిలినవానిలో యుక్తములు నవశ్యములు నని తోఁచినవానిని గ్రహించి యిందుఁ జేర్చితి. ఆ గ్రహించిన సవరణల పాఠాపుటల యథాస్థానికలోఁ జూచి యవి భట్టాచార్యుల వని తెలియుటకై వాని ప్రక్కఁ గుండలీకరణము లలో 'భ' అని నిర్దేశించితి. సవరణలఁ బంపినందులకు వారికి ప్రకాశకులు కృతజ్ఞులు.

పరిష్కర్త
4—11—58

# వైదికగ్రంథములు



| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| అమావాస్యాతర్పణము ... | 0 | 2 |
| ఆపస్తంబగృహ్యసూత్రములు ... | 0 | 4 |
| ఆంధ్రద్రావిడసంధ్యావందనము . | 0 | 4 |
| ఋగ్వేదదేవతార్చన బ్రహ్మయజ్ఞము, సస్వరము ... | 0 | 4 |
| ఋగ్వేదపూర్వప్రయోగాదర్శము .. | 3 | 0 |
| ఋగ్వేదశ్రాద్ధప్రయోగము, చిన్నసైజు ... | 0 | 8 |
| ఋగ్వేదసంధ్యావందనము, సటీక ... | 0 | 4 |
| తిథిమంత్రములు, (ఆరాధ్యులది) ... | 0 | 4 |
| పంచోపనిషత్తులు, తైత్తిరీయము, సస్వరము .. | 1 | 4 |
| దేవతార్చన, చిన్నసైజు ... | 0 | 2 |
| పంచసూక్తములు, సస్వరము ... | 0 | 8 |
| పంచోపనిషత్తులు, బ్రహ్మమేధసహితము ... | 0 | 6 |
| పితృతర్పణము, చిన్నసైజు ... | 0 | 2 |
| బ్రహ్మయజ్ఞము, సస్వరము ... | 0 | 8 |
| మహాన్యాసము, సస్వరము, చిన్నసైజు ... | 1 | 0 |
| మంత్రప్రశ్నములు సస్వరము (ఏకాగ్నికాండ) ... | 0 | 6 |
| తైత్తిరీయ ఆరణ్యకోపనిషత్తులు, పితృమేధము, మంత్రప్రశ్నములు సహా, సస్వరము ... | 8 | 0 |
| మంత్రపుష్పము, సటీక ... | 0 | 2 |
| యజుర్వేదసంధ్యావందనభాష్యము ... | 1 | 4 |
| యాజుషపూర్వప్రయోగచంద్రిక, సస్వరము ... | 5 | 0 |
| యజుర్వేదసంధ్యావందనము, మూలము, సస్వరము ... | 0 | 8 |

| | | రూ. | ప్రతి 1-కి అ. |
|---|---|---|---|
| డిటో పురుషసూక్తము, శ్రీసూక్తము ఆంధ్రటీకాతాత్పర్యము | | 0 | 8 |
| డిటో ఆర్షికమంత్రములు | ... | 1 | 0 |
| శ్రీవైష్ణవాహ్నికము చిన్నసైజు | ... | 0 | 8 |
| శ్రీవైష్ణవశ్రాద్ధప్రయోగము | ... | 0 | 8 |
| సూర్యనమస్కారము, చిన్నసైజు | .. | 0 | 2 |
| రుద్రము—నమకము, చమకము, సస్వరము చిన్నసైజు | .. | 0 | 3 |
| రుద్రాధ్యాయము, సటీక | ... | 2 | 8 |

## జ్యోతిష గ్రంథములు

| | | | |
|---|---|---|---|
| అఱువది (గత) సంవత్సరముల పంచాంగము (1867-1926) | | అచ్చు | |
| అష్టకవర్గ సాంధ్రతాత్పర్యము | ... | 0 | 8 |
| ఆరూఢరత్నసిద్ధాంతము | ... | 0 | 12 |
| కాలామృతము - ఆంధ్రటీకాతాత్పర్యసహితము | ... | 3 | 0 |
| కృష్ణవాస్తుశాస్త్రము, అను వాస్తుసారసంగ్రహము | ... | 1 | 0 |
| కేరళప్రశ్నము సాంధ్రతాత్పర్యము | ... | 0 | 4 |
| గౌళిశాస్త్రము, తెలుఁగువచనము | ... | 0 | 4 |
| ఛప్పన్నము ప్రశ్నశాస్త్రము, తాత్పర్యసహితము | .. | 0 | 8 |
| జలార్గళశాస్త్రము, ఆంధ్రటీకాసహితము | ... | 0 | 8 |
| జాతకచంద్రిక గోపాలరత్నాకరము | ... | 1 | 0 |
| జ్యోతిషార్ణవనవనీతము | | 2 | 8 |
| నక్షత్రచూడామణి, సంస్కృతము | ... | 0 | 8 |

ఇంకను అనేక సంస్కృతాంధ్రగ్రంథములు, నిఘంటువులు, నాగరలిపి గ్రంథములు మావద్ద దొరకును

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్
పోస్టుబాక్సు, 1372    292, ఎస్ప్లనేడ్, మద్రాసు. 1.



శ్రీరస్తు.

# ఛందోదర్పణము

## ప్రథమాశ్వాసము.

---

ఇష్టదేవతాస్తుతి.



శ్రీరామాస్తనమండలీమిళితకా
శ్మీరార్ద్రశ్రీవత్సంబుతోఁ
క్షీరావారతరంగసంగతలస
త్పర్యంకనాగంబుపైఁ
గారుణ్యామృత పూరపూరితకటా
క్ష శ్రీలఁ జెంపొందుగం
భీరస్వాంతుఁ డనంతుఁ డాశ్రితజనా
భీష్టప్రదుం డయ్యెడున్. 1

చ. అతనిదశావతార విభవాతిశయంబున లోకమెల్ల శా
శ్వత మగుచాడ్పునన్ భజన సమ్యగుత్తరల్ల దశాక్షరాభిశో
భితమగువాక్ప్రపంచ మది పెద్దయుఁ బ్రస్తుతి నొందునట్టిచో
నతఁడును సప్తకాక్షర చయంబు జయంబునొసంగుఁగావుతన్.

---

1. ప్రదుండెల్లెడన్-ప్రా. ము. 2. తరంగ-ప్రా. ము. దశాక్షరాభిశోభిత ము దాని కీపాఠమనుగుణముగాదు (భ).

క. శ్రీవల్లభయుతిగణసం
సేవితపాదారవిందుఁ జింతితఫలదున్
భావజగురునలఘుచ్ఛం
దోవినుతు ననంతశయనుఁ దోయజనాభున్. 3

క. ఛందోరీతిగవిమల
చ్ఛందుఁ డనంతుం డొగిం బ్రశంసించి కృపా
మందిరులగు శ్రీమద్గో
విందగురుప్రభులదయఁ బ్రవీణుండగుచున్. 4

ఛందఃప్రాశస్త్యము.

క. విద్యలలోపల నుత్తమ
విద్య కవిత్వంబు మఱి కవిత్వముఛందో
వేద్యము గావునఁ జెప్పెను
హృద్యంబుగఁ గవితచంద మేర్పడఁగృష్ణా! 5



# సంజ్ఞాప్రకరణము.

గద్యపద్యలక్షణము.

ఆ. వె. పరఁగుఁగవితగద్యఁపద్యంబు లనఁ, బాద
కల్పనంబువలదు గద్యమునకు
పాదనియతినొప్పుఁ బద్యంబు, లవియు వృ
త్తములుజాతు లనఁగ నమరుఁగృష్ణ. 6

### గురులఘునిర్ణయము.

క. వృత్తంబులుగణబద్ధము
లుత్తమమగుజాతులెల్ల నొనరఁగ మాత్రా
యత్తంబులు లఘువగుఁ బురు
షోత్తమ యొకమాత్ర గురువు నొదవు ద్విమాత్రన్. 7

క. వివిధముగఁ జాఁపిపలికెడు
నవియును మఱియూఁదిపలుకునవియును గురువుల్
భువి నిలిపిపలుకువర్ణము
లవియెల్లను లఘువులయ్యె నంబుధిశయనా! 8

క. గురు వఱుగు నూర్ధ్వపుండ్రము
ధరియించినరీతి, లఘువు దనరును హరియొ
క్కరుఁడ పరతత్త్వ మనుచును
సురుచిరముగఁ జుట్టివ్రేలఁ జూపినమాడ్కిన్. 9

క. గోవిందప్రభుఁ డనిన
గోవిదు లవి మూఁడుమూఁడు గురులఘువులుగా
భావింతురు గురులఘువులు
మోవఁగ మూఁడేసి నిక్కముగ గణములగున్. 10

### గణాష్టక లక్షణము.

క. భజనసమయరతగణములు
భజనసమయరతములై సభక్తికమతిఁ బం
కజనాభు నహర్నిశమును
భజించుదిక్పాలగణవిభాతిఁ దనర్చున్. 11

గీ. గురులఘువు లోలి మూఁడేసి కూడిన మన,
లాదిమధ్యావసానంబులందు గురువు
లొందు భజసలు, లఘువు లట్లొంద యరత,
లనఁగ నయ్యష్టగణము లొప్పును ముకుంద! 12

క. చను మగణము శ్రీనాథా
యనిన, ముకుందాయనంగ యగణము, రగణం
బన నొప్పు మాధవాయన,
నొనఁగ వైకుంఠ యనఁగ నొగిఁ దగణమగున్. 13

క. భగణమగు విష్ణుఁ డనఁగా,
నగణితముగ జగణ మగు మురారి యనంగా,
నగణము విభుఁ డనిపలికిన,
సగణము వరదాయనంగ సత్కృతులందున్. 14

క. గురువును లఘువును లఘువును
గురువును హావ లగును, గలలు గురులఘుసంజ్ఞల్,
వరుసను గగ లలగణముల
కరయఁగ వర్ణములు ద్విగుణమై యొప్పు హరీ! 15

క. శౌరియనిన హగణంబగుఁ,
శౌరి హరియనఁగ నుల్లసిల్లును వగణం,
రావయఁ గృష్ణా యనినను
ధారుణి గగ మండ్రు, లలము దాహరి యనినన్. 16

సీ. కమలనాథా నగగంబు, కమఠరూప
నహా, మసురాంతకాఁగస లల,

మద్రిధరభలంబు, భద్రయశా యన్న
భగురు, వంభోజాక్ష మగణలఘువు,
భువనేశ్వరా యన్న సవ, మఘువిద్వేషి
సహము, పీతాంబరసంజ్ఞ తలము,
కైటభారి రలంబు. గజవరదా యన్న
నవ, మహీశయననా నలలమయ్యె,

ఆ.వె రగణగురువు దేవరాజాయనంగఁ బ
ద్మాపతీ యనంగ దగణగురువు,
నరహరీ యనంగ నరహరి నరసింహ
నాఁగ నొప్పు నగము నలము సలము 17

ఇంద్ర చంద్రాది గణభేదములు.

క. ద్విత్రిచతుర్గురుభవముల
ధాత్రీధర రెండు*మడఁపు దక్కనగణముల్
మిత్రేంద్రచంద్రు లనఁజను
మాత్రాదిగణంబు మొదల మాత్ర లిడంగన్. 18

క. గలనగణము లినుఁ, డింద్రుఁడు
నలనగసలభరత, లింక నగగ నహ సలా
భల భగురు మలఘు సవ సహా
తల రల నవ నలల రగురు తగ లిందుఁ డజా! 19

గీ. ఒక్కనెలవున నెనిమిది యొకట నాల్గు
రెండి లఘువెక్కనవి నాల్గు వీనిలోన
నగణపునరుక్తి నొక్కటి డిగియు నాల
దొంతి పదునాల్గు నిరువదితొమ్మిదింట. 20

* నుడుప ; నిలుపు- అని పా.

సంయుక్తవర్ణగణంబులు.

[1]క. జగణము నలమగు గగములు
భగణములగు గలము నగణభావంబుఁగనున్
సగము నగణ వగణములగుఁ
దగణము భలమగును సంయుతముఁదీర్చినచోన్. 21

క. మొగిళులు నలమగు నిటులన్
నగణము సగణమగు నిటు లనంగునితండ్రీ.
తగణము, పాళు లనంగా
భగణమువాకిళ్లు భలము వాకిళులనఁగన్ 22

గణఫలములు.

ఉ. సర్వసుఖప్రదాయి భగణంబు, జకారము రుక్ప్రదంబగున్,
ద్రవ్యముఁ జేయునా,లయకరంబుసకారము,మాశుభంబు,యా
దివ్యసువర్ణకారి, వెతఁదెచ్చును రేఫ, విభూతినిచ్చుఁ దా,
గావ్యములందు నాదినిడఁ గర్తకు భర్తకు నంబుజోదరా!

గణాధిదైవతములు.

చ. భగణము నేలుఁజందురుఁడు, భానుఁడు దాజగణంబు నేలుఁదా
నగణము నేలు నిర్జరగణంబుఁ సమీరణుఁ డేలు నెప్పుడున్
సగణము,నుర్వి యేలుమగణంబునొగి,న్యగణంబుఁదోయమున్,
రగణముఁ బావకుండుఁ, దగణంబు నభంబును నేలుఁ, గేశవా

కృత్యాదివర్జనీయగణములు నక్షరములును.

క. పురశరరసగిరిరుద్రుల
నరయ నశచటతప లిడుట యనుచిత మయ్యె

---

1 పూవస్తువారిప్రతి. ∪ — ∪∪ — ∪ ∪ — ; ∪∪ —
||| ∪ ; ∪∪ — ∪ |

తురములును రసభజంబులుఁ
బరిహరణీయంబు లాదిఁ బంకజనాభా ! 25

క. మొదలను కఖజలు చఛడలు
దధలును భయశతుషసలు[1]తగ దుపవర్ణా
స్పదములు గాకుండిన మే
లొదవించును స్వరములెల్ల నుత్సవకారుల్. 26

క. మొదల సభంబులు రెండును
గదిసిన విభవంబు తభసగణసంగతి యొ
ప్పదు రయముల నధికశుభం
బొదవును భయములను హాని వొందు నృసింహా ! 27

క. ఒనరఁగ శుభవాచకములు
ఘనతరమగు దేవవాచకంబులు నై పే
ర్చినగణములు వర్ణంబులు
ననింద్యములు కృతులమొదల నహిపతిశయనా ! 28

## ప్రాస ప్రకరణము.

క. ప్రాసం బగు రెండవయది,
వాసనగలమొదలి వ్రాయి వడి యనఁబరఁగుఁ,
బ్రాసంబు లన్ని యెడలను
భాసురముగ వదులు పాదపాదముల హరీ ! 29

---

1. తగదుపవర్ణాస్పదములుగా నుండిన (ధ)

2. ద్వి. ము. పాఠము అఖండయతి. పాదిరెయుందు అని పఠించుట యుక్తమని తోఁచెడు. 1 తగవు - అని బహువచన క్రియ యుండుటయు క్తము

క. ఆదిని గురులఘువులలో
నేది నిలిపె నదియె మొదల నిడి పాదము లు
త్పాదింపవలయు సుపజా
త్యాదుల మిశ్రములఁ దక్క నంబుధిశయనా! 30

ఆ.వె. కుటిలకుంతలములు నిటలంబుపైఁ దూల
నోట లేక ధేనువాటమునకు
నదె యశోదపట్టి కదలెఁ బొమ్మనిరఁ బ్రా
సాది తేటపడుఁ బ్రమోద మెసఁగ. 31

ఆ.వె. నందసుతుఁడు నాఁగ సౌందర్యనిధి యన
నమరు బిందుపూర్వకము మొదలను
బతిగమనుఁ డన నధోక్షజుఁ డన సంయు
క్తాక్షరాది చెల్లు నసముగురువు. 32

ఆ.వె. అర్థబిందుసహిత మగువర్ణమునకుఁ బ్రా
సాది యరయ నిడుదయక్కరంబు
నేఁడు మనకుఁ గల్గినాఁడు లక్ష్మీనాథుఁ
డేటి కింక నేఁడు మాట లనఁగ. 33

ఆ.వె. కులుచమీఁదినున్న మఱి తేల వ్రాయఁ బ్రా
సద్వయాది నిట్లు జరగు నచ్యు
తుఁడు సమస్తవల్లభుఁడు నాఁగ నయ్యచ్యు
తుండు సకలవల్లభుండనంగ. 34

మఱియు ద్వాదశవిధప్రాసములు.

క. సమనామప్రాసము ప్రా
సమైత్రి ఋత్రిలును ప్రాది సమలఘువు విక

1 మాటలో నరసున్నయుండవలయునని వైరుధ్యమువలన నూహింప నగును.

ల్పము బిందు వర్ధబింద్వా
ఖ్య ముభయ సంయుక్త సంధిగత సంజ్ఞికముల్. 35

1. సమప్రాసము.—

క. అరసున్నలు నెఱసున్నలు
నొరసినవర్ణములు జడ్డయును [1]దీర్ఘమునుం
బొరసినచోఁ సమవర్ణము
లరసి నిలుపవలయుఁ దోయజాసనజనకా! 36

క. పరువడిఁ బ్రాసములు సమా
క్షరసంశోభితములయినఁ, జాలును మఱి[2]త
త్స్వరవైసాదృశ్యంబులు
పరిహారణీయంబు లందుఁ బంకజనాభా! 37

ఆ.వె. వీఁడె కృష్ణుఁ డల్లవాఁడె ప్రలంబారి
కొండ యెత్తె నితఁ డతండు ద్రవ్వె
నొడ్డగెడవుగాఁగ దొడ్డరా జేలెడి
వీడుఁ నాఁగ బ్రాస మిాఁడువచ్చు 38

గీ. ఆయుపేంద్రుని బొడఁగాంచు టయుపాయ
మనెడు దీర్ఘాదు లచట హ్రస్వాదు లయిన
నయ్యుపేంద్రుని బొడఁగాంచు టయ్యుపాయ
మన సమప్రాస మగు నూఁదఁజనదు రహాల. 39

---

1 ప్రాసములై.

2 తత్స్వరవై సాదృశ్యంబుల బరిహారణీయంబులందు - అనియుండ వలయు, లేనిచో వర్థభంగము (ళ)

2. ప్రాసమైత్రి —

గీ. లళలు రెండును నొండొంటఁ గలసి వచ్చు
నమరు నన్యోన్యమును ఋయుతాయుతములు
బిందుపూర్వమై తమలోనఁ బొందు బములు
ప్రాసమైత్రికి నిది స్వరూపంబు దెలియ. 40

ఆ.వె. నీలవర్ణు గర్భగోళంబు నందు లో
కంబు లెల్ల నుండు నెమ్మితోడ
శ్రీకినొడయఁ డుజ్జ్వలాకృతి యితఁ డన్నఁ
బ్రాసమైత్రి యిట్లు పరఁగుఁ గృష్ణ! 41

గీ. తగ ఋకారాన్వితంబు ద్విత్వంబు గాఁగఁ
బరఁగు నచ్చపుడడతోఁ బ్రాసమైత్రి
యకృపానిధి హరిఁగని మ్రొక్క రనఁగ
సంభృతాశ్రితుఁ డతిశయోజ్జృంభుఁ డనఁగ. 42

3 ఋప్రాసము: —

క. అరయ స్వరగణ మయ్యె ఋ
కారము ఋప్రాస మనఁగఁ గడియును రేఫ
చేరి తనయురముఁ దన్నిన
యాఋషిపాదంబుఁ బిసికె నచ్యుతుఁ డనఁగన్. 43

గీ. తెల్లమిగ ఋకారము యణాదేశవశత
రేఫ యగుటఁ బ్రాసంబయ్యె రేఫ కిట్టు
లిదియె పవర్ణయుత మయ్యెనేని ప్రాస
మైత్రి యగుఁ గాని రేఫసంబంధి గాదు. 44

4. త్రిప్రాసము —

గీ. సంఖ్యఁ బలుకు త్రికారంబుఁ జనుఁ దకార
సదృశమై త్రికారప్రాససంజ్ఞ గలిగి
యా త్రివిక్రముఁ డభయప్రదాత యనఁగ
వాక్త్రిపథగోజ్జ్వలులు విష్ణుభక్తులనఁగ. 45

గీ. ఈత్రికారంబునకుఁ దీయ యొసఁగఁ గ్రింది
రేఫ సంప్రసారణమున ఋత్వ మయి తృ
తీయయగు నీత్రికార మర్థించి చూడ
నాతకారంబునకుఁ ప్రాసమయ్యె నచట. 46

గీ. ఇ ఉ ఋ ౡ ల కచ్చు పరమగునేని సంధి
య వ ర లాదేశ మగునట్టి యవరలలకు
నదరి ఇ ఉ ఋ ౡ లాదేశ మయ్యెనేని
యది కృతుల సంప్రసారణ మంద్రు బుధులు. 47

5. ప్రాదిప్రాసము —

గీ. ప్రాదియై యనశబ్దంబు ప్రాణ మగుటఁ
బరఁగ[2] ణణలకు వేర్వేఱ ప్రాసమయ్యె
క్షోణిధరుఁ డెత్తె నేనుఁగు ప్రాణ మనఁగ
దానవారాతి ప్రేతలప్రాణ మనఁగ. 48

6. సమలఘుప్రాసము —

గీ. ఓలి రేఫతోఁ గూడియు నూఁదఁబడక
తేలి తెలుఁగునఁ దమయట్టి వ్రాలతోన
సమలఘుప్రాస మగు తెక్క లమరఁబట్టి
విద్రిచె నసురఁ గృష్ణుఁడు దిక్కు లద్రువ ననఁగ. 49

1 ఋత్వమగుఁదృతీయ - శ్రీ సం.

2 ణణల కభేద్యము ప్రాసమయ్యె (శ)

7. వికల్పప్రాసము —

గీ. సానునాసికలౌ వర్గహల్లులకుఁ దృ
తీయములు వికల్పప్రాసమై యొలర్చు
ప్రాఙ్నగంబుపై రవిదోఁచె నగ్ని వోలెఁ
బ్రాఙ్ముఖుండై నుతించెనీవాగ్మి యనఁగ. 50

8. బిందుప్రాసము —

గీ. పేర్చి పొల్లునకారంబు బిందు వగుచు
మీఁద నున్న ధకారంబు మీఁదఁ బ్రాస
* బంధమగుఁ గృష్ణుఁ డుదయించినం ధరిత్రి
యంతయును నిరుపద్రవం బయ్యె ననఁగ. 51

9. అర్ధబిందుప్రాసము —

గీ. సార్ధబిందువులై తేలినట్టి పటల
కరయఁ బ్రాసంబు నిర్బిందువైనఁ జెల్లు
వీఁపు మూఁపులు మఱి తలమోఁపు లయ్యె
మాట లేఁటికి మేటి తాఁటేటి కనఁగ. 52

10 ఉభయప్రాసము —

క. చూడఁగ లకార రేఫలు
గూడుడకారంబు చను నకుంఠితగతిఁ దో
డ్తోడన నుభయప్రాసము
జాడఁబడును సంయుతప్రసంగతిఁ గృష్ణా! 53

ఆ.వె. పాఁడి మఱగి బ్రతుకువాం డ్రిల ప్రేఁతలు
వాండ్ర వెన్న లేఁ దండ్రి! యనఁటి

* బంధమగుఁ గృష్ణుఁడుదయించిన ధరిత్రి - అని వ్రా. ము.
లక్షణము ననుసరించి బిందువుగా సవరింపఁబడినది.

పండుకొంటకు వింత యిండ్లకుఁ బోకు కృ
ష్ణుండ నీకుఁ బ్రాతె పండ్లు నిచట. 54

గీ. రలయుతాయుత ప్రాస మార్గముఁ దలంచి
వాండ్ల లేఁ జూపు మోములఁ దీండ్ర మారె
ననుచు రెండును గూర్చిన ననువుఁదప్పు
నం డ్రు నిఖిలార్థవిదు లైన దండికవులు. 55

11. వయుతప్రాసము

ఆ.వె. పాడు నూరు ప్రోలు బహువచనంబులై
పరఁగుచుండు నూఁది పలుకు నపుడు
తేల్చి పలుకునపుడు దీపించు సంయుత
ప్రాస మిరుదెఱఁగులఁ బద్మనాభ! 56

ఆ.వె. పాళ్లు మనుజు లెక్క నూళ్లు గాఁదొడఁగె న
య్యూళ్లు మిగుల బలసెఁ బ్రోళ్లు గాఁగ
[1]భాగ్యవంతుఁ డేలుపాళులు నూళులు
ప్రోళు లయ్యె బ్రాతె కూళులిచట. 57

ఆ.వె. తెలుఁగునందు లేదు లలిఁ గ్రిందిసుడి గ్రుచ్చు
గ్రుమ్మె నాఁగ రేఫకొమ్ము గాని
ప్రాసమైత్రి చేరదు దా సంయుతప్రాస
మగును రేఫయుతము ననుసరించి. 58

క. ఈ క్రిందటి రేఫలుసమ, మైత్రాలుచుఁ దేలిప్రాసమగుసంయుక్తం
బా క్రూరనక్రభయమున, వాక్రువ్వ దెగ జముభక్తవత్సలుననఁగన్.

12. సంధిగతప్రాసము.

క. ధ్రువముగ సంధిజనితరూ
పవిశేష ప్రాస మనఁగఁ బరఁగు పకారం

1. పైపాఠము (ధ) భాగ్యవంతుఁ డేలు పాళ్లనునూళ్లను ప్రోళ్ల
నయ్యెబ్రాతె కూళ్లిచటను - భూ. ము.

బవిరళ వకార మగు న
య్య వదాలవహా లెఱుంగ ననఁగ ముకుందా! 60

వ. అది యె ట్లనిన. 61

క. ప్రథమాంత విభక్తులపైఁ
గథితములగు కచటతపలు గసడదవలగున్
బృథివిని విగజడదబలగుఁ
బ్రథమపు సున్న ¹లగు నాంత పదములమీఁదన్. 62

ఉదాహరణము

గీ. వాఁడు గనువాఁడు సేకొనువాఁడు డెక్కు
లాఁడు వాఁడు దపోనిధి వాఁడు పెద్ద
చిక్కఁ గరి మ్రొక్కఁ జెలి వాక్కుఁ దక్కువెట్టి
కౌరిఁ దలఁచె నిన్ బిలిచె నాసంధు లిట్లు. 63

ఆ.వె. ఆయ చేతసద్వితీయ దానిజరూప
మయ్యు నుండుఁ బ్రథమయట్టు లుండుఁ
²గ్రతువు కాచె దాశరథి కృష్ణుఁ డోకపర్వ
తమును గొడుగుభంగిఁ దాల్చె ననఁగ. 64

గీ. అచ్చుమీఁదచ్చున యకార మాయఁజొందు
కొమ్ము గలహల్లు ప్రథమైనఁగ్రుంకు నచ్చు
గురుఁ డుపేంద్రుండు పెఱచోటఁ గ్రుంకు నొందఁ
జను నకారంబు జనులందు జనులయందు. 65

గీ. ఓలిఁ గర్మధారయషష్ఠు లుత్వములుగ
నచ్చు తుద నుండ టనము లాంధ్ర సంధిఁ

1. నాంత పదములమీఁద సున్నలగునని లక్షముగాన 'నింగిలిచె' అని యుండవలయునని తోఁచెడి. ఇట్టి రూపము సాధువుగాఁ గాఁబట్టదు.

1. గ్రతువుఁగాచె - పూ. ము.
క్రతువుఁగాచె......పర్వతంబు గొడుగుభంగిఁదాల్చె (ర)

గఱుకుటగచరు ల్గట్టి రక్కసపుటుదధి
వితతయశుఁ డైనరాజునానతి ననంగ. 66

గీ. సుఱులురులు పొల్లు లౌను దెనుంగు నందు
హేమ మిది పదార్యాన్నె నఱ్హోము లతఁడు
ప్రబలి హరిఁ గొల్చియున్న వా ర్పరమమునులు
గోటిలో నొప్పు సతికిఁ గన్గొన లనంగ. 67

గీ. ద్విత్వమున కాదివర్ణంబు తెనుఁగునందు
నూఁదకుండును వలసిన నూఁదియుండు,
జానకీవల్లభుఁడు క్షమాశాలి యనఁగ
దశరథాత్మజుఁడు[2] స్వామి ధాత్రి కనఁగ. 68

వ. మఱియు శబ్దాలంకారవిశేషంబులు ప్రాసంబులు నెట్టివనిన. 69

షడ్విధప్రాసములు.

క. అమరఁ గడుదుష్కరము ద్వం
ద్వము త్రి చతుష్ప్రాసములును దగ నంత్యప్రా
సమును ననుప్రాసము ననఁ
గ్రమమున షడ్విధము లయ్యెఁ గంసవిదారీ! 70

1. దుష్కరప్రాసము

క. దోఃకలితమణి కటక యు
రఃకలితరమాభిరామ రంజితసుజనాం
తఃకరణ ఖండితారిశి
రఃకందుక యనఁగ దుష్కరప్రాసమగున్. 71

1 పదార్యాన్నె' - సంయుక్తమున శకటరేఫము రాదని లఘురేఫ
ముగా మార్చునని లాక్షణికులమతము.

2. ఇందు 'దు' గురువగుట చింత్యము.

2. ద్వంద్వప్రాసము —

క. కంజనయన భవభీతివి
భంజన శుకశౌనకాదిబహుమునిచేతో
రంజన ద్వంద్వప్రాస మ
నంజను నిప్పాటఁ బల్కినం గృతు లందున్. 72

3. త్రిప్రాసము —

క. కానవనీతప్రియుఁ డన
దానవనిర్మూలనైకతత్పరుఁ డన స
న్మౌనివినుతుఁ డన నతసుర
ధేను వనం గృతులయందుఁ ద్రిప్రాస మగున్. 73

4. చతుష్ప్రాసము —

క. వారణవరద నిశాటవి
దారణ వీరావతార ధరణీవలయో
ద్ధారణ విరచిత సత్యవ
[1]ధూరణ విజయ యనఁ దగి చతుష్ప్రాస మగున్. 74

5. అంత్యప్రాసము —

క. అగణితవిభవస్ఫూర్తీ!
నిగమాగమసతతవినుత నిర్మల మూర్తీ
జగదభిరక్షణవర్తీ
యగు నంత్యప్రాస మి ట్లుదంచితకీర్తీ! 75

క. మొదలిటిప్రాసమె కానీ
యదియంత్యప్రాస మనఁగ నేదటకానీ
కదియింపవలయుఁ దానీ
పదనెఱిఁగిన బుధుఁడు కృతులఁబరమ జ్ఞానీ. 76

---

1 దూరణ వరజయయనంజతుష్ప్రాస - అని యుండవగు, లేనిచోఁజతుష్ప్రాసమునకుభంగము (ళ)

అనుప్రాసము:—

క. విప్రప్రకరమునిప్రీ
తిప్రద సుప్రభవ యప్రతిమదోఃప్రభవా
విప్రణుత సుప్రసన్నయ
నుప్రాసప్రవణ మిది మనుప్రియచరితా! 77

# యతిప్రకరణము

## యతిసంజ్ఞలు.

క. విరతులు విశ్రాంతులు వళి
విరామములు విశ్రమములు విశ్రామంబుల్
విరమంబులు యతు లనఁగా
విరమణములు నాఁగ వళ్లు వెలయు మురారీ! 78

యతిపంచకము:—

క. స్వరయతులు వర్గయతులును
సరసయతు లప్రకటమైనసంయుక్తయతుల్
పొరిఁ బ్రత్యేకయతులు నన
బరఁగును యతిపంచకంబు పంకజనాభా. 79

యతిపంచకభేదములు —

క. స్వరయతులు ప్రాది కాకు
స్వరనిత్యసమాసయతులు వర్గయతులు ని

ద్ధరఁ బోలికవడి సంయుత
విరతి యనుస్వారయతులు వెలయు ముకుందా! 80

క. ప్రభునామాంతవిరతియన
విభాగవిరమణము భిన్నశ్రమమును గా
స్తుభధర వికల్పయతి యన
నభేదవిరమణ మనంగ నైదు తెఱంగుల్. 81

1 స్వరయతులు:—

ఆ. వె. అగు నకారమునకు నైత్వౌత్వములు వడి
ఇకి ఋత్వమునకు నేత్వ మమరు
నుత్వమునకు నోత్వ మొనరు నీగతి స్వర
యతులు విస్తరిల్లు నబ్జనాభ! 82

క. స్వరములు దీర్ఘము హ్రస్వము
నరయఁగ నొక్కవిధ మెన్న యతులకు సంధ్య
క్షరము లగునచ్చులందు సు
చరితా! హ్రస్వములు లేవు సంస్కృతభాషన్. 83

క. అలఘుచతుస్సంధ్యక్షర
ములలో నైయౌలు దక్క మొదలిటిరెంటన్
దెలుఁగునను హ్రస్వదీర్ఘము
లొలయును నెఏలనంగ నొఓ లనఁగన్. 84

క. క్రియ నైయౌలకు హ్రస్వ
ద్వయము లమరు నాంధ్రభాషితప్రకరములో

నయిననఁ దగు నైదనుచో
జయకీర్తి యవు ననంగఁ జను నా ననుచోన్. 85

2 గూఢస్వరయతి —

గీ. స్వరముతుద నుండి లుప్తవిసర్గకోత్వ
మైనస్వరవిరామంబు దాసోఽహ మనగ
నచ్యుతాశ్రితు లుర్వి నవోఽన్యమిత్రు
లనఁగ నమ్ముకుందుండు యశోఽర్థి యనఁగ. 86

3 ఋకారస్వరూపయతి —

గీ. ఇతి ఋకారరూపస్వరయతులు పరఁగు
ఋగ్యజుస్సామవినుతుండు కృష్ణుఁ డనఁగ
వృష్ణికులజుండు కరుణాసమృద్ధుఁ డనఁగ
హేమపీతాంబరుఁడు దేవవృషభుఁ డనఁగ. 87

4 విరతము —

క. విలస[1] ద్రికారమునున
[2] త్రిల రివిరమంబు శౌరి ఋషులకు శశ్వ
త్సులభుఁ డనఁగ నీయేలకుఁ
దలఁపఁగ రీతోడి విరతి తలకొన దెందున్. 88

గీ. తెల్లముగ ఋకారము యణాదేశశక్తిఁ
గలుగు రేఫయుత్వమునందుఁ గదిసి యతికి
నట్రిరికి నీయేలతో నన్వయించు
నట్టిసత్త్వంబు లే దది హల్లుగాన. 89

---

1 దృ 2 త్రులు, 3 విరమణమొందు. పూ. ము.

5. ఌకారవిరతి —

గీ. మును ఋకార విరా యేలతో నొనరినట్లు
చేర దొకట యణాదేశకారణమున
ఘనలకారంబ యగును ఌకారవిరతి
క్లప్తి లేదు శౌరిగుణావళికి ననంగ. 90

క. స్వరములు కాదుల నొందిన
నరుదుగ స్వరయతులు దగును బ్రాదులు గాకు
స్వరమును నిత్యసమాసా
తురసంధులు రెండు నగు భుజంగమ శయనా. 91

గీ. ప్రాదినిత్యసమాసశబ్దములు గాక
పెరపదంబులపైనచ్చు బెరసినప్పు
డన్నియును స్వరయతులగు సాంబగురుడు
శ్రీశుడమరాన్వయాబ్ధిపూర్ణేందు డనగ. 92

ఉపసర్గలు.

6 ప్రాదియతి —

క. ధర నుపసర్గలు ప్రాస్వవ
దురపాభిప్రతిసువిన్యుదుపపర్యధిసమ్
నిరతిపరాఙపులిరువది,
పరాఙపులు చొరవు తెలుగు బాసను నెందున్. 93

టీ. ప్ర అను, అవ దుర్, అప అభి ప్రతి సు వి ని ఉత్ ఉప, పరి అధి సమ్ నిర్ అతి, పరా, ఆఙ్, అపి, అనువివి యిరువది యుపసర్గలు. వీనిలో పరా ఆఙ్, అపి, అన్నవిగాక మిగిలిన పదునేడును పరస్వర సంధి యైనప్పుడు స్వరయతియైనను వ్యంజనయతియైనను ప్రయోగింపదగును.

---

1 క్లు. 2 పలులకనంగ. 3 చొఱవు - ఇందుశకటరేఫము చింత్యము. ఇట్లే యీగ్రంథమున సర్వత్ర మంటచే సవరింపబడిది. పూ.ము.

దీని కుదాహరణము —

ఉ. ప్రాంతనిరంతరాన్విత దురంతసమస్తపరాక్రమంబున
త్యంతమదాప్తిశోభన మపాయ ముపాయము వీక్షణంబు ప్ర
త్యంత మభీష్టమధ్యయము స్వాంతము సీత ముదంచితంబుప
ర్యంత మనంగ సంధిలుఁదిరంబుగ రెంటను శ్రాదు లచ్యుతా!

7. కాకుస్వరయతి.—

క. కాకుస్వరయతి యగు నిలఁ
దేకదలక జలధిఁ బవ్వళించె ననఁగఁ బ్ర
హ్మాకలితదీర్ఘ మగు నిలఁ
దేకవ్వడి రథముఁ గడపె నిమ్ముల ననఁగన్. 95

ఆ. వె. వలదు కృష్ణ యెఱుఁగవా మున్ను నన్ను నీ
వావిరుద్ధభాష లాడ నేల
లోన నెట్టియలుకలో నాఁగఁ గాకుస్వ
రోక్తి రెంటఁ జెల్లు నొగి ధరిత్రి. 96

గీ. వరుసదీర్ఘాంతసంబుద్ధి వచనయుతుల
[1] కమరుఁ గాకుస్వరంబు పరమసహస్ర
నామశోభిత గోపకృష్ణా యనంగ
నమరవందిత గోపకృష్ణా యనంగ 97

8 నిత్యసమాసయతి —

గీ. పదము విభజించిచెప్పఁ జొప్పడని యవియు
నన్యశబ్దంబుఁగాని విగ్రహంబుఁ జెప్ప
నవియు నిత్యసమాసమై యతిశయిల్లు
నట్టిసంధుల నచ్చు హల్లైన విరతి. 98

1 కడరు - యతిభంగము పూ. ము.

ఆ.వె. నా స్త్రీయనక మహి ననంతసంపదలు నా
రాయణుం డొసంగు రమ్యమగుర
సాయనంబు బుధుల కతఁ డన్న నిత్యస
మాసయతులు రెంట నంటియుండు 99

వ. ఈనిత్యసమాసయతిపే రఖండయతి. 100

గీ. అఱయనంగను బోవుట కర్థమైన
సంధి నిత్యసమాసోక్తి జరగు రెంట
నసురవీరుల నెల్ల నుక్కఱ వధించె
భానుకులుఁడు రావణుని నేపతిచె ననఁగ. 101

వ. అట్లు మఱియును. 102

9. నిత్యయతి —

ఆ.వె. ఏని యనుపదంబుతో నాదిపద మంది
సంధి నిత్యయతుల జరగుచుండు
నెట్టిక్రూరకర్ముఁడేని సద్గతి నొందు
నిన్ను నాత్మఁ దలఁచెనేని కృష్ణ. 103

ఆ.వె. కదియు పదులు స్వరముకై పడఁ గాదులు
బుత్వమునకు నెత్వమైనయు చోటఁ •
గృష్ణుఁ డాఁ కంసు గెడపె నం డ్రార్యులు
కూర్మరూప విమలకోమలాంగ 104

10 వర్గయతి —

క. తలకొని కచటతపంబులు
తలనొక్కక్రాయి తొలఁగఁ దమతగ నాల్గు

---

1. గీ అఱయ అను పోవుటకు నర్థ మగుట నట్టి సంధినిత్యసమాసోక్తి జరుగువదులు, నసురవీరులనెల్ల నొక్కట వధించె భానుకులుఁడు రావణుని రేపటిచె ననఁగ. పూ ము. పై పాఠము అప్పకవీయమునుండి గ్రహింపఁబడినది.

1. అఱయనంగను (ఫ) 2. విడుతెచెననఁగ

విలసిల్లు వర్గయతు లనఁ
గలికల్మషతిమిరతపన ఘననిభవర్ణా 105

11. పోలికవడి —

క. వెలసినపుష్పుబుభువర్ణం
బులు పోలికవడి ముకారముగ నిడఁ దగు ని
మ్ముల హరిచరణసరోరుహ
ములు నాహృత్సరసియందుఁ బొదలు ననంగన్. 106

12. సరసయతి.—

ఆ.వె. *నణలు చెల్లుఁ గమలనాభ యొండొంటికి
నయహ లమరియుండు హస్తివరద
శషస లొందు నన్ద్రు చఛజఝంబులతోడ
సరసయతు లనంగ జలధిశయన. 107

13 సంయుక్తయతి —

క. ఏ నిను వేఁడెద లక్ష్మీ
త్మానాయక నీవు నన్నుఁ గైకొని యిష్టం
బైనవి యొసఁగుము శుభల
క్ష్మా నీవాఁడ నన నొప్పు సంయుక్తయతుల్. 108

క. ఒక్కడుగున విశ్రాంతులు
పెక్కగుచో సంయుతములు పెనుపకమును జ
డ్డక్కరమునఁ దానెత్తిన
యక్కరమే యునుపవలయు నన్నిటఁ గృష్ణా. 109

క. వడినెలవులలోఁ జేరువ
యొడ నొకసంయుతము నొలయొడ నొకటినిఁ దా

* ణనలు చెల్లు' అనుపాఠము యుక్తముగానుండు. అట్లున్నచో ణ-న' ల
యతికి లక్ష్యము చెప్పినట్లగును.

రిడిరేని కవులు తప్పాట
రొదఁబడదు పృథగ్యతిప్రయోగముల హరీ! 110

ఉదాహరణము.—

ద్విరదగతిరగడ

క్ష్మావలయ మంతయు విషాణమున నెత్తుకిటి
మహిమ దలపోయ నక్కజ మనుచు నిట్లనక,
క్ష్మావలయమంతయు విషాణమున నెత్తుకిటి
సత్త్వ మరు దన నొప్పు సంయుక్తయతి చెడక. 111

అట్ల మరియొక ఛందంబుగ తగద. –

*అంపమున వ్రచ్చుగతి వ్రచ్చె నఖముల రిపుని
వక్షము నృసింహుఁ డని రాయువడిసారగుకృతి
అంపమున వ్రచ్చుగతి వ్రచ్చె నఖముల రిపును
రంబు నరసింహుఁ డనఁ గ్రాలు సంయుక్తయతి. 112

14. తద్భవవ్యాజయతి —

గీ. అప్రసిద్ధముల్ జ్ఞాలుశబ్దాళియందు
ఞాజసంయుక్తి తద్భవవ్యాజమునను
నణలతోఁ బొందు విరతి యాజ్ఞప్తి యనఁగ
జలరుహోదరాశ్రితులు సుజ్ఞాను లనఁగ. 113

ఆ.వె. యజ్ఞమునకు జన్న మాజ్ఞప్తి కానతి
యాజ్ఞ కాన సంజ్ఞ కరయ సన్న
విన్నపంబు వెండి విజ్ఞాపనమునకు
జ్ఞాకుఁ దద్భవంబు నా ధరిత్రి. 114

15. రేఫయుతయతి

గీ. ఆంధ్రలిపిఁ జొప్పడదు ఋకారాన్వితంబు
క్రొత్తగాదు కృష్ణునివెన్నమ్రుచ్చి మనఁగ

---

*అంపము - ప్రచ్చు - రక్షయతిమైత్రి - చూపట్టెడు.

స్రుక్కఁ దతఁ డాబి నెట్టి విరోధి నైనఁ
గ్రుమ్ము నన రేఫయుతయతి గూడుఁ గాన. 115

16 అనుస్వారయతి.—

గీ. భువి ననుస్వారయతి బిందుపూర్వకముగ
నాకు నిట నాల్గు చెల్లుఁ బాండవసహాయ!
నాకు నిట నాల్గు చెల్లుఁ గందర్పజనక!
మాకు నిటనాల్గు చెల్లు సంపదలరాజ! 116

17. మకారయతి. —

గీ. యరలవలు శషసహాలును నాదిబిందు
యుతములై మకారవిరామయుక్తిఁ దనరు
మారుతాత్మజుఁ డరిదిసంయమి యనంగ
మదనజనకుఁడు దనుజసంహారుఁ డనంగ. 117

18 ఎక్కటియతి.—

క. ధర నెక్కటివళ్లై తగు
శరమణివలు వానిలోఁ (జెలంగును) లాకుఁ
సరి శా యన విశ్రమవే
శ రమాధిప రెండునుం గలసి వర్తించున్. 118

ఆ.వె. మరునితండ్రి లోకమహితుండు యాదవ
రాజసింహ మూర్తిరక్షకుండు
తాఁగవేలు పనఁగ అంపిల్లు నెక్కటి
వళ్లు నాఁగ నిల్లు వనజనాథ! 119

19 ప్రభునామాంతయతి.—

గీ. ఒరుల నన్నమ్మ యనుచోట నూఁదఁబడక
ద్వివిధ మగుఁ బ్రభునామాంతవిరమణంబు

మహి నయోధ్యకు రాజు రామన యనంగ
నతనిపట్టపుదేవి సీతమ యనంగ. 120

20 విభాగయతి —

గీ. సంఖ్యకుం బరిమాణసంజ్ఞకుఁ దనర్చు
శబ్దములపై విభాగోక్తి సరణి సంఘ
టించినప్పుడు యతులు రెండేసియగు ను
పేంద్రుఁ డిచ్చునర్థము మోపెఁడేసి యనఁగ. 121

2 . భిన్నయతి —

క. అంచితతిలకము శౌరి ధ
రించె ననఁగ జగణమధ్యరేఫవిరతి యా
నంచితతిలకము హరి ధరి
యించె ననఁగ భిన్నవిరతి నిత్యమువచ్చున్. 122

గీ. అట ఇకారాంతపదముమీఁదటి వికార
మది యనంగ నవ్వల భిన్నయతికిఁ జెల్లు
దివిజవిభవంబు శౌరిచేతిది యనంగ
నసురనాశంబు హరిచేతియది యనంగ. 123

22 వికల్పయతి

గీ. హాయుతమై పొల్లుల వికల్పయతులు చెల్లు
దేవకీనందనుఁడు జగద్ధితుఁ డనంగ
హలధరుఁడు సంగరాంగణోద్ధతుఁ డనంగ
నవని మోచినయవి కకుబ్భస్తులనఁగ. 124

23. యుక్తవికల్పయతి —

గీ. *నలిఁగకారహల్లితరానునాసికాఖ్యఁ
గదిసి తత్పంచమముగా వికల్పవిరతి

* నలిఁగకారహల్లి - పా. ము.

గలుగుఁ జక్రి వల్లవసుదృఙ్మథుఁ డనంగఁ
గమలనేత్రుండు సకలదిఙ్మహితుఁ డనఁగ. 125

**24.** అభేదవిరతి —

క. ప్రకటపకారవకార
ద్వికమునకుం జను నభేదవిరతి నిశాట
ప్రకర మెరిసె రామునిపా
వకశరమున జనకసుతసెపంబున ననఁగన్. 126

గీ. చెల్లుబడివళ్లు ప్రాసము ల్చెప్పఁబడియె
నిందుఁ బూర్వప్రయోగంబు లెఱిఁగి యివ్వి
బహుళమై తోఁచె నవి యొనర్పంగవలయు
నవ్యకావ్యప్రయోక్తల నలిననాభ 127

క. వరగణవర్ణము దీర్ఘ
స్వరమగుచో గణయుగంబు చను యతుల సుధా
కరకరగుణగతి శరరుచి
గిరిగణరుద్రాదిసంజ్ఞ కేశవనాథా! 128

క. ఎన్నిట యతి రావలె నని
రన్నిట సంస్కృతమునందు నగు విచ్ఛేదం
బెన్నిట యతిరావలె నని
రన్నిటఁ దెలుఁగునకు మొదలియక్షర మమరున్. 129

గద్యము. ఇది శ్రీవాణీప్రసాదలబ్ధవాగ్వైభవ తిక్కనామాత్య తనూభవ సుకవిజనవిధేయ అనంతయనామధేయ ప్రణీతం బైనఛందోదర్పణమునందు గద్యపద్యాదికావ్యలక్షణంబును గురులఘునిర్ణయంబును గణనిరూపణంబును బ్రాసయతి విశేషంబులును బరిగణవసంజ్ఞయు నన్నది ప్రథమాశ్వాసము.



శ్రీరస్తు.

# ఛందోదర్పణము

## ద్వితీయాశ్వాసము.



రమణ భక్తలోకము
నోరమణ జగత్త్రయాభినుత రంజిత గౌ
రీరమణ సంభరితవా
ణీరమణ యనంతశయన నీరజనయనా.

క. కనుఁగొనఁ బాదరహితమై
పనుపడి హరిగద్దెవోలె బహుముఖరచనం
బున మెఱయు గద్య మది దా
దెనుఁగుకృతుల వచన మనఁగ దీపించుఁ గడున్. 2

గద్యము. స్వస్తిసమస్తభువనరక్షాదక్ష శ్రీపుండరీకాక్ష భుజగ
పతిసింహాసనారూఢ సురనికరమకుటతటఘటితసురుచిరమణి
గణప్రభావిభాసితపాదపీఠ! వేదనినదానుకారిగౌరవలలిత
నూపురాలంకృత చరణసరసిజయుగళ సవ్యపదాంగుష్ఠనఖమ
యూఖరేఖాయితసురసరిత్ప్రవాహ పీతాంబరధరనూత్న మే
ఖలాకలితకటితటప్రదేశ చతురాననజనక నాళీకశోభితనాభి

సరోవర, యఖండబ్రహ్మాండకలాప గోపననిపుణోదర, శ్రీసా
సాగర తనయామనోజ్ఞ గేహీకృతవిపులవక్షస్థల కనత్కనక
కటకకేయూరప్రముఖభూషణభూషిత చతుర్భుజ, శంఖపంక
జసుదర్శన గదాధర కిరీటకుండలాభిరామ యనవరతప్రసన్న
వదన కౌండిన్యవరద శ్రీయనంతపద్మనాభ నమస్తే నమస్తే
నమః అని గద్యపఠనంబొనర్చునుత్తములకు నుత్తమాయు
రారోగ్యంబు లొదవునని విశదవచనంబుల విద్వజ్జనంబు లభి
నుతింతురు. 3

ఛందములు

క. సమవృత్తము లనియెడును
త్తమరత్నంబులకు జన్మధామములై పెం
పమరు సముద్రమ్ములచం
దములై ఛందములు మహి సుదర్శనపాణీ! 4

సీ. ఉక్తయు నత్యుక్తయును మధ్యయును బ్రతి
ష్ఠయు సుప్రతిష్ఠయు సరళమైన
గాయత్రి యుష్ణిక్కు నాయనుష్టుప్పును
బృహతియుఁ బంక్తియు మహితమైన
త్రిష్టుప్పు నలజగతియు నతిజగతియు
శక్వరి మఱి యతిశక్వరియును
నష్టియు నెండి యత్యష్టియు ధృతియును
నతిధృతియును మఱి కృతియుఁ బ్రకృతి

ఆ.వె. యాకృతియును వికృతి యటుసంకృతియు నభి
కృతియు నుత్కృతియనఁ గీర్త్యమగుచు

జరగు నిరువదారుఛందంబు లోకో త్త
రాధికాక్షరముగ నబ్జనాభ!

ఛందోవృత్తసంఖ్య.

సీ. శరములు వేదముల్ శరులు రాజులు రాగ
సంఖ్య విద్యలు నిభ చక్షురిందు
లంగాస్త్రబాహువు లక్షీందుశరములు
గతిలోచనాంబరకమలరిపులు
నాగవేదాంబరనయనముల్ ఋతునిధి
ఖాబ్ధులు శరవిరించాబ్జఘణులు
గతినాగగుణశాస్త్ర కైరవాప్తులు దిగ్గ
జాంగపర్వతలోచనానలములు
ఆ. వె. శాస్త్రవహ్ని బాణశరతర్కములు బాహు
శైలఖేందు రామచంద్ర సంఖ్య
గతిగతీందు బాహుఋతుబాహు లహినాగ
బాహువేదబాహుబాణచయము. 6

సీ. ఋతుశైలశరగజగతిఖేందు లక్షభూ
తేంద్వద్రినిధిగగనేక్షణములు
నిగమాభ్రగుణగతి నిధిచంద్రగతులు వా
రణఖర్తుగజదంతిరామకరులు
తర్కేందుకరమునిత్రయతర్క విధు లక్ష
పావకాబ్ధిసముద్ర బాణబాణ
వహ్నివహ్నులు బ్రహ్మావదనాంగభుజగేభ
ఖేందుశైలర్తులు ఛందములకు

1 విధు (వ్రా ము.) - నవరణ (శ)

ఆ. వె. వేలువేల పుట్టు వృత్తసమూహంబు
వెండి సర్వవృత్తవితతి యరయ
బుతుకరాద్రిశైలసితదీప్తి నయనతో
[1]యధికృశానుచంద్రు లబ్జనయన. 7

సర్వసమవృత్తభేదసంఖ్య

చ. ఒగిఁబదమూఁడుకోటులును నొప్పఁగ నల్వది రెండులక్షలుం
దగఁ బదునేడువేలు నుచితంబుగ నవ్వల నేడునూటిపై
నగణితవైభవా యిరువదాఱు గదా సమవృత్తభేదముల్
ప్రగుణితలక్షణస్ఫురణఁ బంచినఛందము లిర్వదాఱిటన్. 8

సమవృత్తలక్షణము.

క. హెచ్చును గుందును బొరయక
యచ్చొత్తినయట్లు నాలుగడుగులు సమమై
[2]వచ్చును యతినియమంబును
[3]జెచ్చెర సమవృత్తములకుఁ జిత్తజజనకా! 9

వ. సమవృత్తంబు లెట్టివనిన. 10

మొదలియుక్తాచ్ఛందంబునందు శ్రీయనువృత్తము.—
శ్రీ భా, విం, తున్. 11

రెండవయత్యుక్తాచ్ఛందంబునందు స్త్రీ యను వృత్తము.—
స్త్రీ రూ, పారన్, ఘోరా, ఘోరీ.

మూఁడవమధ్యాచ్ఛందంబునందు వినయంబనువృత్తము.—
వినయం, బొనరిం, తు నమం, తునకున్.

నాలవప్రతిష్ఠాచ్ఛందంబునందు బింబమనువృత్తము—
శ్రీకలితా, స్తోకభగల్, పైకొనుబిం, బాకృతికిన్. 14

1 లబ్జనయన - పూ మ లబ్ధిశయన (థ) 2. వచ్చుచు (పూ మ.)
వరణ (థ) 3 చెచ్చెఱ - పూ. మ.

అందు సుకాంతియనువృత్తము —

అగు౯ సుకాం, తి గూర్పఁగా, జగంబుల౯, జగత్పతీ. 15

అయిదవదగు సుప్రతిష్ఠాచ్ఛందంబునందు అంబుజమనువృత్తము —

పంబిభలగా, డంబరముగా, నంబుజము చె, ల్వాం బగుహరీ.

అందు పంక్తియను వృత్తము —

ఒక్క భకారం, బెక్కు గగంబుల్,
నెక్కొనుఁ బంక్తిం, దక్కక శౌరీ. 17

ఆఱవ గాయత్రీచ్ఛందంబునందు తనుమధ్యయనువృత్తము —

గోపాలుని దేవే, నాపాలికి నాఁగాఁ
బైపై తనుమధ్య౯, బ్రాపించుఁ దయంబుల్. 18

ఏడవ యుష్ణిక్ఛందంబునందు *మధుమతి యనువృత్తము —

మధురిపుఁ డనిన౯, మధురపునగల్
మధురము లగుచు౯, మధుమతి నమరున్. 19

అందు మదరేఖయనువృత్తము —

రూపింప న్మగణాద్యం, బై పెంపార సగంబుల్
దీపించు న్మదరేఖ౯, గోపస్త్రీహృదయేశా. 20

ఎనిమిదవ యనుష్టుప్ఛందంబునందు విద్యున్మాలయనువృత్తము.

మాద్యద్భక్తి న్మాగాయుక్తి౯, విద్యున్మాలావృత్తం బొప్పు౯
జైదద్యధ్వంసి౯ సంబోధింప౯, సద్యశ్శ్రీయోజాతంబయ్యెన్.

అందు చిత్రపదమనువృత్తము.

వారక భాగురుయుగ్మం, బారఁగఁ జిత్రపదాఖ్యం
జేరిన వేడ్కఁ గవీంద్రుల్, గోరి నుతింతురు శౌరిన్. 22

---

*దీని పేరే మదనవిలసితము (చూ. కవిజనాశ్రయము, కావ్యాలంకారచూడామణి.)

అందు ప్రమాణికయను వృత్తము.—

సరోజనాభుఁ డచ్యుతుం, డరాతిభంజనుం డనఁగ,
జరేఫలన్ లగంబులన్, ధరం బ్రమాణి యొప్పగున్. 23

తొమ్మిదవ బృహతీచ్ఛందంబునందు హలముఖియను వృత్తము —

చిత్రజాతునిగురునికై, యెత్తుఁ డంజలు లనినచో,
సత్తుగా రనసములొగిన్, బొత్తుగా హలముఖి యగున్. 24

క. పదలక పంక్తిచ్ఛందము
మొదలుగ నిటమీఁదిఛందముల కందముగా
నుదయించువృత్తసమితికి
విదితంబుగ వళులు వలయు విధురవినయనా! 25

పదియవపంక్తిచ్ఛందంబునందు 1రుగ్మవతియనువృత్తము.

రూపితరీతిన్ రుగ్మవతీసం
రూపభమంబుల్ రూఢి సగంబుల్
ప్రాపుగ భూతవ్రాతయుతుల్గా
శ్రీపతిలీలన్ జెప్పఁగ నొప్పున్. 26

భ, మ, స, గ.

అందు మత్తయను వృత్తము.—

మొత్తం బారున్ మభములు నిత్యో
దాత్తంబై సస్ఫురితగకారా

---

1 రుగ్మవతి. మరియొకపేరు. చూ. రుగ్మవతిం [illegible] క-రిగ్మరు విద్యాదీప్త .. త్రిన్ కావ్యాలంకారచూడామణి 102 పు. (ప్రా కం)
కవిజనాశ్రయమునందును 'రుగ్మవతి' యను పేరే ప్రాప నిబద్ధమై యున్నది. కాని సంస్కృతవృత్తరత్నాకరమున 'రుక్మవతి' యని యున్నది ఇదియే యర్థవంతమనఁదగు.

యుక్తంబై షణ్మితయతి నొందుఁ
మత్తావృత్తం బగు మహిఁ గృష్ణా! 27

మ, భ, స, గ.

అందు ప్రణవమను వృత్తము —

ఆరంగా మనయగసంయుక్తిఁ
పారోదంచితశరవిశ్రాంతిఁ
శ్రీరాజుం దొరసిన నత్యంత
స్ఫారంబై చను ప్రణవం బుర్విన్. 28

మ, న, య, గ.

అందు మయూరసారి యను వృత్తము —

చూత మాయశోదసూను నంచుఁ
ద్రేత పల్కుఁ దర్కవిశ్రమంబుల్
ఖ్యాతిగా రజంబుపై రగంబుల్
జాతిగా మయూరసారిఁ జెప్పన్. 29

ర, జ, ర, గ. (దీని పేరే మయూరభాషిణి)

అందు శుద్ధవిరాటి యను వృత్తము —

శ్రీమంతుం డగు చిన్నకృష్ణునిఁ
ధీమంతుల్ప్రణుతింప వాణివి
శ్రామంబుల్ మసజంబు గంబునై
రామా శుద్ధవిరాటి యొప్పగున్. 30

మ, స, జ, గ.

అందు మణిరంగ మను వృత్తము.

శ్రీమనస్సరసీరుహమిత్రుఁ
క్రమ మొప్పఁగఁ జేర్కొనుచోటఁ
రామునస్త్రవిరామరసాగల్
కోమలంబు లగు న్మణిరంగన్. 31

ర, స, స, గ.

ఏకాదశాక్షరప్రస్తారంబునందు.—
దోదకమనువృత్తము,

తోరపువేడుకఁ దోదకవృత్తా
కారముగాఁ ద్రిభకారగగంబుల్
నీరజనాభుని నెమ్మినుతింపన్
జారువిరామము షణ్మితి నొందున్. 32

భ, భ, భ, గ, గ.

అంద ఇంద్రవజ్రయను వృత్తము.—

సామర్థ్యలీలన్ తతజద్విగంబుల్
భూమిత్రవిశ్రాంతులఁ బొంది యొప్పున్
ప్రేమంబుతో నైందవబింబవక్త్రున్
హేమాంబరుం బాడుదు రింద్రవజ్రన్. 33

త, త, జ, గ, గ.

అంద ఉపేంద్రవజ్రయను వృత్తము.—

పురారిముఖ్యామరపూజనీయున్
సరోజనాభున్ జతజద్విగోక్తిన్
దిరంబుగా నద్రియతి న్నుతింపన్
ఇరాను ప్రాణేశు నుపేంద్రవజ్రన్. 34

జ, త, జ, గ, గ.

అంద ఉపజాతియను వృత్తము —

పినాకికోదండము బిట్టుద్రుంచెన్
*దానొప్ప గెల్చెన్ జమదగ్నిసూనున్
అనంతసత్త్వుం డితఁ డంచు మెచ్చన్
జానైనవృత్తం బుపజాతి యయ్యెన్. 35

---

* ఇందు 8-వ యక్షరము యతిగాన యతిభంగ మేర్పడుచున్నది; 'దానొప్ప' అని పఠించుట యుక్తము.

క. సమపదము లింద్రవజ్రవి
షమపదము లుపేంద్రవజ్రఁ జను సుజనాళీ
సమవిషమాంఘ్రులు తద్వ్య
త్క్రమమైనను నదియ పేరు కమలదళాక్షా! 6

అంద రథోద్ధతమనువృత్తము —

నందగోపవరనందనున్ రమా
నందుఁ బ్రస్తుతి యొనర్చి సద్యతిన్
అందమై రనరవాహ్వయంబు లిం
పొందఁ జెప్పిన రథోద్ధతం బగున్. 37

(ర, న, ర, లగ. దీనిపేరే పరాంతికము)

అంద 1 కీలాలంబనమనువృత్తము.—

నాళీకభవామరనాథు లోగిన్
శ్రీలోలుని కీర్తన సేయ నొగిన్
బోలంగఁ దజావలఁ బొందిన కీ
లాలంబన మై చను నద్రియతిన్. 38

త, జ, జ, స.

అంద స్వాగతవృత్తము.—

నారదాదిమునినాయకవంద్యున్
శౌరిఁ జేరఁ దన స్వాగత మొప్పన్
పారమైనయతి షణ్మతి నొందన్
భూరిరేఫనభముల్ గగయుక్తిన్. 39

ర, న భ, గగ.

---

1 అప్పకవీయమున నిది 'కాంతి' యనియుఁ గవికాంతము' అని రెండు పేరులు వ్రాయఁబడినది. చూ. పుట. 229 కాంత' అని కవిజనాశ్రయము.

అంద శాలినియనువృత్తము.—

చేతోరాగం బుల్లసిల్లన్మతాగా
ద్యోతంబై షడ్వర్ణయుక్తిన్ విరామం
బేతేరంగా నిందిరేశ ప్రభావా
న్వీతం బైనన్ శాలినీవృత్త మయ్యెన్. 40

మ, త, త, గగ.

అంద శ్యేనియనువృత్తము.—

ఆరమాధినాథుఁ డక్షయంబుగాఁ
జీర లిచ్చె యాజ్ఞసేని కంచుఁ బెం
పారఁ జెప్పు శ్యేని యయ్యె షడ్యతిన్
స్ఫారమై రజంబుపై రవంబుగాన్. 41

ర, జ, ర, జ.

అంద వాతోర్మియనువృత్తము —

దేవాధీశున్ హరిఁ దేజోవనధిన్
భావింపంగా ఋతుభాస్వద్విరతిన్
ఈవాతోర్మిన్ మభలేపారుఁ దకా
రావాసంబై లగ మర్థిన్ గదియన్. 42

మ, భ, త, లగ.

అంద [1] చంద్రికయనువృత్తము —

నగణయుగమునన్ రవంబులన్
బ్రగుణరసవిరామసంగతిన్
తగిలి హారికభాసమేతమై
నెగడుఁ గృతుల నిండి చంద్రికన్. 43

న, న, ర, వ.

---

1 చంద్రిక పూ.మా. జగతిని కాఁడొందు చంద్రికల్ అప్పకవీయము పు. 80.

పండ్రెండవ జగతీచ్ఛందంబునందు భుజంగప్రయాతమను వృత్తము.—

భుజంగేశపర్యంక పూర్ణానురాగున్
భుజంగప్రభూతాఖ్యఁ బూరించుచోటన్
నిజంబై ప్రభూతావనీభృద్విరామం
బజస్రంబుగాఁ గూర్ప యాద్వంద్వ మొప్పున్. 44

య, య, య, య.

అంద తోటకమను వృత్తము.—

జలజోదరనిర్మలసంస్తవముల్
విలసిల్లెడుఁ దోటకవృత్తమునన్
దొలుపై సచతుష్కముఁ బొందగ నిం
పలరారఁగఁ బల్కుదు రష్టయతిన్. 45

స, స, స, స.

అంద దోధకమను వృత్తము.—

చెలఁగి నజాయలఁ జెందిన నారీ
తిలకము లద్రియతిన్ మృదురీతిన్
వెలయఁగఁ దోధకవృత్తవిభాతిన్
బలుకుదు రిష్టులఁ బంకజనాభున్. 46

న, జ, జ, య. (దీనికే తామరసము)

అంద స్రగ్విణీవృత్తము —

దేవకీనందనున్ దేవచూడామణిన్
భూవధూవల్లభుం బుండరీకోదరున్
భావనాతీతునిం బల్కఁగా స్రగ్విణి
భావ మాద్యంతరేఫంబగున్ షడ్యతిన్. 47

ర, ర, ర, ర.

అంద ఇంద్రవంశమనువృత్తము —

సొంపార నీదేవునిసూనుఁడై కదా
అంపిల్లెఁ బుష్పాస్త్రుఁడు దాఁగ యానన్
ఇంపార భూభృద్యతి నింద్రవంశముల్
చెంపారఁ దాజంబులఁ జేర్పు రేఫతోన్. 48

త, త, జ, ర.

అంద వంశస్థమనువృత్తము.—

నమోనమో దేవజనార్దనాయ తే
నమోనమః పంకజనాభ నావుడున్
రమించు వంశస్థ విరామముద్రలన్
సమంచితంబై జతజంబు రేఫయున్. 49

జ, త, జ, ర.

అంద ద్రుతవిలంబితమనువృత్తము.—

శ్రుతి మతాంగ నిరూఢమహాయతిన్
యతివర ప్రముఖార్యజనం బొగిన్
ద్రుతవిలంబిత తోషితరీతులన్
ధృతిధరున్ నుతిసేయు నభారలన్. 50

న, భ భ, ర.

అంద జలధరమాలయనువృత్తము.—

శ్రీతన్వీకుందగిరితోఁ జత్తం బారన్
మాతా యంచున్ జలధరమాలావృత్తం
బేతేరంగా మభనమ లింపొందంగాఁ
బ్రీతిం బల్కన్ స్వరతి కరిన్ బ్రాపించున్. 51

మ, భ, స, మ.

అందు ప్రియంవదంబనువృత్తము.—

త్రిభువనాభినుతు దేవదేవునిఁ
బ్రభు ముకుందు నిటు ప్రస్తుతింపఁగా
నభజర ల్గదిసినం బ్రియంవదా
విభవ మొప్పు గిరివిశ్రమంబులన్. 52

న, భ, జ, ర.

అందు ప్రమితాక్షరమనువృత్తము.—

కమనీయతేజుని నగణ్యయశుఁ
గమలాధిపుం బలుకఁగా సజసల్
క్రమ మొప్పఁ గూడఁగ సకారముతోఁ
బ్రమితాక్షరం బహివిరామ మగున్. 53

స, జ, స, స.

అందు జలోద్ధతగతి యనువృత్తము.—

సరోరుహదళాక్ష శాశ్వతయశా
పురారినుత యంచు భూధరయతిఁ
సగాగ మగుచున్ జసల్ జసలతో
నురుప్రభ యగున్ జలోద్ధతగతిన్. 54

జ, స, జ, స.

అందు విశ్వదేవియనువృత్తము.—

జానొందం గావ్యశ్రీకి సంప్రీతితోడఁ
మానాథు న్నాథుం జేసి మాయాగణంబుల్
ధీనిత్యుల్ ధాత్రీభృద్యతిం గూర్తు రింపుల్
తేనెల్ సోనల్ గా విశ్వదేవీసమాఖ్యన్. 55

మ, మ, య, య.

పదునాఱవ యతిజగతీచ్ఛందంబునందు మత్తమయూరమనువృత్తము.—

భోజాధీశుం డంచుఁ బ్రభూతాత్మకుఁ డంచున్
భ్రాజిష్ణుం డంచున్ యతి బాగా గిరి సంజ్ఞన్
ఓజస్స్ఫీతంబై మతయోపేతసగంబుల్
ఓజం బల్కన్ మత్తమయూరం బలరారున్. 56

మ, త, య, స, గ.

అందు జలదమనువృత్తము.—

మ్రొక్కుల కెల్ల నెల్ల యగుమూర్తిగదా
యక్కరులాత్ముఁ డంచుఁ జతురాస్యయతిన్
దక్కక ప్రస్తుతింప జలదం బగు ని
ట్లొక్కటియై భరేఫనభ లొందు గురున్. 57

భ, ర, న, భ, గ.

అందు మంజుభాషిణి యనువృత్తము —

దివిజేంద్రుఁ డాదియగు దేవసంఘముల్
భువి మంజుభాషిణికి భోగిరాడ్యతిన్
సవరింపఁగా సజసజంబు గాంతమై
భువనోదరస్తుతి యపూర్వమై చనున్. 58

స, జ, స, జ, గ.

అందు ప్రహర్షిణీయనువృత్తము.—

ముక్తిశ్రీకరు భవమోచను స్మరారిన్
భక్తిం బ్రోడజనులు ప్రస్తుతింప నొప్పున్
వ్యక్తగ్రావయతిఁ బ్రహర్షిణీసమాఖ్యన్
యుక్తంబై మనజరగోజ్జ్వలద్గణాప్తిన్. 59

మ, న, జ, ర, గ.

అంద ప్రభాతమనువృత్తము.—

సరసిజనాభ భుజంగరాజతల్పా
శరణము నీవని సన్మతిం దలంపన్
బెరయు నజారలు పేర్మి నొప్పగన్ గన్
జరగుఁ బ్రభాతము శైల విశ్రమంబున్. 60

న, జ, జ ర, గ.

అంద రుచిరమనువృత్తము.—

అనంగకోటివిలసదంగవైభవున్
మనంబులో నిలిపిన మాను నాపదల్
అనన్ జభంబులు[1] సజగాసుసంగతిన్
దనర్చు నీరుచిరకు దంతిరాడ్యతిన్. 61

జ భ స, జ, గ.

పదునాలుగవశక్వరీచ్ఛందంబునందు వనమయూరమనువృత్తము.—

ఉన్నతము లై వనమయూరకృతు లోలిన్
ఎన్నఁగ భజంబులపయి న్నగగంబుల్
చెన్నొదవ దంతియతిఁ జెంది యలరారన్
వెన్నుని నుతింతురు వివేకు లతిభక్తిన్. 62

భ, జ, జ న, గగ (ఇదే యిందువదనయనువృత్తము)

అంద [2]వసంతతిలక మనువృత్తము.—

గౌరీనితాంతజపకారణనామధేయున్
దూరీకృతప్రణతదుష్కృతు నంబుజాతున్

---

1 సజగానురసంగతి. (వ్రా. మ.)
సజగానుసంగతి (భ)

2 దీనికే సింహోన్నతము ఉద్ధర్షిణి, శోభావతి, మధుమాధవి అని యప్పకవీయము. చూ. పుట. 235.

ధీరోత్తము ల్గిరియతిఁ దభజాగగ ల్పెం
పార న్వసంతతిలకాఖ్య మొనర్తు రొప్పన్. 63

త, భ, జ, జ, గగ.

అంత ప్రహరణకలితయను వృత్తము.—

వనరుహసఖుఁడుఁ వనరుహరిపుఁడుఁ
గనుఁగవ యగునాకరివరదునకుఁ
ననభనలగము న్నగయతిఁ బలుకఁ
బనుపడుఁ గృతులం బ్రహరణకలితన్. 64

న, న, భ, న, లగ.

అంత సుందర వృత్తము.—

కోరినకోరిక లిచ్చుఁ గోమలి చూడవే
మారునితండ్రి యనం గ్రమంబున నీక్రియఁ
భారసవంబుల నొప్పుఁ బన్నగరాడ్యతిఁ
సూరిజనంబులు సెప్ప సుందరవృత్తముల్. 65

భ, భ ర, స, జ.

అంత అపరాజితయను వృత్తము.—

మునిజనవినుతుం డమోఘుజయోన్నతుం
డనితరసదృశుం డనంగగురుం డనం
జను ననయుతమై రసంబు లగంబులై
తనరఁగ నపరాజితం బహిరాద్యతిన్. 66

న, న, ర, స, లగ.

అంత అసంబాధయను వృత్తము.—

సౌమ్యంబై విష్ణుస్తుతులను నతి సేవ్యంబై
రమ్యస్ఫూర్తిఁ రుద్రవిరమణము రమ్యంబై

గమ్యాకారం బొప్పు మతనసగగప్రాప్తిన్
సమ్యగ్భావంబై పొలుపమరు నసంబాధన్. 67

మ, త, న స, గగ

అందు భూనుతము వృత్తము.—

శ్రీనివాస పురుషోత్తమ సింధువిహారా
పూని మమ్ముఁ గృపఁ జేకొని ప్రోవు మనంగా
భూనుతంబు రనభాగలఁ బొందిగ యుక్తిన్
పూని సొంపుగ గ్రహోత్కరమున్ వడినొందన్. 68

ర, న, భ, భ, గగ.

అందు కమలవిలసిత మను వృత్తము.—

నగణము నగణము నగణముఁ జేరన్
నగణము గగము నొనర నటమీఁదన్
దిగిభవిరమణము దిరమగు నేనిన్
దగుఁ గమలవిలసితము కమలాక్షా! 69

న, న, న, న, గగ.

పదునేడవ యతిశక్వరీచ్ఛందంబునందు మణిగణనికర మను వృత్తము.—

కనకపువలువలుఁ గరకటకములున్
నునుపగుతులసియును నొసలితిలకమున్
దనరెడుహరిఁ గని తగనననసల్
నిలిచిన మణిగణనికర మిభయతిన్. 70

న, న, న, న, స

అందు మాలినియను వృత్తము.—

సకలనిగమవేద్యున్ సంసృతివ్యాధివైద్యున్
మకుటవిమలమూర్తిన్ మాలినీవృత్తపూర్తిన్

[1]సకలితనమయాక్తి స్నాగవిశ్రాంతియుక్తిన్
సుకవులువివరింపన్ సొంపగుస్వస్తిమింపన్. 71

స, స, మ, య, య.

అందు సుకేసరవృత్తము.—

యతియవకారసంఖ్య నిడి యాదరంబుతో
నతిశయమై నజంబులు భజాంతరేఫలున్
వితతముగా నొనర్చి యరవిందలోచనున్
క్షితిధరు సంస్తుతించిన సుకేసరంబగున్. 72

న, జ, భ, జ, ర.

అందు మణిభూషణమను వృత్తము. —

హస్తిరాజభయనిర్హర యండజవాహనా
ధ్వస్తసంసరణ యంచుఁ బితామహవిక్రమ
ప్రస్తుతంబుగ రనంబుల భారగణంబులన్
విస్తరింప మణిభూషణవృత్తము చెల్వగున్. 73

ర, న, భ, భ, ర.

అందు మనోజ్ఞమను వృత్తము.—

అజశివశక్రనిరంతరార్చితపద్మయున్
భుజగకులాధిపతల్పుఁ బూని నుతింపఁగా
నజయతి నొంది నజాభరార్చిత మై చనున్
ఋజు వగు సర్వ మనోజ్ఞ మనుష్యను రాగమై. 74

న, జ, జ, భ, ర.

పదునాలవయష్టిచ్ఛందంబునందు ప్రియకాంతయను వృత్తము —

అవనియు శ్రీయు సతులుఁ డాత్మోద్భవుఁ డాప్తుల్
దివిజులు దామోదరునకు దేవ ల్లిఁ కనేరీ

---

1. సకలిత నమయాక్తి - 'స-స-మ-య-య' అను గణములు చెప్పఁబడినవని తెలియవలయును. నమయా + ఉక్తి అని భేదము.

నుతు గ సాఁగా నయనయసమ్యక్స్రగయుక్తిన్
గవినుతమై దిగ్యతిఁ బ్రియకాంతాకృతి యొప్పున్. 75

న, య న, య, న, గ.

అంత పంచచామర మనువృత్తము.—

జరేఫలున్ జరేఫలున్ జసంయుతంబులై తగన్
గురూపరిస్థితిం బొసంగి గుంఫనం బెలర్పఁగా
విరించిసంఖ్య నందమైనవిశ్రమంబులం దగున్
బ్రరూఢమైనఁ బద్మనాభ పంచచామరం బగున్. 76

జ, ర జ, ర, జ, గ.

అంత పద్మకమనువృత్తము —

సకలితంబు నభజాజగణంబులు గాంతమై
సకలదిగ్విరమణంబులు సన్నుతమై చనన్
శకటదైత్యమదభంజను సన్నుతిసేయఁగాఁ
బ్రకటమైకృతులఁ బద్మము పద్మకముఁ బట్టగున్. 77

స, భ, జ, జ, జ, గ.

అంత ఫలసదనమనువృత్తము.—

ననలును ననలును దనరఁగ సగయుక్తిన్
వనరుహభవయతు లవహితమతితోడన్
నినుపుచు సుకవులు మణివిలసదురస్కున్
గొనకొని పొగడఁగ నగు ఫలసదనంబుల్. 78

న, న, న న, స, గ.

అంత చంద్రశ్రీయనువృత్తము.—

జగన్నాథున్ లక్ష్మీహృదయజలజప్రోద్యదర్కున్
ఖగాధీశారూఢున్ సుకవిజనకల్పద్రుమంబున్
దగ న్వర్ణింపంగా యమనసయుతంబై రగంబుల్

ఘుగిం జంద్రశ్రీకి న్నిలుచు యతి ముక్కంటి నొందున్.79

య, మ, న, స, ర, గ.

అంద మేదినియనువృత్తము.—

నగణముతో జకారభగణంబులుఁ జకార
ప్రగుణితరేఫయుఁ గురువు భాతిగాఁగ నొలిఁ
దగ నవతారవిశ్రమము దండిగా నొనర్పఁ
మృగమదవర్ణుఁ డీయకొను మేదినీసమాఖ్యన్. 80

న, జ, భ, జ, ర, గ.

పదునేడవయత్యష్టిచ్ఛందంబునందు నర్కుటమనువృత్తము.

కొలిచెద నందగోపసుతుకోమలపాదములఁ
దలిచెదఁ బూర్వ సంచితపుదోషములన్ సుఖనై
నిలిచెద నన్న నర్కుటము నిర్మలవృత్తమగుఁ
సలలితమై నజంబుల భజావల దిగ్విరతిన్. 81

న, జ, భ, జ, జ, వ.

అంద శిఖరిణియనువృత్తము.—

గజేంద్రాపద్ధ్వంసిఁ ముదిరసదృశుం గంజనయనుఁ
భజింతుం దాత్పర్యంబున ననినచో భాస్కరయతిఁ
ప్రజాహ్లాదం బైనఁ [1]యమనసభవప్రస్ఫురితమై
ద్విజశ్రేష్ఠు ల్మెచ్చఁ శిఖరిణి గదుఁ విశ్రుతమగున్. 82

య, మ, న, స, భ, వ.

అంద మందాక్రాంతమనువృత్తము.—

చెందెం బాదాంబుజరజముచే స్త్రీత్వ మూరాతికిం జే
యందెం జాపం బిరుతునుకలై యద్భుతం బావహిల్లఁ
మ్రందె న్మారొడ్డి దశముఖుఁడుఁ రాముచే నంచుఁ జెప్పఁ

1 యమనసభవస్ఫురితమై - ఛా. ము. అక్షరలోపము.

మందాక్రాంతన్ మభనతతగా మండితా శాయతుల్గాన్. 83

మ, భ, న, త, త, గగ.

అంద శాలాశదశమనువృత్తము —

పదునయిదులఘువులును బరఁగ గగ మొందన్
బదియగు నెడ విరతులు బలసి పాదపూర్తిన్
పొదలి హరినుతులఁగడుఁ బొలుపగుచుఁ జాలా
శదశి మనఁబరఁగుఁ గవిజనులు గొనియాడన్. 84

15 లఘువులు గగ.

అంద పృథ్వీయనువృత్తము —

జనంబులు జసంబులున్ యలగసంగతిన్ సాంగమై
పొసంగ నమృతాంశుభృద్యతులు పొందఁ బాదంబులై
బిసప్రసవలోచనా. వినుముపృథ్వినాఁ బృథ్విలో
నసంశయమగున్ భవద్వినుతులందు నింపొందినన్. 85

జ, స, జ, స, య, లగ.

అంద హరిణియనువృత్తము.—

జరగు నసమప్రోద్యద్రేఫల్ ససంగతమై లగల్
దొరయఁగ మురద్వేషిన్ సద్భక్తితో వినుతించెదన్
సరసిరుహగర్భేశానాదిత్యసత్తము నన్నచో
హరిణి యనివృత్తం బొప్పారున్ బురారి విరామమై. 86

న, స, మ, ర, స లగ.

పదునెనిమిదవధృతిచ్ఛందంబునందు మత్తకోకిలయనువృత్తము. ..

ఒక్కచేత సుదర్శనంబును నొక్కచేతను శంఖమున్
ఒక్కచేతఁ బయోరుహంబును నొక్కచేత గదం దగన్
జక్కదం బగుమూర్తికిన్ రసజాభరంబులు దిగ్యతిన్

---

1. హరిణియనువృత్త (భ)

ముక్కవం దగఁ జూడి రార్యులు మత్తకోకిలవృత్తమున్ 87

ర, స జ జ, భ, ర.

అంద కుసుమితలతావేల్లితయనువృత్తము —

శ్రీనాథున్ బ్రహ్మాద్యమరవరసంసేవ్యపాదారవిందున్
దీనానాథవ్రాతభరనుగుణోదీర్ణునిం జూడి రోలిన్
గానారూఢాత్ముల్ మతనయయయల్ కామజిద్విక్రమంబై
వీనుల్ నిండారం గుసుమితలతావేల్లితావృత్త మొప్పున్. 88

మ, త న, య, య, య.

పందొమ్మిదవ యతిశృంగిభృందంబునందు శార్దూలవిక్రీడితమనువృత్తము —

పద్మప్రోద్భవసన్నిభుల్ మసజసప్రవ్యక్తతాగంబులన్
బద్ధాప్తాంచితవిక్రమంబుగ సముత్పాదింతు రుద్యన్మతిన్
బద్ధాత్మాయనిజాంఘ్రిసంశ్రితమహాపద్మాయ యోగీంద్ర హృ
త్పద్మస్థాయ నమోస్తు తే యనుచు నీశార్దూలవిక్రీడితన్. 89

మ, స జ, స, త, త, గ.

అంద తరళమనువృత్తము.—

జలరుహాహితసోదరీముఖ చంద్రచంద్రిక లాదటన్
గొలఁదిమీఱఁగ లోచనంబులఁ గ్రోలి యొప్పుమహాసుఖున్
బలుకుచో నభరంబులుం బిదపన్ సజంబు జగంబులున్
దెలుపుగా దరళంబునోలి రచింతు రంధకజిద్యతిన్. 90

న, భ, ర, స, జ, జ, గ.

అంద మేఘవిస్ఫూర్జితమనువృత్తము.—

రమానాథున్ నాథున్ యదుకులశిరోరమ్యరత్నాయమానున్
సముద్యత్తేజిష్ణున్ దనుజయువతిస్ఫారహారాపహారున్
మిముం బ్రీతిం జేర్కొంద్రమణవిరతిన్ మేఘవిస్ఫూర్జితాఖ్యన్

1 రమానాథున్ గృష్ణున్ యదుకుల (భ)
రమానాథున్ నాథున్ (సులక్షణసారపాఠము)

గ్రమునంబొప్పఁ జెద్దల్ యమనసములుఁ రాగముల్గాముకుందా.

య, మ, న, స, ర, ర, గ

అందు భూతిలకమనువృత్తము.—

వాఁడె వధూమణి చూడవే త్రిదివద్రుమంబు ధరిత్రికిన్
బోఁడిమి దెచ్చినసూరుఁ డీతనిఁ బోలరే రిల నెవ్వరున్
వీఁ డధికుం డని భీమవిక్రమవృత్తి భూతిలకం బగున్
వేఁడి నుతింతురు భారసంబుల వెంట జాగము లొందఁగాన్.

భ, భ, ర, స, జ, జ, గ.

అందు చంద్రకళయనువృత్తము.—

వీనులారఁ బ్రసిద్ధపదంబుల్ వేడుకఁ గూర్చి దిశాయతిన్
గాన వచ్చి రసాతలజంబుల్ గల్గ దిటంబుగఁ జెప్పఁగన్
జానకీవదనాంబుజశశ్వత్సౌరభలోలమధువ్రతా
దానవాంతక చంద్రకళావృత్తంబు సభం గడు నొప్పగున్.

ర, స, స, త, జ, జ, గ.

ఇరువదియవ కృతిచ్ఛందంబునందు మత్తేభవిక్రీడితమనువృత్తము.—

భవరోగప్రవినాశనౌషధకలాప్రావీణ్యగణ్యుండు శై
లవిభేదిప్రముఖాఖిలామరదరోల్లాసుండు గోవిందుఁ డం
చు వివేకుల్సభరంబులు న్నమయవస్తోమంబు గూడన్ సమ
ర్థవిధిం జెప్పుదు రాత్రయోదశయతి న్మత్తేభవిక్రీడితన్. 94

స, భ, ర, న, మ, య, వ.

అందు అంబురుహమనువృత్తము.—

శారదతుషారపటీరమరాళసుధాసమానమహాయశా
నీరదభృంగతమాలదళాసితనీరజేంద్రమణిద్యుతీ

హారకిరీటముఖాభరణాంచిత యంచు శ్రీసతిఁగూర్చి భా
భారసవంబుల భానువిరామముఁ బల్క నంబురుహాం బగున్.

భ, భ, భ, భ, ర, స వ.

అందు ఉత్పలమాలయనువృత్తము.—

శ్రీరమణీముఖాంబురుహసేవనషట్పద నాథ యంచు శృం
గారరమేశ యంచు ధృతకౌస్తుభ యంచు భరేఫనంబులన్
భారలగంబులుం గదియఁ బల్కుచు నుత్పలమాలికాకృతిన్
గారవ మొప్పఁజెప్పుదురు కావ్యవిదుల్ యతితొమ్మిదింటఁగాన్

భ, ర, న, భ, భ, ర, లగ.

అందు ఖచరప్లుతమనువృత్తము —

వరద కేశవ దైత్యవిదారీ వారిజనాథ జగన్నిధీ
కరుణఁ జూడుము మమ్ముఁ బ్రసన్నాకార హరీయనిపల్కినన్
వరుసతో నభభంబు మసావల్ వాలఁగ రుద్రవిరామ మై
యరుదుగా మునిపుంగవవర్ణ్యంబై ఖచరప్లుత మొప్పగున్.

న, భ, భ, మ, స, స, వ.

ఇరువదిరెంట ప్రకృతిచ్ఛందంబునందు చంపకమనువృత్తము.—

త్రిభువనవంద్య గోపయువతీజనసంచితభాగధేయ రుక్
ప్రభవసముత్కరోజ్జ్వలశిరస్థితరత్నమరీచిమంజరీ
విభవసముజ్జ్వలత్పదరవింద ముకుంద యనంగ నొప్పు[1]నా
నభములు జాజరేఫములుఁ జంపకమాల కగున్ దిశాయతిన్.

న, జ, భ, జ, జ, జ, ర.

అందు స్రగ్ధరయనువృత్తము.—

శ్రీలంబై శైలవిశ్రాంతిని మునియతినిం
దేజరిల్లున్ దృఢంబై

---

1. 'నాజభములు'-అని గణాసూత్రముగా రచితము. నజభములనియే గ్రహింపవలయు.

చెల్లం జెల్లె మకారాంచితరభనయయల్
చెంద మీఁదన్ యకారం
బుల్లం బారన్ బుధారాధ్య సురగణయసున్
యోగివంద్యుం గదున్ రం
జెల్లంజేయం గవీంద్రుల్ జితదనుజగురుం
జెప్పుదుర్ స్రగ్ధరాఖ్యన్. 99

మ, ర, భ, న, య, య, య.

అందు వనమంజరి యను వృత్తము.—

హరి పురుషోత్తమ కృష్ణకృపానిధి యాదిమూలమ యంచు నా
కరిపతి పల్కఁగఁగాచె నితం డని కౌతుకంబునఁ బల్కరన్
జరగుఁ ద్రయోదశవిశ్రమముల్ నజజాజభాంచితరేఫలన్
మరుగురునిం బ్రణుతింతు రిలన్ వనమంజరిం గవిపుంగవుల్.

న, జ, జ, జ, జ, భ, ర.

అందు మణిమాల యను వృత్తము.—

శరణాగతార్తిహర నాంబుజాతదళసన్నిభాంబక యంగా
కరుణాసముద్ర జగదాదికారణ పురాణమూర్తి యనుచున్
వరుసన్ సజత్రితయమున్ ద్రివారమొనరున్ సకారముతుదిన్
దిరమొందదిగ్యతిఁ గవుల్నుతింప మణిమాలవృత్తమమరున్.

స, జ, స, జ, స, జ, స.

అందు లాటీవిట మను వృత్తము:—

- సగణంబులు నాల్గిటిపై మతయల్ సమ్యగ్భావంబై యరుదేరన్
బగలింటికి నేలిక యెవ్వఁడు నా భావింపంగా [1]భాసురభంగిన్
మిగులన్మధురంబగు శబ్దములన్ విశ్రాంతిన్ లాటీవిటవృత్తం

---

1 మూ. ము. నమ్యోగ్యవదుల్ గణభంగము. ఈ పాఠముఁ దుదగురు వొకటి లోపించుటయే కాక, మూఁడవపాదమున యతిభంగము. పై శుద్ధపాఠము తటస్థిందును గాన సవరింపఁబడెను.

బగు నిందుకళాధరసన్నుతనామాంకా శంకాంతంకవిదారీ! 102

స, స, స, స, మ, త, య.

ఇరువదిరెండవ యాకృతిచ్ఛందంబునందు మానిని యనువృత్తము.—

క్రొన్నెలపువ్వను గోటిలపాఁగయుఁ
గూర్చినకెంజడకొప్పునకున్
వన్నెయొనర్చినవాహిని యాతని
వామపదంబున వ్రాలె నన్
చెన్నుగ నద్రిభసేవ్యగురు న్విల
సిల్లు రసత్రయ చిత్రయతుల్
పన్నుగ నొంటఁ బ్రభాసురవిక్రమ
భంగిగ మానిని భవ్యమగున్. 103

భ, భ, భ, భ, భ, భ, భ, గ.

అంద మహాస్రగ్ధర యనువృత్తము —

కొలిచెం బ్రోత్సాహవృత్తిం
గుతలగగనముల్ కూడ రెండంఘ్రులం దా
బలిఁ బాతాళంబు చేరం
బనిచెఁ గడమకై పాపురే వామనుం డ
స్ఖలితాటోపాధ్యుఁ డంచుం
గరిగిరివింమాకార మారన్ సతాన్
జ్వలనోద్యద్రేఫయుగ్మా
క్షయగురుల మహాస్రగ్ధరం జెప్ప నొప్పున్. 104

స, త, త, న, స, ర, ర, గ.

అంద భద్రకమనువృత్తము.—

ఆది భఁ జేసియవ్వలరనద్వయంబునొగిమూఁడుతానములన్

కాదుకొనంగ నొక్కగురువొందఁగఁ బై విరతిరుద్రసంఖ్యనిడినన్
గాదనరాదుభద్రకమునాఁగ గాథకు గువృత్తమొప్పుఁగృతులన్
శ్రీదనరార నాశ్రితవితానచింతితఫలప్రదాన నృహరీ! 105

భ, ర, న, ర, న, ర, న, గ.

ఇరువదిమూఁడవ వికృతిచ్ఛందంబునందు కవిరాజవిరాజితమను వృత్తము.—

కమలదళంబులకై వడిఁ జెన్నగు
కన్నులు జారుముఖప్రభలున్
సమధికవృత్తకుచంబులు నొప్పఁగ
శైలరసర్తువిశాలయతిన్
సముచితనాన్వితషడ్జలగంబుల
జానుగఁ బాడిరి చక్రధరున్
రమణులు సొంపలరం గవిరాజవి
రాజితమున్ బహురాగములన్. 106

న, జ, జ, జ, జ, జ, జ, లగ.

అంద అశ్వలలితమను వృత్తము.—

ఇనవిరమంబున న్నజభజంబులింపుగ భజంబులున్ భవములై
చనఁ జన నొప్పునశ్వలలితంబు సత్కృతులఁ జెప్పఁగా విశదమై
యనుపమవైభవోజ్జ్వల హరీ సహస్రకరదోర్విదారణచణా.
నినుఁగొనియాడధన్యుఁడగుదయ్యనీకరుణదాననంతముగుటన్.

న, జ, భ, జ, భ, జ, భ, వ

అంద పద్మనాభము వృత్తము.—

మున్నెవ్వరున్ లేనికాలంబునన్ సృష్టి
మూలంబుగాఁ బద్మగర్భున్ సృజించెన్
మున్నీటిలోఁ బాఁపతల్పంబు పై వెన్ను
మోపెం ద్రిలోకంబులుం గుక్షి నుండన్

ఎన్నంగ నీతం డనాద్యంతుఁ డంచుఁ ని
    రీక్షింతు రెవ్వారి వాఁ డెల్లనాఁడుఁ
నన్నేలు నా నర్కవిశ్రాంత మై పద్మ
    నాభం బగుఁ ద ప్తతంబు ల్గగంబున్. 108

త, త, త, త, త, త, త, గగ.

ఇరువది నాలుగవ సంకృతిచ్ఛందంబునందు అష్టమూర్తియను వృత్తము —

శ్రీనాథుఁ సరసిజాక్షుఁ సితసరోజాతనాథుఁ
    జితనిశాటవరేణ్యుఁ
గానోదంచితరసజ్ఞుం గరిభయధ్వాంతభానుఁ
    గనకవస్త్రవిలాసుఁ
జానొంద న్మనతయుక్తిన్ సరభజల్ యాంతమై కుం
    జరయతిద్వయ మొప్పం
గా నిల్లింపెసఁగఁ జెప్పం గవిజనం బష్టమూర్తిఁ
    [1]ఘనసమాగమరీతిన్. 109

మ, న. త, న, ర, భ, జ, య.

అంద నరసిజమను వృత్తము —

మాలిం బిల్లంగోలాకచేత
    న్మతియొకకరమున మణిమయలతయుఁ
బాలక్రేణు ల్మోలి వసింపఁ
    బసులనొదిగి చనుపసగల ప్రభువుఁ
జాలం గొల్వంజాలినకోర్కుల్
    సఫలములగునసరసిజముమరుఁ

---

1. తా. ము. ఘనసమామ్నాయరీతిఁ గజతంగము.

బోలఁ [1]బ్రహ్మావ్యాళవిరామ
స్ఫురదురుమతయనములు నననసలున్. 110

మ, త, య, న, న, న, స, ల.

అంద క్రౌంచపదము వృత్తము.—

కాంచనభూషాసంచయ మొప్పఁ
ఘనకుచభరమునఁ గవ్వ నసియాడఁ
జంచలనేత్ర ల్వంచనతోడఁ
సముచితగతి వెనుచని తనుఁగొల్వఁ
అంచితలీల న్మించినశౌరిఁ
హరిదిభపరిమితయతు లొనఁ గూడఁ
ముంచి రచింపం గ్రౌంచపదం బి
మ్మైంగి భమసభననముల నయలొందున్. 111

భ, మ, స, భ, న, న, న, య

ఇరువదియాఱవ యుత్కృతిచ్ఛందంబునందు బంధురము వృత్తము.—

ఋభువులు దితితనయులు సమబలులై
యెంతయు మత్సరము ల్బెరయఁ
రభస మలరఁ గలశనిధిఁ దఱవఁగం
గ్రక్కునఁ గవ్వపుఁగొండకు నీ
ప్రభు వనువుగఁ గుదురుగ నిలిచె ననం
బంచదశాతురవిస్రమమై
ప్రభ మిగులఁగ మిగులఁగ నననసభభభగల్

---

1. పూ. ము. బ్రహ్మభోగివిరామ యీవృత్తమందు మొదటిమూఁడు పాదములందు ఆఱవ స్థానమునఁ బ్రాసయతి పాటింపఁబడియున్నది. నాలవ పాదమున బ్రాసయతి తప్పినదిగాన సవరింపఁబడ్డది.

బంధురవృత్తము చెప్పఁదగున్. 112

న, న, న, న, న, భ భ, భ, గ.

అందు భాస్కరవిలసితమను వృత్తము.—

గోపనికరముల నేలినవానిఁ
గోవృషదనుజుల నడఁచినవానిఁ
గోపికలను భ్రమయించినవానిఁ
గుబ్జకు విలసన మొసఁగినవానిఁ
గోపకులము వెలయించినవానిఁ
గోష్పద మని బుధు లినయతిఁ బల్కన్
ప్రాపుగ భనజయభాశ్రితనాసల్
భాస్కరవిలసిత మగు గురుయుక్తిన్. 113

భ, న, జ, య, భ, న, న న, గ.

ఇరువదియాఱవయుత్కృతిచ్ఛందంబునందు భుజంగవిజృంభితమనువృత్తము.—

స్వారాజారివ్రాతారాతీశశితపనసుమనయన
సర్వదామునివందితా
గౌరీశాద్యామర్త్యస్తుత్యాకమలభవజనక మధు
కైటభాసురమర్దనా
శ్రీరామాహృత్స్వామీ యంచుఁ దెలఁగి మమతననలఁ
చెంద రేఫసలుఁ లగఁ
ఘోరాఘౌఘాభిద్వేషిం దేర్కొనఁగ వసుదశయతియు
గుఁ భుజంగవిజృంభితన్. 114

మ, మ, త, న, న, న, ర, స, లగ.

అంద మంగళమహాశ్రీయను వృత్తము.—

చిత్తములఁ జూపులను జిత్తజునితండ్రిపయిఁ
బెంది గజదంతియుతు లొందఁగా
నృత్తములతోడఁ దరుణీమణులు గానరుచు
*లింపుగను మంగళమహాశ్రీ
వృత్తములఁ బాడిరి సవృత్తకుచకుంభముల
వింతబిగి యొంతయుఁ దలిర్పఁగా
మత్తిలుచు నబ్జజననంబు లిరువోటులఁ ద
నర్పఁగఁ దుదఁగా గగ మెలర్పన్. 115

భ, జ, స, న, భ, జ, స, న, గగ

ఇది సమవృత్తభేదములు.—

వ. మఱియు నర్ధసమవృత్తవిషమవృత్తంబు లెట్టివనిన.—

క. ధర నొకటియు మూఁడును నగు
చరణంబులు మఱిద్వితీయచాతుర్థికవి
స్ఫురితాంఘ్రులుఁ దమలోనను
సరి యగునర్ధసమవృత్తచయమునఁ గృష్ణా! 117

గీ. జరగు నందు స్వస్థానార్ధసమమనంగ
ఛంద మొకటన నిట్టిలక్షణముదగుల
నమరు నట పరస్థానార్ధసమము నాఁగ
నొలమిఁ దరువాతి ఛందంబు గలయఁ గృష్ణ. 118

సీ. విషమవృత్తంబులు వెలయఁబాదంబుల
గణములు వేర్వేఱుగా నొనర్ప
నవియు స్వస్థానంబు నటపరస్థానంబు
సర్వపరస్థానసంజ్ఞకంబు

---

* యతిభంగము.

నొక్కఛందంబున నొగిఁ గొని పాదముల్
వేఱైన స్వస్థానవిషమ మయ్యె
నొకపాద మొక్కట నున్న పాదంబులు
క్రిందటిచందంబునందు నైన
తే. మీఁది చందంబునందైన మెఱయఁ జెప్ప
నవి పరస్థానవిషమవృత్తాహ్వయములు
రెండు సర్వపరస్థానవిషమమునకు
నన్నియునుఁ జెప్ప ఛందంబు లబ్జనాథ. 119

స్వస్థానార్ధసమవృత్తములలో నారీప్లుతమను వృత్తము.—

క్షీరోదన్వన్మధ్యగేహా! మతా గా
హారంబు నుద్యత్తతజ ల్గగంబుల్
బూరింపంగాఁ బాదముల్ రెంటరెంటన్
నారీప్లుతం బయ్యె ననంతమూర్తీ! 120

పరస్థానార్ధసమవృత్తంబులలో మనోహరమను వృత్తము.—

త్మారాజ రమేశ తజావము లు
ద్ధుర మైనసకారచతుష్కములోఁ
గూరంగ సగంబులు గూడి మనో
హరవృత్తము చెల్వగు నద్రిధరా! 121

స్వస్థానవిషమవృత్తంబులందు అంగజాస్త్రమను వృత్తము.—

భూరిభమంబుల్ పొందు సగం బిం
పారఁగ నర్ధంబై యటపాదుల్
గౌరీ వి న్మసజంబు గాంతమై
యారూఢం బగు నంగజాస్త్రమున్. 122

అందు వరాంగియను వృత్తము.—

సరిత్పదాబ్జా జతజల్ గగల్ బం
ధురం బగుఁ బెంటఁ జతుర్థకాంఘ్రిఁ
గారాముతోఁ దాజగగల్ వరాంగిఁ
హారార్చితా మూఁడవయంఘ్రి నొందున్. 123

అందు నదీప్రఘోషయను వృత్తము.

నాగతల్పా మొద ల్నాల్గు రేఫంబులుఁ
జగన్నివాసా జతజంబు రేఫయుఁ
దగంగ నమ్మూఁడుపదంబులందు జా
తిగాఁ బ్రవర్తించు నదీప్రఘోషముఁ.[1] 124

పరస్థానవిషమవృత్తంబులందు శ్రీరమణము వృత్తము —

ధాత్రి భమంబుల్ తత్సగ మాదిఁ
భత్రయగాగణపద్ధతి మూఁటఁ
గోత్రధరా యిటు గూర్పఁ బదంబుల్
చిత్రగతిం జను శ్రీరమణంబుల్. 125

అందు రథగమనమనోహరము వృత్తము.

రథగమన మనోహరంబు రెండవంఘ్రిఁ
ప్రథితం బగుఁ సజజంబు రప్రయుక్తయంబుఁ
ప్రథమపదమునందుఁ బైసగంబున దుఁ
గథితననరజంబు గద్వయంబుఁ గృష్ణా! 126

సర్వపరస్థానవిషమవృత్తములందు వీణారచనము వృత్తము.—

వీణారచనం బయ్యె భువిఁ దయసాగల్
బాణప్రహారా తజనభభయ్యగగంబుల్

---

1. తా. ము. నదీప్రఘోషా - గణభంగము.

చాణూరహరా తజనభస లొప్పఁగ యతిన్
వేణుధర భనభసవిశ్రుత మగుచున్. 127

ఇత్తెఱంగు గాక చతుర్వృత్తంబులలో పంచపాది యను వృత్తము.

క. పాదచతుర్వృత్తంబున
నాదరమునఁ బంచపాది యనువృత్తం
బై దవపదంబు గలిగిన
మాదయితా కృతులయందు మహనీయ మగున్. 128

ఉ. శ్రీసతిఁ జేరువంబున ధరించినభోగి చతుర్ముఖుండు నా
భీసరసీరుహంబునకు బిడ్డఁడుగా విలసిల్లు మేటి కై
లాసనగాలయుండు జడలన్ సవరించిన యేటిపుట్టినిల్
భాసురపాదపద్మ మగుబల్లిదుఁ డివ్విభుఁ డంచు సన్నుతుల్
సేసిరి సన్మునీంద్రు లనఁ జెన్నగువృత్తము పంచపాది యై.

క. పొసఁగఁగ నిఱువదియాఱు
నక్షరములకును నధిక మగుచుఁ జరణంబుల ను
ద్ధురమాలావృత్తంబులు
జరగు లయగ్రాహి మొదలు జలరుహనాభా! 130

విశోపచత్వారింశ త్పాత్రాగర్భితంబుఁ ద్రింశదక్షరంబు నైన
లయగ్రాహి —

ఎందు నిల దేజనులకుం దలఁపరానితప
మందికొనిచేసిరొకొ నందుఁడు యశోదా
సుందరియుఁ బూర్ణనిధిఁ బొందిరి కదుం దొరసి
పొందగునుముప్పొతటి నందనునిగా శ్రీ

మందిరుని నంచు నిటు లందముగఁ బ్రాసములు
గ్రందుకొని చెప్పుమునిబృందము లయగ్రా
హిం దనర నబ్భజసలుం దగ నకారమును
బొంద నిరుచోట్లని బిఱుంద భయ లొందన్. 131

పంచచత్వారింశన్మాత్రాగర్భితపాదంబును చతుస్త్రింశదక్షరంబు నయిన లయవిభాతి

పదయరె తనూభవులఁ బడయుదురు గాక పెర
పడఁతులును భర్తలును బడసిరె తలంపన్
బుడమి నలనందుఁడునుబడఁతుక యశోదయును
గడుపున జగత్త్రయము నిడికొనినపుత్త్రున్
బడసిరఁట యంచు బెడఁ గడరునసత్రివృతి
గడనసగముల్ పొసఁగ నిడ లయవిభాతిన్
నొడువుదురు సత్కవు లెపుడును విరితేనియలు
వడియు పగిదిన్ రసము కడలుకొనుచుండన్. 132

పంచచత్వారింశ న్మాత్రాగర్భితపాదంబును సప్తత్రింశదక్షరంబునగు లయహారియను వృత్తము.—

చదువులును గిదువులును జదువ ధన మొదవు నని
మదిఁ దలఁపవలదు మును చదివిరె ధరిత్రిన్
[1]పదములినహృదయుఁ దనఁ బొదలుదితిసుతసుతుఁడు
మొదలఁ బలికినపలుకు జదువఁగ ముకుందుం
డద నెఱిఁగి కడిసెఁ గద! చదివినభృగువుకొడుకు
చదువుతుది నొకపనికి నొదవెనె యటంచున్

1. భా. మూ. పదములు. పదయుగుల పాఠాంతరము.

పదునొకండు నగణములు గదిసి సగణయుతము భువి
విదితముగ బుధులు వలుకుదురు లయహారిన్. 183

అందు [1]త్రిభంగియను వృత్తము.[2] ..

ననన నసస లును భమసగలును
దనరి నటింపఁ గణాంకన్ నలువంకన్ బెంపుదొలంకన్
మునుకొని నఖముఖమున వెడఁగదలుపఁ
జనుఁ గడునొప్పగువీణల్ నెరజాణల్ వేలుపుగాణల్
వనరుహ జనితుని తనయులు మొదలుగ
ఘనమతులాదటతోడన్ శ్రుతిగూడన్ వెన్నునిఁ బాడన్
వినఁగలిగిన నదిజననము ఫలమని
మునిజను లిందు శుభాంగున్ దగుభంగిన్ జెప్పఁ
ద్రిభంగిన్. 184

అందు అతియతాక్షరంబైన దండకము.—

సిరి నేలురసికుండు శ్రీవత్సవక్షుండు నీరేరుహాక్షుండు నిత్యా
సద్వృత్తుండు త్రైలోక్యసంరక్షణోపాయదక్షుండు మాపాలి

---

1. వ్రా. ము. ననననననసనసభమసగలును, దనరి నటింపఁ గణాంక నలువంకం బెంపుదొలంకన్, మునుకొని నఖముఖములం వెడఁగదలుపఁ జను గడునొప్పగువీణ నెరజాణ ల్వేలుపుగాణల్, వనరుహజనితునితనయులు మొద లంగ ఘనమతు లాదట తోడ శ్రుతిగూడ న్వెన్నునిఁ బాడన్, వినఁ గలిగిన నది జననముఫల మని మునిజను లిందు శుభాంగుఁ దగుభంగిఁ జెప్పఁ ద్రిభంగిన్ 2. లయగ్రాహి మున్నగు పద్యములకుఁ జెప్పినట్లు త్రిభంగి పద్యము నకుమందు ద్విచత్వారింశ త్పాత్రాగర్భితంబును జతుస్త్రింశదక్షరంబునగుయిన త్రిభంగి యని యుండవగు (భ)

దేవుండు ధీరుం డుదారుం డితం డిచ్చు మాయిచ్చకు న్వచ్చు
సౌఖ్యమ్ము లంచు న్మదిం గోరి పెద్దల్ సకారంబుతో సంగ
తంబై నహం బాది నొండేఁ దకారాదిగా నైన; లో నెల్ల
చోటం దకారంబులం బెల్లు చెందం గకారావసానంబు నై
దండకాకార మేపారఁ గీర్తింతు రెల్లప్పుడున్. 135

గద్యము. ఇది శ్రీవాణీవరప్రసాదలబ్ధవాగ్వైభవ తిక్కనామాత్య తనుసంభవ సుకవిజనవిధేయ అనంతయనామధేయప్రణీతంబైన ఛందోదర్పణంబునందు నుభయభాషానురూపంబు లగు గద్యపద్యంబుల విధంబును షడ్వింశతిచ్ఛందోనామంబులును, తదుద్భవంబు లగుసమవృత్తంబులును వృత్తమిశ్రంబు లగు నర్ధసమవిషమవృత్తంబులును, ఛందోఽతిరిక్తంబు లగుమాలావృత్తంబులును, తద్భేదం బగుదండకంబు నన్నది ద్వితీయాశ్వాసము.

---

శ్రీ ర స్తు.

# ఛందోదర్పణము

## తృతీయాశ్వాసము.



మదనంతశయన భవ
భీమదహన నిఖిలవారణభీషణవర్షా
సామజభీతినివారణ
కామజనక శిష్టలోకకామితవరదా! 1

కందము.

క. నలగగభజసలు కందం
బుల మూఁడును నైదు షష్ఠముల నలజలు బే
సుల జగణరహిత మంత్యగ
మలఘుపద త్రిగణవిరతి యర్ధముల హరీ! 2

గీ. కంద మరయ నార్యాగీతికడగణంబు
సహషష్ఠంబు గురులఘు లైననార్య
నలఘు లాఱింట గిరిశరస్థలుల నున్న
వగు ద్వితీయ ప్రధానలఘ్వాదియతులు. 3

ఈ చెప్పిన యతినియమంబులు సంస్కృతాదులకయ్యె. మఱియుఁ
దెలుఁగున కెట్లనిన:—

క. వడి యగు నార్యకు రెండవ
యడుగునఁ ద్రిగణంబుమీఁద నంధ్రకవితకు౯

గడపటిపాదమునకు వడి
యుడరును ద్విగణయుతలఘువు కవ్వలిచోటన్. 4

ఆ. వె. సరవిఁ బథ్య విపుల చపలార్య ముఖ జఘ
నాఖ్యచపల లనఁగ నార్య లైదు
నొనర గీతి యనఁగ నుపగీతి యుద్గీతి
యార్యపేరిగీతి యనఁగ నాల్గు. 5

* పథ్యార్య.

క. తేసులు త్రిగణయుతములై
యాసరుపాదములఁ బొరసి యార్య యనఁ గడుఁ
ఖ్యాసిల్లుఁ బథ్య యనఁగా
వాసవముఖసకలదివిజవర్గప్రణుతా! 6

విపులార్య.

క. ప్రకటసమపాదముల నిలు
వక శబ్దమునవలఁ జొచ్చి వచ్చి ననం ద
క్కక విపులార్య యగును సే
వకజనమందార ధీర వనజదళాక్షా! 7

చపలార్య.

క. వరుసను ద్వితీయ మంత్యము
స్ఫురణ న్మధ్యగజకారములును దగఁ [1]రెం
డరయఁగఁ దనర్పు నేని
సవి నదియ హరి మురారి చపలార్య యగున్. 8

---

* ఇందు ఆర్యలు గీతులు సాధారణ కందపద్యములై యున్నవి. ఆర్యాగీతి లక్షణలక్షితములు గావు.

వీని వివరణకు- చూ. గిడుగువారి యుపోద్ఘాతము పు. 26-27.

1 రెండవరిఁ దనర్పు (క)

ముఖచపలార్య.

క. చపలాగణప్రకారం
బపారకారుణ్యసాగరా ప్రథమార్ధం
బపరం బగు*చున్నది ముఖ
చపలార్య యనంగఁ జనును జక్కఁగఁ గృతులన్. 9

జఘనచపలార్య.

క. మొదలిసగము చపలార్యా
స్పదగణలక్షణము నొరసి చరమార్ధం బం
దుదిత ప్రకారరేఖఁ
గదాధరా చనుఁ గృతుల జఘనచపలార్యన్. 10

గీతి.

క. లసదార్య మొదలిసగమున
నెసఁగఁగ రెండరలుఁ జెప్పిరే నదియే గీ
తిసమాహ్వయ మగుఁ గృతులఁ
వసుధాధం కృష్ణ యాదవస్వామి యనన్. 11

ఉపగీతి.

క. ధర నార్యమీఁదిసగమున
నిరుసగమున నట్ల చెప్పి రేని యదియ దాఁ
బరఁగు నుపగీతి యనఁగా
సరసిజదళనేత్ర కృష్ణ శార్ఙ్గధర హరీ! 12

ఉద్గీతి.

క. విదితార్యచరమదళముఁ
మొదలి సగము చేసి యందు మొదలింటిసగం
బది యపరార్ధముఁ జేసినఁ
దాదు వగు నుద్గీతి భుజగభుగ్వరగమనా! 13

* చే న్నది పాఠాంతరము.

ఆర్యాగీతి.

క. కందములకుఁ గలనియమము
లం దేమియుఁ గడమ పడక యదరిన పది యిం
పొందఁగ నార్యాగీతి య
నం దగు ని ట్లురగభూషణప్రణుతగుణా ! 14

సమ విషమగీతులు.

క. అమర మఱిగీతులందు వి
¹షమగీతులు మూఁడు రెండు సమగీతులు నై
సమము లగు నవి కలిప్ర
సముల యతుల విషమములఁ బొసఁగు బ్రావర్లున్. 15

విషమగీతులందు ఎత్తుగీతి.—

ఆదిప్రాసంబు మానియు
నాదిత్యయుగము నగుచు
నీదెసయతుల నెత్తు
²గీదియ నెగడుఁ గృష్ణ. 16

ఉపగీతి.—

ఉపగీతియందుఁ బ్రాసంబు నిలిచి మూఁ
డుపగణంబులమీఁద నమరు విరతి
రవులు మువ్వురును బురందరు లిద్దఱు
నవుల నేఁగు రిటులు నర్ధములకు. 17

తేటగీతి.—

నగణ మొండె హగణ మొండె నగణహగణయుగము
తగిలియుండె సప్తసంఖ్య తత్పదంబు లమరఁ

1 విషమగీతుల - పా. ము. పవరణ (ప) 2 గీదియ-గీతిశబ్ద వైకృతము.

దగఁ జతుర్థగణముపై నుదాత్తవిశ్రమంబు
నిగుడు మేలనాఖ్య గీతి నెరయఁ బ్రాస మొదవి. 18

ఉపగీతులందు ఆటవెలఁది.—

ఇనులు ముగురు పాద నిద్ద ఱింద్రులు మృదం
గములు దాల్ప వంశకాహళాదు
లేగుదర్క లూఁద నిరుమేళగతి నాట
వెలఁది యొప్పుచుండు విష్ణుసభల. 19

తేటగీతి.—

ఒక్కఁ డర్కుఁ డిద్దఱుజిష్ణు లొనర మఱియు
నిద్ద ఱర్కు లిచ్చొప్పున నేగుదేసి
నాల్గువంకలఁ గదిసి వర్ణన మొనర్పఁ
తేటగీతి విష్ణునిపేర్మిఁ దేటపఱుచు. 20

క. పెనఁగి గణత్రియతముపై
నొనరఁగ వడియొండెఁ బ్రాసమొండెను నిలుపన్
జను నాటవెలఁది యందును
ననువొందిన తేటగీతియందు ముకుందా! 21

మఱియు సీసంబులు.—

క. నలనగసలభరతలలో
పల నాలును మీఁద రెండుఁ బద్మాప్తగణం
బులఁ దగి నాలుగుపదములఁ
జెలు వగు నొకగీతితోడ సీసము కృష్ణా! 22

క. సీసము రెండుగణంబులఁ
బ్రాసం బేనియును మఱి విరామం బైనన్

భాసిల్లుఁ బృథివిమీఁదఁ
జేసిననియమములఁ బ్రాససీపాదు లవి. 23

సీ. వృత్తంబులకుఁబోలె వెలయు నాల్గడుగును
ప్రాసముల్నిల్పి విరతులు నునుసుఁ
ప్రాససీసము లగుఁ, బళ్ళిమార్గములట్ల
భాసిల్ల నక్కలిప్రాససీస
మగు, మున్నుగైకొన్న యతిపాదమం దెల్ల
నడరిన వడిసీస మనఁగఁ బరఁగు,
నర్ధమర్ధమునకు యతులు వేఱైచనఁ
జెప్ప నక్కలివడి సీసమయ్యె,

గీ. నవకలికి నిట్లు ప్రాసంబు లవతరిల్లు,
యతులు ప్రాసంబు లిష్టసంగతుల నడవ
నదియ సమసీస, ముత్సాహ తుదనుగిది
పరఁగ విషమసీసం బగుఁ బద్మనాభ! 24

గీ. అగు సమప్రాససీస మాఱడుగులందు,
నాలుగింట వృత్తప్రాసనామసీస,
మన్నిచోటులఁ బ్రాసంబు నందెనేని
సర్వతః ప్రాససీసంబు జలజనాభ! 25

[illegible] సమసీసము.—

ఇంద్రులు తమలోన నిద్దఱిద్దఱుఁగూడి
యతులకు నాధార మై తనర్చి
మూఁడుచోటుల నుండ మొగి నిద్ద ఱర్కులు
గదియ నాక్రియ నొక్కపదము మెఱయ

ఇటువంటిపదము లింపెసఁగంగ నాల్గింట
సమధర్మగతి నతిశయము నొందు
నట్టిధర్మమునకు నాస్పదంబై పేర్చి
యాతతచ్ఛందోవిభాతిఁ దనరి
ఆ. వె. ఆట వెలఁది యొండె. దేటగీతియు నొండె
విమలభావ మమర విష్ణుదేవుఁ
డొప్పు ననుచుఁ బొసఁగఁ జెప్పిన సీసంబు
పసిఁడి యగు ధరిత్రిఁ బద్మనాభ! ౨౬

ప్రాససీసము—
భామినిచే నున్నపట్టుతోరముఁ జూచి
ప్రల్లదంబునఁ ద్రెంచి పాఱవైచి
యామునిద్రోహ మత్యంతమై తనుఁ బట్టి
యతిదరిద్రునిఁ జేయ నార్తి నొంది
భూమి వెల్వడి పోయి పురపురఁ బొక్కుచుఁ
బుండరీకాక్ష యోభువనవంద్య
స్వామి నాయపరాధశతసహస్రంబులు
సైరింపవే కృపాజలధి యనుచు
గీ. ప్రేముడించు కౌండిన్యునిభీతిఁ బాపి
పృథులసౌఖ్యంబు లొసఁగి గాంభీర్యమమరఁ
గాముపైఁ బవ్వళించినప్రభుఁడ వనిన
ప్రాససీసంబు విలసిల్లుఁ బద్మనాభ. ౨౭

వృత్తప్రాససీసము —
శ్రీశ్రితవత్సుండు సింధురవరదుండు
చింతితఫలదానశీలుఁ డితఁడు

ఆశ్రితావనలోలుఁ డాభీరకాంతాకు
    చాగ్రకుంకుమభూషితాంగుఁ డితఁడు
అశ్రాంతజయధాముఁ డాశాంతవిశ్రాంత
    యశుఁడు ధారాధరశ్యాముఁ డితఁడు
విశ్రుతవిభవుండు విపులబలాఢ్యుండు
    వికసితవదనారవిందుఁ డితఁడు
గీ. అనుచు మునులును దివిజులు నభినుతింపఁ
జాఁపుచెవులపాన్పున వెన్ను మోపియుండు
నంబుజోదరుఁ డంచు నిట్లాంధ్రకృతులఁ
జెప్పిరని వృత్తప్రాససీస మగును. 28

సర్వతఃప్రాససీసము.—

నీరదవర్ణుండు నీరేరుహాక్షుండు
    నీరధిబంధనోదారబలుఁడు
కారుణ్యరసరాశి గౌరీరసజ్ఞావి
    హారిశోభితనామగౌరవుండు
ధీరుండు త్రిభువనాధారుండు దశరథ
    క్ష్మారమణేంద్రకుమారవరుఁడు
మారీచదమనుండు నారాచవిద్యావి
    శారదుం డసురవిదారణుండు
గీ. ధారుణీసుత నయనచకోరసరసి
జారి యన సర్వతఃప్రాసచారుసీస
మారయఁగ సత్కవిజనవిస్ఫారనుతులఁ
దేరు శ్రీపద్మనాథ శృంగారసార। 29

అక్కలిప్రాససీసము.—

ఉరగతల్పుని గాని యుల్లంబులో నిల్పు
శరధితల్పుని గాని సన్నుతింప
మురసంహరుని గాని మ్రొక్కులఁ గయిసేయ
నరమృగేంద్రులఁ గాని నమ్మికొలువ
గరుడవాహను పేరుఁగాని వీనులఁ జొన్ప
బురుషోత్తముని గాని పూజసేయ
హరిప్రసాదముఁగాని యర్థిమైఁ గొననొల్లఁ
బరమాత్మునిఁ గాని భక్తిఁ బూన
గీ. ధరణి నివిసాదు నిత్యవర్తనము లనుచుఁ
బరఁగు వ్రతిఁగాని నీవు చేపట్టవనిన
జరుగు నక్కలిప్రాససీసంబు కృతులఁ
బరభృతాతసిపుష్పాభ పద్మనాభ! 80

వడిసీసము.—

కరుణాసముద్రుండు గజరాజవరదుండు
గర్వితాసురశిరఃఖండనుండు
విహగేంద్రవాహుండు విబుధేంద్రవంద్యుండు
విశ్వరక్షాచణవీక్షణుండు
రతిరాజజనకుండు రఘువంశతిలకుండు
రణములోదగ్రుండు రమ్యగుణుఁడు
గోకులాధీశుండు గోపికారమణుండు
గోవిందుఁ డురుకళాకోవిదుండు

గీ. అనుచు వడిసీసముల నిన్ను నభినుతింతు
రఖిలవిద్యావిశారదు లైనమునులు
పన్నగాధీశతల్ప నాపాలివేల్ప
భక్తజనకామ్యలాభ శ్రీపద్మనాభ! 31

అక్కలివడిసీసము.—

పద్మాక్షుఁ డీతఁడే బలి రసాతల మేలు
మని పంపనేర్చిన యధికబలుఁడు
హరిణాక్షుఁ డీతఁడే యలవిభీషణు లంకఁ
బట్టంబుగట్టినబల్లిదుండు
శౌయ్యలి యీతఁడే ధ్రువుని నున్నతపదం
బునఁ బ్రతిష్ఠించిన భూరియశుఁడు
ధవళాక్షుఁ డీతఁడే ధనువు ద్రుంచినయట్టి
రఘువంశ తిలకుండు రాఘువుండు

గీ. బాణబాహావిఖండనప్రముఖుఁ డితఁడు
నీలగళసుప్తికరబాణనిపుణుఁ డితఁడు
ననుచు నక్కలివడిసీస మమర వేల్పుఁ
బడఁతు లభినుతింతురు నిన్నుఁ బద్మనాభ! 32

అంకలిప్రాససీసము.—

వరదుఁ డుద్యద్గుణాకరుఁడు వియన్నదీ
పాదుఁడు భక్తప్రమోదకరుఁడు
సింధుబంధనుఁ డబ్జబంధుతారాధీశ
నేత్రుఁడు కాశ్యపగోత్రజుండు

సుగ్రీవవిభుఁడు దశగ్రీవదమనుండు
లలితకంబుగ్రీవవిలసితుండు
ఫాలనాళీవితనూతనస్తవ్యసా
నాభిలోలుఁడు నిత్యశోభనుండు
ఆ. వె. భువనవంద్యుఁ డనుచు నవకలిప్రాసరీ
సముల నిన్నుఁ బొగడు నమరసమితి
శరణభరణనిపుణ వరయోగివిమలహృ
త్పద్మసద్మ దేవ పద్మనాభ! 33

విషమసీసము.— (మఱియు నుత్సాహము)

సాహచర్య మమర సప్తసవితృవర్గమును సము
త్సాహ మెక్క నొక్కగురుఁడు చరణములు భజింపఁగా
నీహితప్రదానలీల లెసఁగుకమఠమూర్తి ను
త్సాహరీతు లుల్లసిల్ల సంస్తుతింతు రచ్యుతున్. 34

ఆ. వె. ప్రాసములును వడులు భాసురంబుగ నిట్లు
విలసితముగ నాటవెలఁదియందు
నుత్సుకత నొనర్చి యుత్సాహ మది నిల్పు
విషమసీస మమరు విషధిశయన! 35

క. ద్వాదశపదమగు మఱి య
ష్టాదశపాదయగు గీతి సహితంబుగఁ దా
నేదియగు సీసమాలిక
శ్రీదయితా నిలుపవలయు సీసపునియతిన్. 36

క. సర్వలఘుసీసమునకు న
ఖర్వాంఘ్రులనడుమ నింద్రగణములు [1]మూఁడై

---

1 మూడై (క)

యార్వంచలఘుగణంబులు
సుర్వీధర త్రిలఘుయుగము నొకగీతితుదన్. 37

**సర్వలఘుసీసము.—**

మృగమదము తిలకమును నగు మొగము చెలువమును
నలఁతిపవడముఁ దెగడు నధరపుటము
వలుదజఘనములు బోలుపలరుకనకభువలువ
కలితకరచరణమణికటకములును
విరులతురుమును నమిలిపురిసొబగునుకరికము
రచన నెసఁగినచెవులరవణములును
కరకమలయుగళధృతమురళియును ద్రివిధమగు
నిలుకడయు నిటలతటి నెఱియుకురులు
గీ. తెల్లదమ్మిరేకులభంగి నుల్లసిల్లు
వెడఁదకన్నులు గలగోపవేషశౌరి
నాశ్రయించెద ననుచు నిట్లమరఁ జెప్పు
సర్వలఘుసీస మగు నంద్రుజలజనాథ ! 38

**తరువోజ.—**

ముగురు జిష్ణులు త్రయీమూర్తియు మఱియు
ముగురు జిష్ణులు త్రయీమూర్తియుఁ గూడి
యొగి నుండ *గిరియతి నొక్కొక్కచరణ
ముదుగక సేవింప నుజ్జ్వలం బగుచుఁ
దగ నుల్లసిల్లు పాదములు నాల్గింటఁ
దనరు వరాహావతారోదయునకు

---

* గిరియతి - వ్రా మ 'కరయతి' యను పాఠమును శ్రీ వద్దమూడి గోపాలకృష్ణయ్యగారు చూపిరి

యొగి రెంటయతులు మూఁడొక్కొక్క చరణ' అని సవరించిన వర్ణవ్యాప్తి కనుగుణముగా నుండును.

నిగురొత్తు భావంబు లెసఁగఁ దర్వాణి
నీరోజ నొనరింతు రెల్లసత్కవులు 39

మఱి యక్కరజాతులందు మహాక్కర —

ఆదివార మాదిగ ననుక్రమమున
నన్ని వాసరముల నొక్కనుండు
నాదితేయాధినాథు లేగురు నల
రారంగ నొక్కసుధాకరుండు
నాది హరిఁ గొల్వ రెండును నాలుగు
నగు వాసరంబున నర్కుఁడైన
నాదరంబున నెడసొచ్చు*నని మ
హాక్కరం బలుకుదు రార్యు లెల్ల. 40

మధ్యాక్కరము —

ఓజతో నిద్దఱింద్రులును నొక్కయాదిత్యుండు మఱియు
రాజితంబుగ నిద్ద ఱమరరాజులు నొక్కసూర్యుండు
పూజింతు రత్యంతభక్తిఁ బుండరీకాక్షు ననంతు
భ్రాజిల్లు బుధులు మధ్యాక్కరంబు నొప్పారఁ బల్కుదురు.

మధురాక్కరము.—

రవియు నింద్రులు మువ్వురు రాజొకండును గలసి
రవిసుధాకరలోచను రాజితాననసరోజు
రవికులేశుఁ గొలుతు రని ప్రస్తుతింతురు ధరిత్రి
నవిరళం బగుమధురాక్కరాఖ్యచే సత్కవులు. 41

అంతరాక్కరము.—

ఇనుఁ డొకండును నింద్రు లిద్దఱును నొక్క
వనజవైరియుఁ గూడి వైభవ మొనర్ప

---

* ఇందు గణభంగమని కొందఱ యభిప్రాయము. ఇందు ఇంద్రగణమునకు మాఱు సూర్యగణ మున్నది. ఇట్లు నుండవచ్చు. చూ. లక్షణము, క్రొత్తకూర్పు సవిమర్శ.

గనకవస్త్రుని గృత్తకైటభుని గొల్తు[1]
రనుచుఁ జెప్పుదు రంతరాక్కర బుధులు. 43

అల్పాక్కర.—

ఒగి నిద్దఱింద్రులు నొకవిధుండు
జగతీధరుని పదాబ్జములు గొల్తు
రగణితభక్తి నం చభినుతింప
నెగడు నల్పాక్కర నియతితోడ 44

అక్కరలయతినిర్ణయము.—

విరతిచతుర్గణము మహా
క్కర కోనాఁడుర త్రిగణ మంతరకుఁ
వరగణయుగయతి నల్పా
క్కర మధ్యయుమధురయుం ద్రిగణయతుల వారి! 45

మంజరి షట్పద —

మెఱయంగ నిద్దఱి
ద్దఱు సురేంద్రులుమూఁడు
తెఱఁగులఁ శశిఁగూడ నర్ధంబులఁ
నెఱిఁ గ్రాలఁగా వల్లు
దొలుఁగ షట్పదరీతి
వఱలుఁ జక్రిపదాబ్జవర్ణనంబు 46

త్రిపద.—

సరసిఁ బ్రాసమునొంది సురపతుల్ నలువురు
హరియు నైకార్కులు కలియ
*జరగు నిప్పగిది నైత్రిపద. 47

---

* జరగ నిప్పగిదినొప్పుఁ ద్రిపద-గ్రంథాంగము. పూ. ము.

1. గొలుతు - త్ర. ము. గ్రంథాంగము.

మఱి ద్విపద —

ఇంద్రులు మువ్వురు నినుఁ జొక్కరుండు
సాంద్రమై యొక్కొక్కచరణంబుఁ గొలువ
నలరుఁ బద్మోదరుఁ డంచు ధీరోత్త
ములు విస్తరింతురు ముదముతో ద్విపద. 48

మంజరీ (ప్రాసరహిత) ద్విపద —

శ్రీమందిరాకారు జితదైత్యధీరుఁ
గీర్తించుచోఁ బుణ్యవర్తనుం డనుచు
యతిమాఱుప్రాస మిట్లచోట్ల నిడక
సరసిజనాభాయ సముదగ్రసాహ
సాయ నమోయంచు శబ్దమొక్కటియు
రెండుపాదముల నీక్రియఁ బంచియిడక
వెలయు ప్రాసములేనిద్విపద లై పరఁగఁ
బూజింపవలయు వాక్పుష్పమంజరుల. 49

మఱియుఁ జౌపదము —

కలసి చతుర్లఘుగణములఁగుందు
నలిఁ ద్రిగణం బై నగణము వొందు
నలరుగణద్వయ యతిగోవిందుఁ
బలుకఁ గృతులఁ జౌపద చెలువందు. 50

అందు విశేషము చౌపదము.—

అర్కనామగణ మనువుగ రెండు
దార్కొని లఘువొందఁగ నిట్టుందుఁ

దర్శింపఁగ ను విశాళము నందు*
పేర్కొనఁ దగు హారిబిరుదులపిండు. 51

రగడలు.—

క. ఆద్యంతప్రాసంబులు
హ్యాద్యంబుగ రెంట రెంట నిడి పాదము లు
ద్యద్యతులఁ గూర్పఁ దగు నన
వద్యంబగు రగడలందు వారిజనాభా! 52

అందు హయప్రచారరగడ.—

హనచతుష్టయంబు ఋతుల
జనితయతుల జరగుఁ గృతులఁ
జను హయప్రచారరగడ
వినుతశాస్త్రవిధులు వొగడ. 53

అందు తురగవల్గనమనురగడ.—

శ్రీసతీశుఁ బరమపురుషుఁ జిత్తమున దలంచువారు
వాసవాదినిఖిలదివిజవంద్యు నాశ్రయించువారు
నిట జనింప రనఁగ నన్వయించుఁ దురగవల్గనంబు
పటుదినేశలఘువిరామభానుమద్గణాష్టకంబు. 54

అందు విజయమంగళమను రగడ.—

శ్రీధరాయ శిష్టజననిషేవితాయ భక్తలోక
జీవితాయ గర్వితోరుసింధురాజబంధనాయ
గాధిపుత్రయజ్ఞవిఘ్నకరమహాసురీమహోగ్ర
కాయశైలదళననిపుణఘనసురాధిపాయ థాయ

* ప్ర. ము. పా - నందు, ద్వి. ము. పా - నందు.

శ్రీవాయ తే నమోఽస్తు కృష్ణ పాహిపాహి యనుచుఁ
గేలు మొగిచి మౌళి నునిచి కృష్ణుఁ బలికె ననుచు నిట్లు
దేశభాషణములఁ జెప్ప ద్విగుణితురగవల్గనమునఁ
దేరు విజయమంగళంబు తీయచెఱకు రసమునట్లు. 55

అందు ద్విరదగతి యనురగడ.—

శ్రీయువతి నిజయువతిఁ జేసి యొంతయు మించి
కాయజునిఁ దనతనయుఁ గా నెలమిఁ గాటించి
సకలదేవతలఁ బరిజనులుగా మన్నించి
ప్రకటగతి శ్రుతుల నుతిపాఠకులఁ గావించి
హరి యొప్పు నన నొప్పు నవకారలఘువిరతి
శరధి¹నగనలలభలసలతరలద్విరదగతి. 56

అందు జయభద్రరగడ.—

శ్రీకి నాఁడయుం దనఁగఁ జిత్తజునిగురుఁ దనఁగ
శేషశయనుం దనఁగఁ జెలువుగఁ జతుర్భుజుఁడు
నాకౌకసుల నేలు నముచిసూదనుపూజ
*నతఁడు దాఁ గైకొన్న నందగోపాత్మజుఁడు
ఇతనిఁ గొల్చినఁ గాని యిహపరంబులు గలుగ
వితరసేవల ననఁగ నెసఁగు నివ్విభుఁ డంచుఁ
జతురమతు లొనరింప జయభద్రరగడలిటు
సద్ద్విరదగతి రెంటఁ జాటింపులం బెంచు. 57

అందు మధురగతి యనురగడ.—

శ్రీవనితాధిపుఁ జేరి భజింపుఁడు
భావజజనకుని భక్తిఁ దలంపుఁడు

---

* అఖండయతి కూర్పఁబడినట్లు గాన వచ్చెడి. 1 నగ - (తా. ము.)

అని గగనలభసలను నాల్గిటఁ గృతి
జను గజలఘువిశ్రమము మధురగతి. 58

అందు హారిగతి యనురగడ —

శ్రీరామాకుచకుంకుమపంకము
చేఁ బొలుపగువిపులోరఃఫలకము
శారతుషారపటీరసమానో
దకవాహిని యొదవినపదకమలము
నతిశయ మై యలవడు నే దేవుని
ననవరతోదారత నాహారిగతి
యితరుల కలవడ దని నృప లఘుయతి
నిభనలగగభసల నగును హారిగతి. 59

అందు వృషభగమన మనురగడ —

శ్రీమనోహరు నంబుజోదరుఁ
జిత్తజాతగురుం దలంచెదఁ
గామితార్థవిధాయి నిర్జిత
కాళియాహిని నాశ్రయించెద
ననువుగా *భగణములు భానుస
మన్వితద్వితయములు నాలుగు
ననిమిషాధిపలఘుయతినిడఁగ
నలరువృషభగమనము మెలగు. 60

అందు హరిణగతి యనురగడ.—

శ్రీనివాసు భజింతు నే నని
వూని కుజనులపొంత బోనని

---

* భగసలలు - పాఠాంతరము.
చతుర్థచరణగణముల నరసిన నీపాఠాంతరమే గ్రాహ్యమని తోఁచెడు.

భానుయుతసలభసగగంబుల
[1]లోననిరుదోలుననగంబుల
[2]నిరవుగా నియమాఋలఘువుల
[3]నెల్ల వారును నొగి గణింపఁగ
విరతులనుగావింపనిమ్ముల
హరిణగతి చెలువగుజగమ్ముల. 61

మఱియుం జాటుప్రబంధలక్షణము.—

సీ. ఒకపద్య మైనను ముక్తకము రెండును మూఁడు
ద్వికమును త్రికము నై విస్తరిల్లుఁ
బంచరత్నము లైదు పరఁగ నెన్మిది గజా
వళికి నామావళి ద్వాదశంబు
నెన్నంగ నిరువదియేడు తారావళి
యొనయు ముప్పదిరెండు నేఁబదియును
మూఁడునూ టెనిమిది నుతికెక్కు ద్వాత్రింశ
దభిధాన పంచాశదాఖ్య నాఁగ
ఆ.వె. వెలయు శతక మనఁగ వెండి యష్టోత్తర
శతక మనఁగ నిట్లు సకలసుకవి
సమ్మతముగ నెగడుఁ జాటుప్రబంధము
లభిమతార్థరచన నబ్జనాథ. 62

మఱియు ఉదాహరణలక్షణము —

సీ. భాసిల్లు సప్తవిభక్తులందునుమఱి
సంబోధనంబున సరవిగాఁగఁ

---

1 ఈ పాఠము సరిగా లేదు.

2 యతిభంగము. 3 ప్రాస, యతి రెండుతప్పినవి; మఱి యంతాను ప్రాసఘటన గావరాదు. పాఠాంతర మేదేనిగలదేమో పరిశీలింపఁదగినది.

ప్రభునామయుతముగాఁ బద్య మొక్కటియును
దగఁ జెప్పి రగడభేదంబులందుఁ
గలికలు ప్రత్యేకదళము లెన్మిది చేసి
తత్పరార్ధముల నుత్కళిక లనఁగ
నేకసమాస మై యేడుదళంబులు
నుదవిభక్త్యర్థంబు దోఁపఁబలుక

గీ. దాని పేరఁగఁ జక్కనదళ మమర్చి
ఫణితు లాదఁగూర్చి సార్వవిభక్తికముగఁ
గట్ట కడపటిపద్య మొక్కటి రచింప
నది యుదాహరణం బగు నబ్జనాభ! 63

సీ. ప్రథమవిభక్తికిఁ బరఁగు వీరావళి
మఱి ద్వితీయకుఁ గీర్తిగులి దలంప
సుభగాభిధాన మచ్చుగఁ దృతీయకుఁ జతు
ర్థికి భోగమాలిని దృఢముగాఁగ
జెలిఁ బంచమికిఁ గళావతి కాంతిమతి షష్ఠి
కమరు నుదాత్త సప్తమికిఁ గమల
సంబోధనమునకు జయవతి యీగతిఁ
దగు విభక్త్యధిదేవతాచయంబు

గీ. నెలమి నయ్యైవిభక్తుల నేపఁగఁ జెప్ప
గావ్యములను సంతోషించి కరుణతోడ
నాత్మనామాభిరూపఫలాభివృద్ధి
భర్తలకుఁ గర్తలకుఁ జేయుఁ బద్మనాభ! 64

షట్ప్రత్యయంబులు.—

క. క్రమమునఁ బ్రస్తారము న
ష్టము నుద్దిష్టమును వృత్తసంఖ్యయు మఱి పెం
పమరు లగక్రియయును న
ధ్వము లన షట్ప్రత్యయములు దనరు ముకుందా! 65

క. చాలుగ సర్వగురువు లిడి
లాలితముగ గురువుక్రింద లఘువును వలప
ల్లోలి సమంబులు డాపలి
వ్రాలకు గురువులను నిలుపఁ బ్రస్తారముగున్. 66

నష్టలబ్ధి —

క. సరు లర్ధించినచోటుల
నరయఁగ లఘువులను వేసులం దొక టిడి చె
చ్చెర నర్ధించిన చోట్లగ
గురువుల నిడ నష్టలబ్ధి కుంజరవరదా! 67

ఉద్దిష్టము.—

క. ఒక్కటి మొదలుగ నినుమ
ళ్లొక్కనచో లఘుయుతంబు లిన్నియుఁ బ్రోగై
యొక్కటి కలియఁగఁదోఁచును
గ్రక్కున నుద్దిష్ట మిదు కార్ముకజనకా! 68

వృత్తసంఖ్య.—

క. చేకొని ఛందోవర్ణము
లేకాదిద్విగుణితముగ నిడి [2]కడలెక్కం

---

1 లఘువులకుల్, ఓలిసమంబులు - అని యుండదగు.

2 కడు - పూ. ము. సవరణ (శ)

ప్రాకటముగ రెట్టించిన
శ్రీకరముగ వృత్తసంఖ్య శ్రీనరసింహా! 69

లగక్రియ.—

క. ఒక్కటి గలసిన ఛందపు
టక్కరముల దొంతి యిడి యుపాంతములతుదన్
జక్కఁగ నొక్కొక్కటిలోఁ
గ్రక్కున నొడఁగూర్ప నగు లగక్రియ కృష్ణా! 70

గణలగక్రియాంకమగుచక్రము.—

క. తొలుత ప్రతి సర్వగురువగు
లలి నేకద్విత్రికాదిలఘుయుతవృత్తం
బులు పరప్రతు లగుఁ జక్రా
కలితము లౌనెలవు లగు లగక్రియఁ గృష్ణా! 71

సగణలగక్రియాంక మగుచక్రము.—

చ. సగణల గక్రియాంక మగుచక్రమునం దొకఁ డాదిగాఁగఁ ద
ద్ద్విగుణము లడ్డవీథి నొదవింపఁగ వాయుగృహాంకసంఖ్యతో
నొగిఁదరువాతియిండ్ల ప్రతులొందనధోఽంకములన్ సమాధికం
బగు ప్రతిమానుచుంగడమ కొలప్రతుల్ దొరలించినిల్పఁగాన్.

గీ. ఇందు సమమగునది తొల్తయిండ్ల వ్రాయఁ
బడినసంఖ్యతో సమమైనఁ బ్రతికిఁ జేరు
నధిక మగునది వృత్తసంఖ్యాధికంబు
వ్రాయ రివి రెండు ప్రతులచక్రములయందు. 73

వ. సుప్రతిష్ఠకు లగక్రియాచక్రోద్ధారం బెట్టిదనిన. 74

1 కాల (త్రా. మూ)

చ. మునుగలయొండు రెండునిట మూఁడుగ మూఁడును రెండునై
దునైదును నట నాల్గుశొష్మి దగుఁ దొష్మిది నెన్మిదియుం బదే
డుగా, నసువగు పంక్తి రెండు మొదలైనవి నాల్గిట నాలుగా
దిగా, నెనిమిదియుం దదాదికము లెల్లఁ బదాఱిటఁ గూడఁగా
నగున్. 75

లఘుక్రియాచక్రము అధ్వక్రియ.—

క. తిరముగ ఛందోఽక్షరములు
నురుతరముగ వృత్తసంఖ్యయును ద్విగుణము లై
పొరి నొక్కొక్కఁడు తొలఁగఁగఁ
బరిశిష్టాంగుళము లధ్వభాగ ముపేంద్రా! 76

సమవృత్తంబుల వెఱసు.—

క. కడపటివృత్తంబుల యను
మడి లోపలఁ బ్రథమవృత్తమండలిఁ దీర్పఁగ
వడినిష్టచ్ఛందంబులఁ
బొడమినవృత్తముల వెఱసు పొలుపగుఁ గృష్ణా! 77

మఱియు ఛందోవృత్తముల వెఱసు.—

చ. శిగిఁ బదుమూఁడుకోటులును జొప్పగ నల్వదిరెండులక్షలుఁ
దగఁ [1]బదునేడువేలు నుచితంబుగ నవ్వల నేడునూటిపై
నగణితవైభవా యిరువదాఱు గదా సమవృత్తభేదముల్
ప్రగుణితలక్షణస్ఫురణఁ బంచినఛందము లిర్వదాఱిటన్. 78

గద్యము. ఇది శ్రీవాణీచరణప్రసాదలబ్ధవాగ్వైభవ తిక్కనామా
త్య తనుసంభవ సుకవిజనవిధేయ యనంతనామధేయప్రణీ
తం బైనఛందోదర్పణంబునందు జాతిలక్షణలక్షితంబు లగు

---

1 బదుమూఁడువేలు - పూ. ము. సవరణ (ళ)

కందంబులును, మాత్రాలక్షణయుక్తంబు లగుగీతులును
సీసంబులు నుత్సాహము దరువోజయు నక్కరయు షట్పద
యుఁ ద్విపదయు మంజరియుఁ జౌపదయు రగడలును జాటు
కావ్యప్రమాణంబులును, ఉదాహరణంబులును, షట్ప్రత్య
యంబులును, సప్తమప్రత్యయం బైనసమవృత్తముల వెలసు
కెఱుంగు నన్నది తృతీయాశ్వాసము.

---

శ్రీ ర స్తు.

# ఛందోదర్పణము

## చతుర్థాశ్వాసము



### దోషాధికారము.

శ్రీధర తనురుచివిజితప
యోధర యనవరతఘోషయోషిత్పరిరం
భాధర తల్పీకృతపన్న
గాధర రిపుభయద ఘనగదాధర కృష్ణా! 1

క. జగమున దోషవివర్జిత
ముగఁ జెప్పఁగవలయుఁ గావ్యములు సత్కవు ల
ట్లగుటఁ దశదోషమ్ములు
తగఁ జెప్పెదఁ బూర్వకవిమతంబుగఁ గృష్ణా! 2

### దశదోషములు.

గీ. పదియుఁ గీడుఛందోయతిభంగములు వి
సంధికము పునరుక్తి సంశయ మపక్ర
మంబు వ్యర్థ మపార్థము మఱి విరూపి
కాపశబ్దవిరోధంబు లనఁగఁ గృష్ణ! 3

1. ఛందోభంగము.—

క. ఛందోభంగం బగు గురు
వొందెడునెడ లఘువుగాఁ బ్రయోగించుట గో
విందయనిపలుకుచోట ము
కుంద యనుచుఁ బలుక నిట్లు కుంజరవరదా! 4

2. యతిభంగము —

ఆ. వె. విమలకమలనేత్ర విశ్వలోకస్తోత్ర
విమలదైత్యకులవినాశ యనుచు
వలయుచోట లేక వడి యొండుచో నుండఁ
బలికిరేని యతిభంగ మండ్రు. 5

3. విసంధికము —

ఆ. వె. అమృత ఉదధిశయన అమర ఈశానుజ
అబ్జమందిరాస్య అబ్జమిత్ర
అనుచు నిట్లు సంధి నెనయనిశబ్దముల్
దొరయుటయ విసంధిదోష మండ్రు. 6

4. పునరుక్తికము —

గీ. తొలుతఁ దా నెద్దియైనను బలికి మఱియు
నదియ పలికినఁ బునరుక్తి యండ్రు బుధులు
శబ్దపునరుక్తి పూర్వోక్తశబ్దమైన
నర్థపునరుక్తి యేకార్థ మైనఁ గృష్ణ! 7

గీ. శబ్దపునరుక్తి యగుఁ గాంతిచంద్రుఁ డని వ
చించి మఱి కాంతి చంద్రుఁ డటంచుఁ బలుక
నర్థపునరుక్తి యగుఁ గీర్తి నమృతకిరణుఁ
డని యశోమృగాంకుం డన నబ్జనాభ! 8

క. పునరుక్తిదోష మొందదు
దనరుపదావృత్తి నభిమతంబుగ వీప్సా
జనువినుతాభీక్ష్ణ్యంబునఁ
బొనరు క్రియాసమభిహారముననండ్రు హరీ! 9

సీ. ఈవెన్నముచ్చు దా నిల్లిల్లు దప్పక
చొచ్చుఁ బొమ్మన వీప్స పొంపుమిగులు
ఇటువచ్చివచ్చి నీవేల నిల్చితి కృష్ణ
యనిన నాభీక్ష్ణ్యంబు పొనరియుండు
ఇమ్మిమ్ము శౌరికి నిమ్మనం దనఁ గ్రియా
సమభిహారంబు ప్రశంస కెక్కు
నీచక్కఁదనమును నీమంచితనమును
బ్రీతిఁ గన్గొని ధాత్రి ప్రేత లైరి.
ఆ. వె. దండకావనంబు కాపసు లనఁ బదా
వృత్తి యుల్లసిల్లు విమలకృతుల
భూరిపుణ్యశీల పునరుక్తిలాలన
ప్రకటపుణ్యశోభ పద్మనాభ! 10

5. సంశయము —

ఆ. వె. కదఁగి వానిఁ గదియఁగాఁ గదా నేఁడు నీ
కింతవట్టుగలిగె నిందువదన
యారకున్నఁ గలదొకో యని సంశయా
ర్థముగఁ బలుక సంశయము ముకుంద! 11

6. అపక్రమము —

క. పదమున నాభికమలమున
హృదయమునఁ బయోజభవ రతీశ్వరదివిష
న్నదు లుదయించెం గమలా
స్పదునకు ననుచు వ్యుత్క్రమం బపక్రమ మయ్యెన్. 12

7. వ్యర్థము.—

క. మును దాఁ బలికినమాటకు
ననుగుణములు గాక వ్యర్థ మగుమాటలతోఁ
బెనఁచిన నది వ్యర్థంబనఁ
జనుదోషం బనిరి కావ్యచతురులు కృష్ణా! 13

ఆ. వె. త్యాగి వగుదు నీవు కారంబు పెట్టవు
చేరి నిన్ను నడుగు వారు పెద్ద
యింకఁ గీర్తి బ్రాతియే యని యొరుఁ బల్క-
వ్యర్థదోష మండ్రు వనజనాథ! 14

ఆ. వె. ప్రేమ మెఱఁగి వాఁడు బిగియుచు నున్నాఁడు
[1]వానిఁ గననిరొల్ల వాఁడు నాకుఁ
గూర్పఁ దెలుఁగు లేదొకో నాఁగ విరహిణి
యందు నిట్లు వ్యర్థ మమరుఁ గృష్ణ! 15

8. అపార్థము.—

క. కరిచర్మము గైరికశిల
సురగిరి యని సముదయార్థశూన్యపదంబుల్
గురసిన నపార్థ మగు నది
జరగు మదోన్మత్తబాలచరితలఁ గృష్ణా! 16

9. అపశబ్దము.—

ఆ. వె. కనుఁగొనంగ నాదికవులకావ్యంబుల
లలితమైనలక్ష్యలక్షణములు
రూఢిగాని పెఱవిరోధోక్తు లపశబ్ద
సంజ్ఞకంబు లండ్రు జగతిఁ గృష్ణ! 17

1 వానిగనిన (క)

వ. అవి యెయ్యవియనినం గుసంధి, దుస్సంధి, చుట్టుంబ్రాస, వైరి వర్గంబు, కాకుదోషంబు, కుఱుచకాకు, తెనుంగునకుం జొరని సంస్కృతక్రియలం బెరయు దుష్ప్రయోగంబులు మఱియు నిట్టిగ్రామ్యంబు లెన్నిగల వన్నియు నపశబ్దంబులు వాని వివరించెద.

గుసంధి.—

క. మొదల నికారముపై న
చ్చొదవి యకారముగ దీనియొదయం డిది యి
ట్లొదవె ననక దీనోదయం
డిదెట్లొదవె ననఁ గుసంధు లినశశినయనా! 19

దుస్సంధి.—

క. తఱి స్వరసంధి నకారం
బతిశయముగ నతఁడు నతఁడు ననుచో నతఁడు
న్నతఁడు నని యూఁది పలికిన
సతతము దుస్సంధి యండ్రు సత్కవులు హరీ! 20

చుట్టుఁబ్రాస.—

మొద లాఱు వడ్డి మూఁ డనఁ
గదియింపక యొత్తి కట్టి కరమున నగువాఁ
డిదె వచ్చెడి నన నెగ్గై
యొదవిన యీచుట్టుఁబ్రాస లొల్లరు కృష్ణా! 21

వైరివర్గము.—

ఆ. వె. తుదలు తెలుఁగుఁ జేసి యదికి పుష్పవిల్లు
పరఁగ భూరుహాంఘ్రుఁబండ్లు నాక

పుష్పవిల్లు నాఁగ భూరుహాపండ్లు నా
వైరివర్గ మండ్రు వనజనాథ! 22

ఆ. వె. [1]కోమటేంద్రు నాఁగ భూమితీరనఁ బలు
గ్రహము లనఁగ వానకాల మనఁగ
వైరివర్గమైన వదల రిట్టివిలోక
రూఢిఁ జెల్లునని సరోజనాథ. 23

గీ. మొదలితెలుఁగుపై సంస్కృతపద మొకండు
జరగు లోకరూఢిని సమాసంబు చొరదు
పూని ముజ్జగంబులు ననఁ బోలుఁ గాని
యతఁడు ముజ్జగద్వంద్యుఁ డనఁగఁ జనదు. 24

క. పొలుపుగఁ బోగాడదండలు
లలన ముడిచినఁ మకార లాంఛనుఁ డొందెఁ
జలమునఁ జెటాకువిల్లన
నల నిడుదలఁ గాకు దోషమండ్రు ముకుందా! 25

కుఱుచ కాకు.—

క. ఎలుఁగుపడ నీవు చెపుమా
రొలిక వనుచు నసపడితిమి రొమి నివు నరొడా
చలుఁజలు ననునిడుపులు గఁఱు
చలు సేసినఁ గుఱుచకాకు చను నిది కృష్ణా! 26

దుష్ప్రయోగము.—

క [2]సత్వరము నృపస్య పదం
గత్వా యాతఁడు నిహత్య కంటకుల సఖ

---

1 పరస్తువారి ప్రతి. 2 సత్వమున నృపస్య పాఠాంతరము.

1 కోమటేంద్రు - ఇదివైరివర్గ మెట్లగునో?
దీనికేదేనిఁ బాఠాంతర మున్నదేమో! కోమటేంద్రుఁడని యుండునో!

భూత్వా మెలఁగెడు నన్నఁ గ
విత్త్వవిదులు దుష్ప్రయోగవిధ మండ్రు హరీ! 27

వ. సంస్కృతవిభక్తు లయ్యును దెనుఁగునకుఁ జెల్లు సుప్రయోగం
బెట్టిదనినః— 28

క. నిక్క మగు సుప్రయోగము
ధిక్కృతదురితాయ భగవతేఽస్తు నమో యం
చక్కడ నీకును నమరులు
మ్రొక్కుదు రని తెబ్బుబంతములఁ గూర్ప హరీ! 29

విరోధములు:—

క. సమయవిరోధమ్మును నా
గమలోకవిరుద్ధములును గాలవిరోధ
క్రమము కళా దేశవిరో
ధములును జొరకుండఁ జెప్పఁదగుఁ గృతుల హరీ! 30

సమయవిరోధము:—

క. సందులఁ గుండలముల్ గుడి
సందిని శివలింగమును నొసల భూతియుఁ బెం
పొందఁగ నొకదరిఁజేసి మ
రం దెగడెదు నన సమయవిరోధము కృష్ణా! 31

ఆగమవిరోధము:—

క. ఎక్కడిధర్మము హింసయ
నిక్కమనుచు వృత్రవధకు నిర్జరపతియుం
ద్రొక్క దయపేర్మి ననవుడు
నెక్కడ నాగమవిరోధ మండ్రు ముకుందా! 32

కాలవిరోధము:—

క. కాలము వట్టక చదువుఁగ
వోలఁగఁ బుస్తకము చేత ముట్టక పాడుఁగ
మే లితనిజాణతన మన
వోలి నిది కళావిరోధ ముదధివిహారా! 33

దేశవిరోధము:—

క. బహుకూపతటాకోదక
మహితము మరుదేశ మని సమర్థించిన ని
మ్మహి నది దేశవిరోధా
వహ మండ్రు కవీంద్రు లమృతవారిధిశయనా! 34

క. ఇట్టివి దశదోషము లనఁ
బట్టుగఁ గృతులందు నివియ భాసురముగఁ జే
పట్టుదురు ధీరు లొక్కొక
పట్టున డెందమ్ము లలరఁ బల్కినఁ గృష్ణా! 35

క. పదిదోషంబులఁ దెలిపెదు
నదనఁ బ్రయోగించినట్టి యపప్రయోగములం
దొదవవు దోషంబులు నీ
పదములనామములఁ గూడఁ బలుపుటఁ గృష్ణా! 36

క. క్రమమున నిటు చెప్పినదో
షములం దత్యుత్కటము విసంధిక మని రా
దిమునులు తత్పరిహారా
ర్థము సంధి సమాసములు దిరంబుగఁ జేర్తున్. 37

తే. సంధిఁ దెలిపెడుచో సూత్రసమ్మతముగఁ
దొలుతఁ బలికి చూపెడువర్ణముల విసంధి
నాటుకొనదు శ్లిష్టోచ్చారణంబుఁ జేసి
చూపునదియ నిత్యసంధిసూచకంబు. 38

షట్సంధులు.—

గీ. పరఁగుఁ దుక్సంధి స్వరసంధి ప్రకృతిభావ
సంధి వ్యంజనసంధి విసర్గసంధి
స్వాదిసంధి నా షట్సంధు లందులోనఁ
బ్రకృతిసంధి యన్నది యాంధ్రభాషఁ జొరదు. 39

తుక్సంధి.

క. పదమధ్యదీర్ఘలఘువులు
పదాంతలఘువులు ఛకారపరమై యాదున్
మది మ్లేచ్ఛుఁడు తుచ్ఛం డనఁ
ద్రిదశచ్ఛత్ర మన నీగతిని దుక్సంధిన్. 40

గీ. లలిఁ బదాంతదీర్ఘము వికల్పంబు నొందుఁ
బుత్రికాచ్ఛత్త్ర మాత్మజాఛత్ర మనఁగ
నటఁ బదాంతదీర్ఘం బయ్యు నాఙ్ప్రియుక్తి
నిత్య మాచ్ఛాదనం బని నెఱయ నూఁదు. 41

స్వరసంధి.—

క. ధర అఇఉఋలు సవర్ణము
పర మగుచో దీర్ఘ మగు సువర్ణాద్రి యనన్
శరధీంద్రుఁ డన బహూదక
పురసి యనఁ బితౄణములు వెసం దీర్ఘ మనన్. 42

క. చెచ్చెర ఇఉఋలు మీఁటికి
నచ్చు పరం బైన యవర లాదేశ మగున్

మెచ్చుగ దధ్యన్నం బనఁ
బెచ్చుగ మృద్వన్న మనఁగఁ జిత్రర్థ మనన్. 43

క. తగుసేఁతన మన నయనం
బగుఁ జోఁతన మనఁగఁ బవన మగు నైతిక నా
నగు నాయక శాతకయన
నగుఁ ఖావక ఏజవాప్తి నయవాయావల్. 44

గీ. సరవి సీనాల్గుపదమధ్యసంధులందు
నప్రసిద్ధ మేకారాంత మైత్వమునకు
నోత్వమునకు నౌత్వమునకు నొగిఁ బదాంత
సంధి నగు విశేషంబు లేచంద మనిన. 45

క. గోశబ్దముపై నవజా
దేశమున గవాక్షు మనఁగ దీపించు నవా
దేశము దోశ్యబ్దముపై
నాశక్రుఁడు [2]ద్యావధీశుఁ డన సత్సంధిన్. 46

క. శైశిఖరాచ్చున కాయా
దేశం బగుసంధి రాయధీశ్వరుఁ డనఁగా
గ్లౌశిఖరాచ్చున కావా
దేశం బగుసంధిగ్లావుదీర్ణ యనంగన్. 47

క. [1]మొదలిఅకారము ఇఉబులు
పొదవిన నేత్వమును నోత్వమును రేఫయుఁ దెం
పొదవు సురేంద్రుఁ డనఁగ నీ
రదోత్కరం బనఁగ సంధి బ్రహ్మర్షు లనన్. 48

1. మొదలియకారముని ఉఋలు - బ్రా. ము.

2. ద్యవధీశుఁడన (క) - ఈపాఠ మేయుక్తము. ఇప్పట్టున నాక క్రుండు అని సవరింపబడె.

గీ. ఇత్వ ముత్వ మోత్వం బైత్వ మాత్వ మైదు
నాది యై ఋకారము పరమైనచోట
మహితకవ్యృద్ధి మన్వృద్ధి మతిదవ్యృద్ధి
యద్ది రాయృద్ధి గ్లావృద్ధి యనఁగఁ బరఁగు. 49

కం. వశగతి ఋణపద మధికవు
దశఁ బ్రవసనకంబళార్ణదశవత్సతరా
ఖ్యశిఖరిసంఖ్యపదంబులు
[1]రశిరప్కాకార మొంది ప్రార్ణాదు లగున్. 50

కం. విలగునేవి లోఁజా
లొలగు నాద్యంతమునకు నఖలైకవిభుం
డాలిత్రైశ్వర్యుఁడు స
త్యాలాపాదనుఁడు భవమహౌషధ మనఁగన్. 51

గీ. అత్వమున కోతు వోష్ఠమంత్యమునఁ గదియఁ
గలుగు నోత్వౌత్వయుగ్మ వికల్పసంధి
ఆడఁ జెందె ఘనోతు వల్పౌతు వనఁగ
నాఁగ బింబోష్ఠి నొక్కబింబౌష్ఠి యనఁగ 52

అ) యోగచతుష్టయము.

కం. అందముగ నీపదర్థము
నం దాతుద నుత్వ మోత్వ మై యోష్ణ మగుఁ
జెంది క్రియాయోగము తుద
యందలియత్వ మది యాత్వ మావన మనఁగన్. 53

కం. ఇల మర్యాదాదులయం
దలియత్వం బాత్వ మై పొదలు నాద్రి యనఁ

1. రశిరప్కార - భా. ము; సవరణ (భ)

లలి నభివిద్యాదులయం
దలియత్వము నాత్వమై పొదలునా ద్రియనన్. 54

గీ. ఈషదర్థ మనఁగ నించుక యగుఁ గ్రియా
యోగ మనఁగ సత్క్రియోపయుక్త
యంతదాఁక యనుట యై చను మర్యాద
యదియు ననుట యర్థ మభివిధికిని 55

క. ఈనాల్గిట నుపసర్గయ
కానఁ గలిగె సంధి యట్లుగావు ప్రకృతిభా
వానుగతాకారము లవి
జానుగఁ దెలుఁగునకుఁ బొరవు సంధికలియమిన్. 56

క. ప్రతిషేధాకారోత్తర
గతశబ్దాద్యచ్చు లవి నకారము లగునా
శ్రితులకుఁ బంకజనేత్రుఁ డ
నతిదూరుం డనఁగ నతఁ డనాద్యంతుఁ డనన్. 57

వ్యంజనసంధి—

క. పొదవగు దిగిభ మజంతము
పదంగములు జగదర్చిప్పశాంతి సుబంతం
బడరె నన దృతీయము లల
వడు వర్గవ్యంజనములపై నచ్సంధిన్. 58

గీ. షడ్రుతుధర్మభూషిత తరుషండలక్ష్మి
నిర్మలాబ్దుదీర్ఘిక నిజవిశిష్ట
వాగ్రుజాత్వంబు భవద్రుషిత్వమున కమరె
వాఁగ ఋత్వవర్గ వ్యంజనముల సంధి. 59

గీ. ఆదిజఘనముల హల్లు లచ్చు లంట
స్వస్వరూపంబ యగు బుత్వసంధి నైన
నడఁగు గుడి హలంతము నాఁ దిజంతమన ని
కోయణచి నా నన్ృజావనఁ గూడుఁ గాన. 60

క. పన్నగ మకారహల్లగు
సున్న మకార మగు నచ్చు సోఁక సమగ్రం
బన్న మన బుకారం బా
సన్నమ్ముగ మృత్వ మగు రససమృద్ధి యనన్. 61

క. తమతమవర్ణంబుల ద్వి
త్వము లగుఁ దత్తరుణి తత్తదర్థము తద్ధా
నము తద్ధనంబు తన్నయ
నము నా నిటు వర్గములఁ దనరు వ్యంజనముల్. 62

సీ. వర్గహల్లులచేరువను హాకారము చతు
ర్థాక్షరం బై సంధి నడఁగు నొండె
మూఁడవవ్రాలతోఁ బోఁడిగ దీపింప
స్రగ్ఘార మనఁగ నజ్ఝల్లు లనఁగ
షడ్ధలంబులునాఁగ సకలజగద్ధిత
ప్రాధిమనాఁగకుబ్భస్తి లనఁగ
నవియు స్రగ్ఘారంబు లనఁగ నచ్ హల్లు ల
నంగ షడ్హలములు నా జగద్ హి
తానువర్తను లనఁ గకుబ్ఘస్తు లనఁగ
శపరమైన వాక్ శాంతి వాక్ఛాంతి యట్ల
చపటహల్లులు మూఁటను బడు విభాష
ఛత్వమగుఁ దకారమునఁదచ్ఛాఖయనఁగ. 63



*గీ. లలిని దద్వ్యంజనంబుపై లత్వమునకు
ద్విగతి తల్లీల యనఁగఁ దద్లీల యనఁగ
నంచితసకార మడఁగును నడఁగకుండు
నుత్థితం బుత్స్థితం బన నుండుఁ గాన. 64

క. అనునాసికవర్గవ్యం
జనముల నిజరూప మొండె జరగుఁ దృతీయం
బునఁ బ్రాఙ్ముఖంబు ప్రాగ్ముఖ
మన వాఙ్మయమంబు వాగ్మయ మనుచొ౽టన్. 65

గీ. కచటతపహల్లు పంచవర్గద్వివర్ణ
సలనిజాకృతి నిఁాదియుతరయుగముల
యరలవలఁ దృతీయంబు వాక్తరుణివాక్స
రంబు లనఁగ దృగ్దీప్తి దృగ్వ్రాత మనఁగ. 66

గీ. కపలప్రథమయుగ్మసకారగతులఁ దాన
అపరయుగయరలవతృతీయంబు తత్కృ
తంబు తత్ప్రతి తత్సతి తద్గతియు జ
గద్గురుఁడు సద్యశము నాఁ దకారహల్లు. 67

గీ. తచ్ఛమత్కృతి తచ్ఛాయ తజ్జలంబు
తజ్ఝషము తట్టణాంకృతి తట్ఠకార
ఘనత[illegible] యనఁగ రెండు
వర్గములు ద్విత్వమొందు నాధద్వ్యంజనమున. 68

విసర్గసంధి.—

క. కపముఖయుగ్మములు విస
ర్గపయిం బొడసూపి నిర్వికార మగు మనః

* తద్ + లీల - తల్లీల - అనురూపము నిత్యము. తద్లీల - అను రూపము అపాణినీయము.

కపట మనఃఖేదము లనఁ
దపఃఫలం బనఁ దపఃప్రతాపం బనఁగన్. 69

గీ. కపల మొదలిరెం డ్లగు దుర్నిరుపరిరంధి
వత్వ మగు దుష్పదంబు నిష్ఫల మనంగ
జరగు దుష్కర్మ మనఁగ నిష్కర్మ మనఁగఁ
జెల్లు దుష్కృత మనఁగ నిష్కృత మనఁగ. 70

క. పొలుపుగఁ జటతాదియుగం
బుల శషస లెనయ విసర్గపొందు నవౌ వా
క్చలనము-ఛందశ్శికలు
లలితయశస్థితి మిథశ్చలంబు లనంగన్. 71

క. అలరు నికారాదివిస
ర్గలపై వర్గాపరాక్షరద్వయగణముల్
యలహవలు గదియ రేఫల్
గలియు హవిర్భుజధనుర్బలంబు లనంగన్. 72

క. మొదలివిసర్గలమీఁదఁ
బొదలినశషస లవి యూఁదు భూరియశస్సం
పద యనఁ గా సుమనష్ష
ట్పదము లనఁగ నధిక మగు తపశ్శక్తి యనన్. 73

గీ. అవ్యయాంతవిసర్గవర్గాక్షరముల
వెంట ఙనమయలవహల రేఫ రేఫ
గాక పెఱవర్ణములఁ గారకంబుపట్లఁ
గదియు స్వర్గజం బనఁగ స్వఃకాంత యనఁగ. 74

క. ప్రకటవిసర్గాదిస్వర
మకారమునఁ గలసి యొత్వ మగు సంధిఁ దపో-

ధికుఁ దన విసర్గ చెడి వా
క్ప్రికార మాప్రభృతిఁ గదిసి రజఆప్తి యగున్. 75

క. కలితేకారాదివిస
ర్గలు స్వరములమీఁదఁ గదియఁగా రేఫలు సం
ధిలు నర్చిరగ్ర మనఁగా
నలవడు మఱి చతురింద్రియం బనఁగ మహిన్. 76

గీ. వర్గములఁ దృతీయచతుర్థవర్ణములును
ఙనములును యరలవహవలు నొనరఁ గదియ
[1]వాదుపదవిసర్గాంతవర్ణ మొత్వ
మగు రజోగుణమన మనోహర మనంగ. 77

క. వెలయ నివర్ణాదివిస
ర్గలమీఁదను రేఫ గదియఁగా దీర్ఘము వ
ర్త్రిలి యర్చీరాజి యనఁగ
నలిఁ జతూరాగ మనఁ దనర్చును సంధిన్. 78

క. ధర నవ్యయపువిసర్గకుఁ
బరమున నచ్చున్నఁ గుఱుచపై రేఫ యగుం
బరరేఫ గదియ దీర్ఘ
స్వర మగు స్వరధీశుఁ డనఁగ స్వారాజ్య మనన్. 79

గీ. ప్రథమ శబ్దాంతదీర్ఘవర్ణములమీఁద
బలసమైన రేఫాంతవిసర్గ యుండి
రేఫయగుఁ దాది నచ్చున్న రేఫయున్నఁ
గ్రాఁగు వారాకరంబు వారాశి యనఁగ. 80

క. అత్వాంతవిసర్గ యుడుగు
నిత్యాదుల రత్వమొందు బుత్వము తుదరా

---

1. వాదుశబ్ద విసర్గాంత - అని పఠించిన గణభంగము తొలఁగును.

2. నర్చి - కా. ము. పఠనం (?)

సత్వము తపబుద్ధి యనఁగ
సత్వయుతా నిర్వృతియనఁ బ్రశస్తం బగుటన్. 81

క. తల మగు రేఫాంతవిస
ర్గలమీఁద బుఋవర్ణ మొనరఁగా సంధి విస
ర్గ లుడిగి రేఫయు బుత్వము
[1]గలియును బునర్భృతు సమేతకములాత్ యనన్. 82

గీ. స్వాదిసంధిలోపలివిసర్గాంతవర్ణ
సంధు లెన్ని యన్నియును విసర్గసంధి
యందె కలిసివచ్చుటఁజేసి స్వాదిసంధి
వేఱ యొనరింపఁబడదు వివేకరూఢ. 83

వ. మఱియు నొక్కవిశేషసంధి. 84

క. ఉపరిని హల్సంయుతమై
నపు డూఁదును స్వరసమన్వితాక్షర మగునే
నపు డూఁద దాదివర్ణము
ప్రపాద్యయము పరిశృతంబు పరిక్షప్తి యనన్. 85

మఱియు సమాసంబులు:—

క. లలితద్వంద్వబహువ్రీ
హులు తత్పురుషము నలుక్కు నుద్యద్ద్విగువుల్
నలిఁ గర్మధారయము ని
ర్మలావ్యయీభావమును సమాసము లరయన్. 86

వ. అందుఁ బూర్వపదార్థప్రధానం బవ్యయీభావంబు నుత్తర పదార్థప్రధానంబు తత్పురుషంబు నుభయపదార్థప్రధానంబు ద్వంద్వంబు నన్యపదార్థప్రధానంబు బహువ్రీహియు నగు నందు ద్వంద్వంబు. 87

---

1. కలియుఁబునర్ బుతుపకేత - బ్రా. మా.

క. పెక్కైనను రెండైనను
జొక్కపుశబ్దములు గవియుచో ద్వంద్వ మగున్
మ్రొక్కెద బలకృష్ణుల కన
నక్కటికమతాదు లుర్వి కాధార మనన్. 88

గీ. వ్యస్తపద మయ్యెనేని సమస్తమైన
ద్వంద్వమున కంత్య పదము చందము విభక్తి
అంబువులు గోవు ద్విజుఁడు శుద్ధాత్ము లనఁగ
నంబుగోద్విజుల్ శుద్ధాత్ము లనఁగ నిట్లు. 89

గీ. చేయవలయు మాతాపితృసేవ యనఁగ
మహితరుచులు సూర్యాచంద్రమసు లనంగ
నాదిమునులు మిత్రావరుణాఖ్యు లనఁగ
ద్వంద్వమున సంధిదీర్ఘము ల్వచ్చు నిట్లు. 90

క. అల సంస్కృతమునఁ బోలెన్
వల దల్పాచ్చునకు నిచట ద్వంద్వపునియతుల్
తెలుఁగు లను గ్రహానిగ్రహ
ములు నాఁగను బుణ్యపాపములు నాఁ జనుటన్. 91

బహువ్రీహి.—

క. ఏవస్తు వెవ్వనికిఁ గల
దావస్తువుకలిమి యతని కలవడఁ బలుకం
గావలయు బహువ్రీహి శి
ఖావిలసద్బర్హిబర్హ రాధవివేకా! 92

తత్పురుషము.—

గీ. ప్రథమపదమున కెద్ది విభక్తి దాని
చే విశేషింపఁబడినది యావిభక్తి

సంజ్ఞఁ బరఁగును దత్పురుషంబు కృతుల
నదియు నఞ్పూర్వసహిత మెన్నిదివిధములు. 93

క. తగఁ బ్రథమాతత్పురుషం
బగుఁగాయముయొక్కపూర్వమపరము దెల్లం
బుగఁ బూర్వకాయ మనఁగా
నగణితముగ నపరకాయ మనఁగా వరుసన్. 94

క. కమలాశ్రితుండు ధనకృ
త్యము కుండలకాంచనంబు ధామాగతుఁ ద
ర్క్యమసుతుఁ [1]దుపరిస్థితచి
త్ర మన ద్వితీయాదు లాఱు తత్పురుషంబుల్. 95

క. ఘటితనఞ్తత్పురుషం బగుఁ
బ్రతిషేధనకారమునకుఁ బ్రతియై మొదలన్
వితతాకారము చొప్పడి
యతఁ డబ్రాహ్మణుఁ డనంగ నవ్రుషలి యనఁగన్. 96

క. ద్విగు వగు సంఖ్యాపూర్వక
మగుచు సమానాధికరణ మగుచుఁ బ్రసిద్ధం
బుగఁ గర్మధారయాహ్వయ
మగుఁ దత్పురుషంబ యాక్రియన్ భిన్నగతిన్. 97

క. ఏయది సంఖ్యాపూర్వక
మై యలవడుఁ బలుక ద్విగుసమాసం బది దా
నీయదుపతికి త్రిం దెలు
పారెుఁ ద్రిలోకి యన నీసమాహారోక్తిన్. 98

కర్మధారయము.—

క. ఏమిటి కెయ్యది గుణమై

1. దుపరిస్థిత (ళ)

తా మెఱయుచు నుండు నది మొదల నిడి పలుకన్
భూమి నది కర్మధారయ
మౌ మధురోదకము మేచకాభ్రం బనఁగన్. 99

క. అందముగఁ గర్మధారయ
మందు మహాత్మునకు నమరు నభిరామగుణ గో
విందుఁడు మహాత్ముఁ డనఁ జే
యందు ఫలితకల్పలత మహాలక్ష్మి యనన్. 100

**అలుక్సమాసము.—**

క. ఏక్రియ యొవ్వనికిం దగు
నాక్రియఁ దేరఁ బదమధ్యమందు విభక్తి
ప్రక్రియఁ గూర్ప నలుక్కగు
నీక్రియ ఖేచరవనేచరేశ్వరు లనఁగన్. 101

**అవ్యయీభావసమాసము.—**

క. ఎక్కడ నెయ్యవి లేవవి
యిక్కడ లే వనిన నవ్యయీభావము దా
నెక్కొను నిర్మక్షిక మని
యక్కజ మగుఁ దీర్ఘ మహిమ నభినుతి సేయన్. 102

వ. మఱియు నుత్తరపదోపమానసమాసం బెట్టి దనిన. 103

గీ. ఓలిఁబురుషసింహో యని యుగ్గడించు
చోటఁ దా సింహఇవపురుషో యనంగఁ
దనరు విగ్రహ మగుట నుత్తరపదోప
మానసమాస మం డ్రిది శాస్త్రమహిమవిదులు. 104

**మఱియుఁ గారకశబ్దంబులు.—**

గీ. సంస్కృతము తెనుఁ గైనఁ దత్సమపదంబు

దానఁ బుట్టి తెనుఁగైనఁ దద్భవంబు
దేశితెనుఁగు దేశజ మచ్చతెనుఁగు తెనుఁగు
నిర్మలుఁడు సిరి యొడయఁడు నిక్క మనఁగ. 105

గీ. సర్వనామముల్ యుష్మదస్మత్పదంబు
లావిభక్తుల క్రియ లవ్యయములు మాను
తెలుఁగు లగుచోటఁ గారకాదిని వసించి
సర్వనామాశ్రయంబులు జరగుఁ గొన్ని. 106

సీ. వీవన్న నీవన్న నితఁడన్నఁ బ్రథమాఖ్య
నను నిన్ను నాతని నన ద్వితీయ
నతనిచే నతనితో ననఁగఁ దృతీయ యా
తనికొఱ కతనికై యనఁ జతుర్థి
పంచమి యగు దీనఁబట్టుండి యందుండి
వానికంటెను వానివలన ననఁగఁ
వానియొక్కకులంబు వానికిఁ బ్రియ మది
జనులలో నితఁడు మేలనఁగ షష్ఠి

ఆ-వె. జలధియందు లక్ష్మిగలుగుచుండఁగ దన్ని
మిత్త మనఁగ సప్తమీవిభక్తి
జలజనాభ యనఁగ సంబుద్ధి యిట్లు వి
భక్తు లలరుఁ గారకోక్తిగతిని. 107

క. స్త్రీపుంనపుంసకము లన
నేపగు లింగములమీఁద నొనఁగు విభక్తుల్
దీపించు నవియు వచన
వ్యాపారనిరూఢి నతురాంతరములతోన్. 108

క. తెనుఁగున అఆఇఈ
లనఁగా ఉఊలు నాఁగ నంబుజదళలో
చన ఋౠ లన ఓఔ
లనఁగ నజంతాహ్వయంబు లగు నీపదియున్. 109

క. చజలు తవర్గము పబమలు
స్వజనప్రియ రవలు శషలు సహలు పదాదుల్
నిజముగుహలంతములు హరి
యజంతములు గూడ నిరువదా ఱంతంబుల్. 110

క. అంతము తెలుఁ గగునెడ నే
యంతముతలసూప దైన నచట సమాసా
ద్యంతరములందు సంధ్యుచి
తాంతము లగుఁ గాన ధీవియద్విష్ణులనన్. 111

క. యత్తత్ప్రభృతు లాకటితోఁ
జొత్తెంచును యద్గుణంబు చూచి మహాత్ముల్
మెత్తురు తత్పురుషుఁడు లో
కోత్తరుఁ దన నీదృశ ప్రయోగబలమునన్. 112

అథ క్రియాపదంబులు.

క. పరుఁ బలుకు ప్రథమపురుష మె
దిరి మధ్యమపురుషపలుకు ధృతి దనుఁ బలుకుల్
ధర నుత్తమపురుషక్రియ
వరుస నలింగకము లైనవచనము లెసఁగున్. 113

క. కారకపదములు తెనుఁగై
నారి నరుఁడు రత్న మనఁ దనర్పుగతి క్రియా

కారవిశేషము లలరవు
వారలు వచ్చెదరు దండు వచ్చెద రనుచోన్. 114

క. ద్వివచనము లేదు తెలుఁగున
బ్రవిమలగతి నేకవచనబహువచనము లౌఁ
దివిచెద ననఁ దివిచెద మనఁ
గవి యనఁ గవు లనఁగ గ్రియలు కారకఫణితిన్. 115

అథ అవ్యయశబ్దంబులు.—

క. ఇలఁ గారకమట్టుల యు
జ్జ్వలరూపము లయ్యు లింగవచనములు విభ
క్తులు లేకవ్యయశబ్దం
బులు సకలము సముచితార్థములు విలసిల్లున్. 116

గీ. నెఱియ నవ్యయపదములన్నియు సమాస
రూపమున నాంధ్రకవితకు రుచి యొనర్చు
స్వర్వధూమణి యన వృథాశంక యనఁ బు
నః ప్రణతి నాఁగ నుచ్చైర్నినాద మనఁగ. 117

క. వృథ యను నవ్యయ మొక్కఁడు
ప్రథితంబై చెల్లుఁ గృతులఁ బ్రత్యేకము తా
వృథసేయక యెప్పుడు మనో
రథములు మాకిచ్చు నీ మురద్విషుఁ డనఁగన్. 118

క. కారకజనిత క్రియయును
నారఁగ ల్యప్ప్రత్యయాది కావ్యయము దెనుం
గైరంబులఁ బూజించి వి
చారించి యుదాహరించి సంధించి యనన్. 119

మఱి విశేష్యవిశేషణంబులు.—

క. హరి కరుణాకరుఁ డనఁగా
హరి యనుశబ్దము విశేష్య మగు మఱి కరుణా
కరుఁ డనుట విశేషణ మి
ట్లురుతరగతిఁ గారకప్రయోగము లమరున్. 120

మఱి క్రియావిశేషణంబులు.—

క. జగతునిత్యుని శాశ్వత
ముగ నిల్పెను దశరథేంద్రపుత్త్రుం డనుచో
జగమునఁ గ్రియావిశేషణ
మగు నీయెడ శాశ్వతముగ నని పల్కుట దాన్. 121

ఆ-వె. శబ్దసిద్ధి కొఱకు సంధిసమాసరూ
పంబు లిట్లు కొంతపలుకఁబడియె
మఱియు నుచితరీతి నెఱుఁగంగవలయు ర
హస్యలక్షణంబు లాంధ్రకవులు. 122

మఱియుం బంచాశద్వర్ణంబులు.—

క. భూమిఁ బదాఱచ్చులు నాఁ
గా మెఱసి అకారమాదిగా స్వరము లగుఁ గ
కా మొదలు క్షకారముతుద
రై ముప్పదినాల్గుహల్లు లగువ్యంజనముల్. 123

క. ఇగు హ్రస్వంబులు దీర్ఘము
లగు అఇఉఋఌలును వెండి హ్రస్వాభావం
బగు ఏఐఓఔలు నె
సఁగు అం అః అనఁగ షోడశస్వరము లగున్. 124

క. కచటతపవర్గవర్ణము
లేచటఁ స్పర్శ లగు నిరువదే నై మఱి యం
దుచితగతిఁ ఙఞణనమ
ప్రచయం బనునాసికాఖ్యఁ బ్రస్తుతినొందున్. 125

క. యరలవ లంతస్థలు నాఁ
బరఁగును శషసహాలు తేటపడు నూష్మ లనఁ
బొరిఁబిది క్షకారముఁ గూడఁగ
సరి నేఁబది యయ్యె వర్ణసంఖ్య ధరిత్రిన్. 126

క. ళలలకు భేదము లే దను
పలుకున ళాఁ దొలఁగి యైదుపదులగు వర్ణం
బులు సంస్కృతభాషకు మఱి
తెలుఁగున ఱళ లనఁగ రెం డధిక మందు హరీ! 127

గీ. రాఁదొలంగి సమస్తాక్షరముల మీఁదఁ
గార మగుఁ గకారంబు క్షకార మనఁగ
నటు రవర్ణంబుపై నిఫ యనఁగఁ బరఁగుఁ
గాన నిది రేఫ యని పలుకంగవలయు. 128

క. వర్ణం బన నక్షర మన
వర్ణం బన మాతృక యన నక్కర మనఁగా
నిర్ణీతసమామ్నాయములు
వర్ణితములు కృతులయందు వ్రాలకునెల్లన్. 129

క. అదులు వర్గత్రయమును
భూదేవతలు తపవర్గములు రవలును శా
త్రీదయితులు యలశషసహ
లాదటమారుజులు శక్షరాఖ్యలు శూద్రుల్. 130

**మఱి షడ్వర్గంబులు.—**

క. ఏకాదిషడంతముగఁ
బ్రాకటపాదములు గలుగు మంజరి మొదలా
లోకితషడ్వర్గంబులు
శ్రీకలితచ్ఛంద మవధరింపుము కృష్ణా! 131

ఉ. శ్రీనిధి చక్రవర్తిగురుశేఖరపుణ్యకటాక్షలబ్ధసు
జ్ఞానుఁ డనంతధీమణిలసన్మణి భోజచరిత్ర చెప్పి ల
క్ష్మీనరసింహుఁ గూర్చినప్రసిద్ధుఁడు వేడుకతో నొనర్చె ఛం
దోనుతి యోగిహృద్విమలతోయజవర్తి కనంతమూర్తికిన్.

ఉ. రాజులు పాడిఁ దప్పక ధరావలయం బఖిలంబు నేలఁగా
భూజనరాజి సంపదలఁ బొంపిరివోనిసుఖానుభూతిచే
నోజఁ జరింపుచుండెడిఁ బయోజసముద్భవకల్పశాశ్వతం
బై జలజోదరాంకితమహాకృతి సన్నుతి నొందుచుండెడున్.

గద్యము. ఇది శ్రీవాణీవరప్రసాదలబ్ధవాగ్వైభవ తిక్కనామాత్య
తనూభవ సుకవిజనవిధేయ యనంతయనామధేయప్రణీతం
బైనఛందోదర్పణమునందు వర్జనీయంబు లగుదశదోషంబుల
నేర్పఱుచుటయు,నందుదోషరహితంబులై యాదరణీయంబు
లగుపట్లు దేర్పుటయు సంధి సమాసంబులు పంచాశద్వర్ణంబు
లేర్పఱుచుటయు నన్నది చతుర్థాశ్వాసము.

---

# అనుక్రమణిక.

శ్రీ రామా ప్రెస్, మదరాసు.